'యశస్వి'

# గూఢచిత్ర రహస్య ప్రకాశిక



ఆఖ్యాత, వ్యాఖ్యాత :

'సాహిత్యరత్న' సూరపనేని వేణుగోపాలరావు-

సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ, T. C. P. T., M. A., P. O. L.,

రిటైర్డు సంస్కృతాంధ్రాధ్యాపకులు : అక్కినేని నాగేశ్వరరావు కళాశాల, గుడివాడ.

ప్రచురణ : "ఆనందవర్ధన" 40-9/10-12, మునిసిపల్ కాలనీ,

వెంకటేశ్వరపురం పోస్టు - విజయవాడ-10

వెల : [illegible]

"ఆనంద వర్ధన" –ద్వితీయ ప్రచురణ : 1993

గ్రంథము : గూఢ చిత్ర రహస్య ప్రకాశిక

ఆఖ్యాత, వ్యాఖ్యాత : "యశస్వి"

ప్రథమ ముద్రణ : 1993





వెల : రు. [illegible]

"తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురితం"

ప్రతులకు :

"ఆనందవర్ధన"

40–9/10–12, మునిసిపల్ ఎంప్లాయీస్ కాలనీ.

వెంకటేశ్వరపురం పోస్టు, విజయవాడ–10

ముద్రణ :

శ్రీనివాస పవర్ ప్రెస్

అరండల్ పేట : : విజయవాడ–2.

# "గూఢచిత్ర రహస్య ప్రకాశిక"
# మున్నుడి-నివేదనము

'చిత్రకవిత్వం' అనేది ఆలోచనల-విశ్లేషణ, వివేచన, ప్రసాధనలకు, భావాల అభివ్యంజనకు, స్ఫూర్తిని ప్రసాదించు ప్రత్యేక కళ. మానవజన్మ సాఫల్యం ఆతని వాక్కులో కూడ కేంద్రీకృతం కావటం వలన, అతని సుఖ దుఃఖాద్యనుభూతిని తెలుపదలంచిన కవి 'కేవల-ఐహిక వస్తువును చమత్కృత-శబ్దసాహచర్యంతో, కమనీయం, గమనీయంగా తీర్చిదిద్ది, అందరికీ అందిస్తాడు.

"వాగర్థా వివ సంపృక్తౌ...."(రఘు.1-1) శ్లోకంలో, శబ్దార్థాల అవినాభావాన్ని, పార్వతీ పరమేశ్వర సంబద్ధంగా సంస్కరించాడు కవి కాళిదాసు. "....శబ్దార్థౌ సహితౌకావ్యమ్...." ఇత్యాదిగా, కావ్యలక్షణ కథనం చేశారు ప్రాచీనాలంకారికులు. అట్టి శబ్దార్థాలు చమత్కార చందనంతో చర్చింపబడినపుడు, చేతో మోదాన్ని గల్గించి, పాఠకుల తలల నూగిస్తుందని, విశ్వేశ్వరాదుల వివరణ. కనుకనే, కావ్యశిల్పానికొక పెట్టని సొమ్ము, కట్టనివలువగా వన్నెకెక్కిన, చమత్కారాన్ని "కావ్యాత్మ"గా వారు పేర్కొన్నారు.

శబ్దానుగ్రహంతోనే పరస్పర వ్యవహారాదులన్నీ సార్థకమౌతున్నాయి. ఆశబ్దజ్యోతి లేకపోతే, సర్వ ప్రపంచం, అజ్ఞానావృతమై పోతుందని, దండి మహాకవి దండన. వస్తుస్థితికి వంగియుండని మానవుని అస్తిత్వానికి, కల్పన ఒక అంగం. ఏదో ఒక కల్పనో, చిత్రమో, అతిశయోక్తియో, అంటూ, వింటూ, ఉంటేగాని, అతనికథ నడవదు. కనుకనే, అతడు ప్రేయసీ ముఖాన్ని "ముఖచంద్రుడనో, ముఖకమలమనో" ముదలకిస్తాడు. చదువు సంధ్యలు లేని సామాన్యుడు సైతం, "వాడు రాక్షసుడు. అతడు హరిశ్చంద్రుడు. అదిరంభ. ఆచెట్టు ఆకాశాన్నంటుతోంది... ఇత్యాదిగా అలంకృత భాషనువాడి, ఆత్మానుభూతిని పొందుతాడు. ఆ అనుభూతి "స్వభావోక్తి" వల్ల కల్గినా, చప్పగా ఉంటుంది. ఇంకా తేటతెల్లంగా తెల్పితే, అది "వార్త" కావచ్చుకాని "కవిత్వం" కాజాలదు. అట్టి ప్రకటన వ్యాపారం, కల్పనలతోపాటు నవనవోన్మేషంచెందితే రమణీయమౌతుంది. ఆరామణీయకం అలంకారానికి అమ్మ, ఆత్మ.

వాస్తవానికి అతిశయోక్తిలేని అలంకారమే లేదని, దానికోసం, కవులందరూ ప్రయత్నించాలని-భామహాదుల భణితి. కూడు. గుడ్డ, గూడులేక అష్టకష్టాల కడలిలో అణగారి పోతున్న అధోజగత్సహోదరుడు సైతం ఎలాగో టిక్కెట్టుకొని, శబ్దచిత్రాల-అతియోక్తుల-ద్వంద్వార్థాల- ఆర్భాటాలతో నిండిన

సంభాషణలను, పాటలను, అలంకృత-ఆకారాలను, నాటకాలలో. సినిమాలలో చిత్రాలలో (అర్థంకాని పరభాషలోనైనా) అపరిమితానందంతో, ఆదమరచి. చూచి విని, పగటికలలు కంటూ పస్తుపడుకొంటాడు. కాటిసీనుగాంచి, పరవశంతో కంటతడిపెట్టి. పలవిస్తాడు. ఇలా ఏడ్వటానికేనా? అంతకాలం ధనం ఖర్చుపెట్టి. తిండిమాని, టిక్కెట్టు కొన్నది? కాదు, కాదు. శోకరంలో కూడ పామరుడు పరమానందానుభూతిని అందుకొంటాడు. వాల్మీకి మహర్షి శోకమే గదా "శ్లోక"మైనది। ఇక రసజ్ఞుల సంగతి చెప్పనేల? అదే సౌశబ్దం సాధించే సాహిత్యం, బ్రహ్మానందసబ్రహ్మచారిత్వం, అదంతా శబ్దచిత్ర శ్రవణ, సంగీత మాధుర్యాల మాహాత్మ్యంలో, ప్రభావంలో మణగియున్నదనుట నిర్వివాదాంశం. వస్తుతః, కావ్యపరమోద్దేశం ధన. వ్యవహార, జీవనానుకరణ, ఉపదేశ.... ఆదికమే కాదు. చమత్కారంతో చేతోమోదాన్ని, సద్యః పరనిర్వృతిని సమకూర్చడం కూడ. "ఎక్కడ శబ్దార్థాలు సాక్షాత్తుగ సంకేతితమైన తమ అర్థాన్ని, అప్రధానంచేసి, అన్యవ్యంగ్యార్థబోధను వ్యంజింపజేస్తాయో, అది ధ్వని లేక ఉత్తమ కావ్యమని, ఆనందవర్ధనోక్తి. [ఆ. ధ్వ. 1-13]. కాని, ఆవ్యంగ్యం అతి ప్రయత్నంలో అర్హత సంపాదించిన సహృదయులకే అర్థమౌతుంది. ఆది కావ్యమైన రామాయణంలోగాని, కాళిదాసాది మహాకవుల కావ్యాలలోగాని, ఆవ్యంగ్య విశేషం అన్నిచోట్ల, వ్యక్తం కాదు. సందర్భానుసారంగా శబ్దార్థాలంకారాలతో పాటు చెన్నొంది ఉంటుంది.

సంస్కృత సాహిత్యంలో "అలంకార, రీతి, వక్రోక్తి, చమత్కార, .... ధ్వని ప్రస్థానాదులెన్నో, పరస్పర విరుద్ధ విమర్శలతో ప్రబలంగా పాదుకొన్నాయి. మొదటివన్నీ అలంకార ప్రస్థానాంతర్గతాలు కాగా. తర్వాత, రస మహత్త్వ పెరిగిన కొలదీ అలంకార ప్రాశస్త్యం తగ్గి, భావపక్షం భవ్యంగా భావింపబడింది. అర్థాలంకారాలకంటె, శబ్ద చిత్రాలంకారాలపై చిన్నచూపు పడినను, కళాపక్షాన్ని ఆశ్రయించిన కవులు, వక్ర-గూఢ-కూట.... ఆది జటిల పద్ధతులతో, వైచిత్ర్య, వైశిష్ట్యాలను వక్కాణింప ప్రయత్నించారు.

మధ్యయుగంనాటి, పూర్వరాజాస్థానాలలో, పండిత గోష్ఠులలో, సరస్వతీ సదనాలలో, కావ్య-ప్రబంధ-శాస్త్రాలాపాలతోపాటు, గూఢ, కూట. ప్రహేలికా, చ్యుతకాదిశబ్ద చిత్రక్రీడలు, కోకొల్లలని బాణకవి కాదంబరి

కథించుతోంది. చారుచిత్ర నిరీక్షణం కావాలనుకొన్న ప్రతికవి "కావ్యాంగ విద్యాధిగమము, గోష్ఠీ ప్రహసనజ్ఞత, పరోన్వేషజిగీష, వ్యుత్పత్తి సర్వ శిష్యత, ఇంగితాకారవేదిత్వం, పరాక్షేప సహిష్ణుత్వం, .... మొ.లగు పాటులన్నీ పడిగాని, ప్రావ్ర్తగిరాంధురంధరుడు కాలేక పోయేవాడు. అసలు ఆగోష్ఠులలో పాల్గొనక పోవటం కవులకు కళంకంకాగా, వారి కావ్యాలు కావ్యాభాసలుగా భావింపబడేవట. వృత్తి, విద్యలు తప్ప. ఉక్తి విద్యలు లేని మధ్యయుగంలో కాకపులేకాదు. కొందరు సుకవి పండితులు కూడ ఛామందులను, చిత్రాలంకారా లతో చిత్రికపట్టి, పుడి-మాన్యాలు గడించారు.

వేదోపనిషద్ధ్రిష్టులకు కూడ సాదృశ్యా్యోపాలకు, ధార్మిక, ఆధ్యాత్మిక అనుభూతుల వ్యక్తీకరణకు, ఈ గూఢ, కూట, ప్రతీకాత్మక పద్ధతులు ప్రత్యే కంగా కావలసివచ్చినవి. ఆశుకవితవలె భారతాన్ని "కలం కుంటుపడకుండా చెప్పితే వ్రాస్తా"నని ముందుకు వచ్చిన గణపతితో, "చెప్పింది అర్థం చేసు కొని వ్రాయు"మని, ఆ పరుగుపందెంలో అక్కడక్కడ, గ్రంథ గ్రంథుల (చిక్కుముళ్ళ)తో, గణపతి మెదడుకు మేతవేసి, గడుసుగా గండం నుంచి గట్టెక్కాడట వ్యాసభగవానుడు. కనుక భారత గ్రంథులు 8 వేలు దాటి, ఛేదింపరాని, కొరకరాని కొయ్యలైనవి. ఇక, మూడవ తరగతిలో చేర్చబడిన చిత్రకావ్యం. అవరంగా, అధమంగా, గర్హింపబడినా, వేదకాలం నుండి అనుస్యూతంగా వస్తానే ఉంది. "అధమాలని అనాదరించిన, కవుల కావ్యాలలో కూడ, అవి సోదాహరణంగా చోటు చేసుకోవడం మరీ ఆశ్చర్యం అల్పాక్షరాలతో, చమ త్కారం చిందేటట్లు అనల్పార్థాన్ని సృష్టించి, మాట్లాడటం గాని వ్రాయటంగాని, మానసికారోగ్యాని కొరకు మానదండం, శరీరబలానికి వ్యాయామాది క్రీడలవలె, మేదస్సుకు మెత్తగా శ్రమాపాదకాలైన శబ్దచిత్రక్రీడల నెరుగుటకు, వ్యాకర. ణాది వైదుష్యం అనివార్యం. సుందర చిత్రాలు ప్రయోక్తల శేముషికి శేవధు (నిధు)లై, జ్ఞానతృష్ణను, జ్ఞాపక శక్తిని పెంచి, పాఠకులకు విజ్ఞాన, వినోదా లనేగాక, ఆశ్చర్యానందాలను సైతం అమేతలుగా అందిస్తాయి. కనుకనే. చిత్ర మనగానే చెవికోసుకొనే వారెందరోతయారయ్యారు. ఇట్టి చిత్రకావ్యాలలో "గూఢ చిత్రాల జ్కార" మొకప్రముఖ ప్రక్రియ. ఛల(నెపము), కైతవ(మోసము)ఆది శబ్దా లతోదీని ప్రయోగా లెక్కువ. "పీడించుట" అనే అర్థాంతరంలో మొదట పీడించినా పాఠక హృదయాలలో కుతూహల, విస్మయాలను ఉత్పన్నం చేస్తుంది. తర్వాత బుద్ధిబలంతో ఈ క్లిష్టతను భేదించిన పాఠకులు మాత్రం, విస్మయ విస్ఫారితా- క్షులై, అమందానందాన్ని అనుభవిస్తారు. దీనికి "సమాధి, బ్రహ్మోద్య, గ్రంథ

గ్రంథి.... ఇత్యాదిగా పర్యాయపదాలెన్నో ఉన్నాయి. కూటః గూఢ, ప్రహేళి కాదులను పర్యాయపదాలుగా కూడ, కొందరు నిర్దేశించారు. ఈ విశేషాలన్నీ మా "ప్రహేలికా ప్రపఞ్చః", "కూటార్థకర దీపిక"లలో గాంచగలరు.

చిత్రకావ్యాలంకారాభ్యాసావసరాన్ని కొందరుకవులిట్లు వక్కాణించారు.

పరవాక్-ముద్రిణం

1. పరవాఙ్ముద్రణం స్వస్య పాండిత్యస్య ప్రదర్శనమ్।
చికీర్షితం చే దుభయం గ్రంథోఽయం క్రియతాం ముఖే॥ చ.చి.1-6

2. యద్యస్తి సభామధ్యే స్థాతుం వక్తుం మన స్తదా సుధియః।
తాంబూల మివ గృహీత్వా "విదగ్ధముఖమండనం విశత॥ వి.ము. 1-8

3. య స్మై చ రోచతే నేదం నమ స్తస్మై మహాత్మనే।
అపి భాస్వాన్న శక్నోతి భేత్తు మన్త ర్గుహం తమః॥

1. సభలలో, గోష్ఠులలో, పరపండితుల నోడించి, నోరుమూయించి తమ పాండిత్య ప్రకర్షను ప్రదర్శింపాలనుకొంటే, తన "చిత్ర రత్నాకరము"ను కంఠస్థం చేయాలని "చక్రకవి". 2. నిర్భయంగా నిండు సభలలోనిల్చి, మాట్లాడ దలంచిన పండితులు, నా "విదగ్ధముఖ మండన" గ్రంథమును. "తాంబూలమును వలెగ్రహించి, రాగరంజితం చేసుకోవాలని, "ధర్మదాససూరి" ఈ 'కల్పలతా వివేకంలో చెప్పిన, వినోద, చమత్కార. స్ఫోరకశబ్దచిత్రాలంకార ప్రపంచము ఏమహా(ఽ) పండితునికైన రుచింపనిచో ఆప్రబుద్ధునకొక నమస్కారం, తప్ప ఇక నేనేమీ చేయలేను. సహస్రకిరణుడగు సూర్యుడుకూడ, బైటనున్న చీకటిని చీరగలడుగాని, గుహలో దాగిన చీకటి నెట్లు ఛేదింపగలడని ఎత్తిపొడిచాడొక కవి. అసలు, "శ్లేష, చిత్రాలు లేకుండా వాగ్వైదగ్ధ్య మెలావస్తుం"దని ప్రశ్నిస్తాడు మరొక కవి ఉపమా, అర గౌరవ, పదలాలిత్యగుణత్రయంతో గురుత్వం వహించిన మాఘకవి (మాఘే సన్తి త్రయో గుణాః)'శిశుపాలవధ" 19వ సర్గలో మొత్తంగా చిత్రభేదాలను చిత్రించి కళాపక్షపోషకుడైనాడు. "గూఢోక్తి నొక ఆటబంతిగాఆడించాడురసార్ణవాలంకారకర్త" "గూఢోక్తిం కేశికం దుకమ్" కావ్యంలో చిత్రకవితను తప్పక చొప్పించా'లన్నారు-నన్నెచోడ, భైరవాది ఆంధ్రకవులు. 'ఆశుకవిత్వంబు లల్లితేనే సరా? చిత్రప్రబంధముల్ చేయవలదె' అని చిత్రరచనలకు ప్రబంధత్వాన్ని ప్రతిపాదించింది కవయిత్రి ముద్దుపళని ఈచిత్రరచనలకు విస్మితుడైన ఏ.బి. కీత్ మహాశయుడు" విశ్వభాషలలో విలక్షణతా సంపన్నమగు సంస్కృతమే చిత్రరచనకు సక్షమమైన భాష" అని ఎలుగెత్తి చాటాడు.... ఇలా ఎందరో మహానుభావులు చిత్రాలంకారచాతుర్యాన్ని పలు విధాల ప్రస్తుతించారు.

ఈ "గూఢచిత్రా"లకు వేదోపనిషచ్ఛాస్త్ర భారత భాగవత మహాకావ్య... ఆదులనుండి; సంస్కృత, ప్రాకృత, పాళీ, అపభ్రంశ, కాశ్మీరీ.... మొదలగు భాషలనుండియేగాక, ఆధునిక-ఆంధ్ర, బెంగాలీ, హిందీ వాణులనుండి, గ్రీక్, లాటిన్, ఫ్రెంచి, ఆంగ్లాది పాశ్చాత్య భారతులనుండియు, ఉదాహరణాంతరాలెన్నో ఉట్టంకింపబడినవి. ఆయా భాషా స్వరూప స్వభావాలను బట్టి, పద్యాలు ఎన్నిరకాల ఒడుపులతో, మలుపులు త్రిప్పి, మార్పుచేయవచ్చునో, ఛందః పరిధిని దాటకుండానే, ఎన్ని క్రియా, కారకాది గూఢాలను గుప్తం చేయవచ్చునో, అలా పరిశ్రమించి, ప్రాగల్భ్యంతో ప్రకటించిన, చిత్రకవులెంత భాషా పరిశోధకులో, వారి పరిశీలనలు ఆనాటి, నేటి వారికెంత స్ఫూర్తి నిచ్చి, కొంగ్రొత్త పుంతలను త్రొక్కిస్తున్నాయో—పాఠకులు పరిశీలింపవచ్చును." క్లిష్టార్థ, గూఢార్థ, నేయార్థ, అప్రయుక్త దోషాలను కూడ, ఆ కవులు తమ విచిత్ర-శబ్ద చమత్కార చందనాలతో చర్చించి, అర్థగోపనంలో గుణాలుగా గుర్తింపజేసి, పాఠకులను పాక్షికంగా విస్మయ వికసితాక్షులను చేస్తున్నట్లు కూడ నిరూపించినాము.

బహుశః, పాండిత్య ప్రకర్ష, వ్యాకరణ విజ్ఞానాద్యావశ్యకత, శ్రమా సహిష్ణుత్వం, ధిషణాకషణాదులవల్ల గాబోలు, పరిశోధనక్షేత్రంలో కూడ, చిత్రాలంకారాలపై చిన్నచూపే చిగిర్చింది. ఆంధ్రదేశంలో అద్యావధి, సంధర్భానుసారంగా గాక, పై చిత్రకావ్య ప్రక్రియాసామస్త్యముపై, ఇతర భాషలతో తులనాత్మకంగా సమన్వయించి, ప్రకటించిన పరిశోధకుల ద్వారా, సందేహ నివృత్తి కొరకు, కొందరు మాన్య - విశ్వవిద్యాలయ-ప్రాధ్యాపక మహాశయులను, మిత్రులను, సవినయంగా ప్రశ్నింపగా, తమ దృష్టిలోనికి రాలేదని, కొందరు ప్రారంభించి, విఘ్న నిహతులై విడిచిపెట్టారని, ఏమైనా తులనాత్మక పరిశీలనతో పరిశోధన గ్రంధాలేమీ రాలేదన్నట్లు చెప్పారు. లేక పరిశీలించిన ప్రముఖుల పరిశోధనలను ప్రకటించి, పుణ్యం కట్టుకొనే పబ్లిషరు కూడ, దొరకలేదో? ఏమైనా, మా ప్రయత్నానికి ప్రాథమ్యాన్ని అంటగట్టుకొనుటకు సాహసింపలేమని మనవి. పూర్వసూరి పరామృష్ట చిత్ర-ప్రక్రియలెన్నో చెదరిపోయాయి. అట్టి విస్మృత ప్రాజ్య చిత్ర కవితా సామ్రాజ్యాన్ని, సమగ్రంగా, సాధికారంగా, తులనాత్మకంగా, సమీక్షించి, ఇనాలోకయోగం కల్గించటం, ఏ మహాపండితులకో, ప్రభుత్వాలకో, అకాడమీలకో గాని సాధ్యం కాని పని. అనంత వ్యయప్రయాసలతో కూడిన మహాయజ్ఞం.

గ్రంథి.... ఇత్యాదిగా పర్యాయపదాలెన్నో ఉన్నాయి. కూటః గూఢ, ప్రహేలి కాదులను పర్యాయపదాలుగా కూడ, కొందరు నిర్దేశించారు. ఈ విశేషాలన్నీ మా "ప్రహేలికా ప్రపఞ్చమ్", "కూటార్థకర దీపిక"లలో గాంచగలరు.

చిత్రకావ్యాలంకారాభ్యాసావసరాన్ని కొందరుకవులిట్లు వక్కాణించారు.

పరవాక్ - ముద్రిణం

1. పరవాఙ్ముద్రణం స్వస్య పాండిత్యస్య ప్రదర్శనమ్।
చికీర్షితం చే దుభయం గ్రంథోఽయం క్రియతాం ముఖే॥ చ.చి.1_6

2. యద్యస్తి సభామధ్యే స్థాతుం వక్తుం మన స్తదా సుధియః।
తాంబూల మివ గృహీత్వా "విదగ్ధముఖమండనం విశత॥ వి.ము. 1_8

3. య స్మై చ రోచతే నేదం నమ స్తస్మై మహాత్మనే।
అపి భాస్వాన్న శక్నోతి భేత్తు మన్తర్గుహం తమః॥

1. సభలలో, గోష్ఠులలో, పరపండితుల నోడించి, నోరుమూయించి తమ పాండిత్య ప్రకర్షను ప్రదర్శించాలనుకొంటే, తన "చిత్ర రత్నాకరము"ను కంఠస్థం చేయాలని "చక్రకవి". 2. నిర్భయంగా నిండు సభలలో నిల్చి, మాట్లాడ దలంచిన పండితులు, నా "విదగ్ధముఖ మండన" గ్రంథమును. "తాంబూలమును వలెగ్రహించి, రాగరంజితం చేసకోవాలని, "ధర్మదాససూరి" ఈ 'కల్పలతా వివేకంలో చెప్పిన, వినోద, చమత్కార. స్ఫోరకశబ్దచిత్రాలంకార ప్రపంచము ఏమహా(ఽ) పండితునికైన రుచింపనిచో ఆప్రబుద్ధునకొక నమస్కారం, తప్ప ఇక నేనేమీ చేయలేను. సహస్రకిరణుడగు సూర్యుడుకూడ, బైటనున్న చీక టిని చీరగలడుగాని, గుహలో దాగిన చీకటి నెట్లు ఛేదింపగలడని ఎత్తిపొడిచా డొక కవి. అసలు, "శ్లేష, చిత్రాలు లేకుండా వాగ్వైదగ్ధ్య మెలావస్తుం"దని ప్రశ్నిస్తాడు మరొక కవి ఉపమా, అర్థగౌరవ, పదలాలిత్యగుణత్రయంతో గురు త్వం వహించిన మాఘకవి (మాఘే సన్తి త్రయో గుణాః)'శిశుపాలవధ" 19వ సర్గలో మొత్తంగా చిత్రభేదాలను చిత్రించి కళాపక్షపోషకుడైనాడు. "గూఢోక్తి నొక ఆటబంతిగాఆడించాడురసార్ణవాలంకారకర్త" "గూఢోక్తిం కేళికందుకమ్" కావ్యంలో చిత్రకవితను తప్పక చొప్పించా'లన్నారు_నన్నెచోడ, భైరవాది ఆంధ్రకవులు. 'ఆశుకవిత్వంబు లల్లితేనే సరా? చిత్రప్రబంధముల్ చేయవలదె? అని చిత్రరచనలకు ప్రబంధత్వాన్ని ప్రతిపాదించింది కవయిత్రి ముద్దుపళని. ఈచిత్రరచనలకు విస్మితుడైన ఏ.బి. కీత్ మహాశయుడు" విశ్వభాషలలో విల క్షణతా సంపన్నమగు సంస్కృతమే చిత్రరచనకు సక్షమమైన భాష" అని ఎలు గెత్తిచాటాడు....ఇలా ఎందరో మహానుభావులు చిత్రాలంకారచాతుర్యాన్ని పరి పరి విధాల ప్రస్తుతించారు.

ఏనాడో, కొద్దిగా పరిశీలించి, సాహిత్య సమ్మేళనాలలో ఉపన్యసించి, కొన్ని ప్రకటించినాము. కాని, నేడు వాని సమగ్ర పరిశీలన, అజ్ఞానం, అల్పజ్ఞానం, బుద్ధి మందగిస్తున్న వయోవృద్ధులమై కూడ, దురాశతో ప్రయత్నించడం, చూస్తూ చూస్తూ దుఃఖాన్ని కొనితెచ్చుకోవడమే. ప్రాజ్ఞత్వ కాంక్షతో ప్రజ్ఞులము (దొడ్డి కాళ్ళ వారము) కావడమే. మందుడు మహాకవియశః ప్రార్థియైతే, అపహాస్యంపాలు కాక తప్పదని, కాళిదాస కవీంద్రుడు దేనాడో హెచ్చరించినాడు.

అయినా, "ఆశా-బలవతీ" – అందరూ సులభ వాఙ్మయానికే ఎగబడితే పరిశోధన లెలా ప్రవృద్ధాలౌతాయి? యు.జి.సి. సహాయం రిటైరైనవారికందదు. ముఖ్యంగా, సంస్కృత భాషానభిజ్ఞులగు సగటు-సామాన్యులకు సూక్ష్మంలో మోక్షంగానైనా, సంస్కృత చిత్ర సాహిత్య సుధను, ఆంధ్రాదిభాషల నద్దుపెట్టు కొని, అందించాలని సంకల్పించాము. కాని, ప్రకటించాలనుకొంటే కథ అడ్డం తిరుగుతోంది. అన్నిటి ధరలు ఆకాశాన్నంటుతున్న నేటి కాలంలో, పరిశోధన గ్రంథాలను, పారితోషికం లేకుండా, ప్రకటించుటకు కూడ, ఏ పబ్లిషరు ముందుకు రావటం లేదు. చేసిన పరిశోధన వృథా అవుతున్నదని, నిరాశ చెందక, వ్యయ ప్రయాసలకు లోనై, సాహసించి, లోను (Loan)చేసి, చేతి సమురుభాగవతంతో, మా "ప్రశ్నోత్తర చిత్రాలంకార" గ్రంథమును ప్రకటించి, చేతులు కాల్చు కొన్నాము. ఇక, వాని అమ్మకం మరింత కష్టమౌతోంది. పుస్తక విక్రేతలకిస్తే అమ్మిన తర్వాత డబ్బిస్తామని, 40శాతం, 50 శాతం కమీషన్ తీసుకొంటున్నారు. కనుక, రేట్లు పెంచక తప్పటంలేదు. ఇట్టి పరిస్థితులలో పరిశోధనల ఫలితాలు పాఠక హృదయాలకు ఎలా చేరుతాయో అర్థంకాదు. పరిశోధనలు అనగానే, అవి మొదట పాఠకుల మెదడును మేదించి, బౌద్ధిక వ్యాయామంతో ఛేదించిన తర్వాతగాని, అమందానందాన్ని కల్గింపవు. కాని, దారిద్ర్యంతో దద్దరిల్లు సాధారణ ప్రజలుగాని, ధనదాహంతో కోట్లకు పడగలెత్తి, శ్రమను సహింపలేని ధనవంతులుగాని,ఎందరు, ఎంతవరకు, ఆ గ్రంథాలను కొని, చదివి, అర్థం చేసుకొని, ఆనందించి, ప్రోత్స హిస్తారన్నది ప్రశ్నార్థకమే। ప్రజాస్వామ్యయుగంలో ప్రజలు, గ్రంథాలయాలు, ప్రభుత్వాలే పోషించాలి. బడ్జెట్టులో కేటాయింపులేనిదే వారేమి చేస్తారు? ఇదొక విషవలయం. తీగలాగితే డొంకంతా కదులుతుంది.

ఇంతలో "తెలుగు విశ్వవిద్యాలయం' వారు "ఉత్తమ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయ ప్రణాళిక" (1992-93) క్రింద, ఈ "గూఢచిత్ర రహస్య ప్రకాశిక"ను ఎంపికచేసి. దయతో నాలుగువేల రూపాయల ఆర్థిక సాహాయ్యం" అందజేసి, ముద్రణకు కొంత ప్రోత్సాహమిచ్చినందును, వారి వదాన్యతకు హృదయపూర్వక కృతజ్ఞతాంజలి. ఇక మిగిలిన పది చిత్ర ప్రక్రియ లెప్పుడు ఎవరి సహాయంతో, ఇనాలోకయోగ్యము నొందగలవో ?

నేడు ఏ ప్రచారసాధనాలలో, ఎక్కడ చూచినా, రంగులతో, రంగవల్లులతో "రుచిచూడు" 'రమ్మ"ని మత్తెక్కిస్తూ, ప్రమానుపడజేస్తున్న పేద చిత్ర వల్లరుల సంగతి నిక వాకొననేల? ఇలా "చిత్రకావ్య ప్రపంచ సుమేరు శృంగాన్ని అల్పాంశతో అద్దంలో చూపినట్లు' ఆయా భాషా సారస్వతాలలో, తత్రాపి సంస్కృత వాసనలేని సామాన్య పాఠకులకు, స్థాలీ పులాకన్యాయంతో, పరిచయాం చేయు సంకల్పంతో, సోదాహరణంగా, అవసరమగుపదచ్ఛేద- అర్థ - తాత్పర్యాలతో, ప్రకటించి, పండితాఖండలుల పాదపంకేరుహములందును, పాఠక మహోదయుల కరకమలములందును, సప్రశ్రయంగా దీనిని సమర్పించుకొన్నాము.

లోగా, మా ప్రశ్నోత్తర చిత్రాలంకారము"ను చారదృష్ట్యా, విచార దృష్ట్యా, సవార్థ తత్త్వావగాహనతో సమగ్రంగా సామగ్రహంగా సమీక్షించి, అమూల్యాభిప్రాయముల నిచ్చి ప్రోత్సహించిన రేడియో-పత్రికల- అధిపతులకు, పాఠక, పారిషద, పండితకేసరులకు ప్రణామ శతములు. ఈ "గూఢ చిత్ర రహస్య ప్రకాశిక"ను కూడ, అట్లే జిజ్ఞాసతో పఠించి, అనుగ్రహింప ప్రార్థించుచున్నాము. విరళ పరిచారత, విషయదురూహత, వ్యాఖ్యానసాపేక్షత, ఆకరాభావం, అల్పజ్ఞత, వయోభారం.... మొ. కారణాలవలన, ప్రస్తుత పరిశోధనలో దొరలిన దోషాలను తెలిపిన, కృతజ్ఞతతో దిద్దుకొందుమని మనవి ఎంత వ్యాఖ్యానమున్నా, సామాన్య పాఠకుల కిది ఒకచో దురవగాహమై, శిరఃకంపమును గల్గింపవచ్చును. కనుక "రసాయనము" (జరామరణ వ్యాధులను తగ్గించు మందు)ను వలె, అనుదినము మదురకరవృత్తితో, కొద్దికొద్దిగా సేవించినచో, పాఠకుల జరామరణ దుఃఖములను. వయస్సును, గూఢంగా వంచించి, మందులు (మందబుద్ధులు) వాడే మందుల (ఔషధాల) అవసరంలేకుండానే, మానసికా రోగ్యానందములను మాసరము(వ్యాప్తము)చేయ గలదని నమ్ముచున్నాము.

నేటి కంపోజిటర్లు సంస్కృతభాషాసంజ్ఞాగుణచేస్ఎన్నిసార్లు ఎంతగట్టిగా కళ్ళలో వత్తులుపెట్టుకొని కంటుకగడలతో పరీక్షించి దిద్దినా, ముద్రారాక్షసా లెన్నో ముసురుకొంటూ వచ్చినందుకు క్షమిస్తూ అర్థతాత్పర్యాదుల సాయంలో సరిదిద్దుకొన ప్రార్థితులు.

ఈ గ్రంథరచనను, ప్రచురణను ప్రోత్సహించి. దయతో సహాయపడిన పెద్దలకు, ముద్రించిపెట్టిన శ్రీ దంటు కృష్ణమూర్తిగారికి హృదయపూర్వక కృతజ్ఞతలు.

"ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్."

ఇతిశమ్. వినమ్ర విధేయుడు,

"యశస్వి"

(సాహిత్యరత్న. సూరపనేని వేణుగోపాలరావు)

ఆనందవర్ధన
విజయవాడ - 10

# గూఢచిత్ర రహస్యార్థ ప్రకాశిక

సంస్కృత సాహిత్య మొక సముద్రం. అదొక రత్నాకరం– దానిని దాటుట దానిలో వున్న అనర్ఘ రత్నాలను వెదకి వెలికి దీయుట, వాని విలువ కట్టి విస్తరింప జేయుట, ఏ కొందరు మహాత్ములకో గాని సాధ్యాలు కావు. మహా కవి కాళిదాసంతటివాడే "తిర్తుః దుస్తరం మోహా దుడుపే నాస్మి సాగరమ్" (అల్పబుద్ధితో అజ్ఞానంతో అనంత సాగరాన్ని తెప్పకొయ్యతో దాట ప్రయత్నిస్తున్నాను) అనగా, మహాల్ప బుద్ధులమగు మన బోంట్ల సంగతి మరి చెప్పనేల? అయినను చాపల్యము ప్రచోదించ ప్రయత్నిస్తున్నామని మనవి.

కావ్యానికి అలంకారాలు ఆభూషణాలు. అవి కావ్యశాస్త్రజ్ఞులచే "శబ్ద– అర్థ– ఉభయ–" భేదంతో మూడు విధాలుగా విభజించబడినవి. ప్రస్తుత చిత్రకావ్యాలంకారాలు శబ్దాలంకార పరిధిలో నున్నవి. అవి స్వర, స్థాన, వర్ణ, గతి, ప్రహేళికా, చ్యుత, గూఢ, ప్రశ్నోత్తర, సమస్యా, భాషా, బన్ధ చిత్రాది భేదాలతో అనేక విధాలు. వీని వివరాలు వెల్లడించటం సామాన్యులకు సాధ్యం కాని విషయం. అయినా "యత్నే కృతే యది న సిద్ధ్యతి కోऽత్ర దోషః" ప్రయత్నించటం మానవసహజం. ప్రయత్నించక పోవడం దోషం. ఎంత ప్రయత్నించినా కార్యసిద్ధి లభించకపోతే, దాన్ని మానవుని దోషంగా అంటగట్టలేము. అది కొంతవరకు సహ్యము. ప్రస్తుతం యథాశక్తి ప్రయత్నించి "ప్రశ్నోత్తర చిత్రాలఙ్కార" నామంతో, ఒక పుస్తకం వెలువరించాము. ఈ "గూఢచిత్ర రహస్యార్థ ప్రకాశిక" ద్వితీయ పుష్పం. పాఠక ప్రవీణులు పరిశీలించి, పరిగ్రహించి, అనుగ్రహింప ప్రార్థితులు.

ఈ గూఢ చిత్రాలను వివరిస్తూ "విదగ్ధముఖమణ్డన" కర్త యగు ధర్మదాస సూరి, అజమారాది గూఢాలనిట్లు వర్ణించెను.

## అజమారాది గూఢజాతి–తత్ప్రయోజనములు :

"విదగ్ధ ముఖమండన'' కర్తయగు ధర్మదాసు "కాలము,సారము" మొదలగు హృదయ మనోహర జాతులను తెలిపి, పిమ్మట "అజ, మార" ఆది గూఢజాతి ప్రయోజనముల నిట్లు తెలుపుచున్నాడు.

శ్లో॥ (కాలసారాదికం హృద్యం) అజమారాది గూఢకమ్ ।
విదగ్ధో దుర్విదగ్ధానాం కురుతే దర్ప శాన్తయే॥

విద్వాంసుడు గర్వితులగు దుష్టపండితుల మదము నణచుటకై, కాలసారాది హృద్య జాతిని, అజమారాది గూఢ జాతిని రచించుచున్నాడు.

వివరణ : అజమారాది గూఢము లనగా 1. అజ (శివ), 2. మార (మన్మథ) మరియు, ఆది శబ్దముచే - 3. పద 4. పాద 5. అర్థములు మొదలగు గూఢము లను గ్రహింపవలెను. ఇవన్నియు ఎక్కడ గూఢములుగ నుండునో, వానిని "అజ మారాది గూఢము" లందురు. దుర్మదాంధులగు దుష్టపండితుల నెందరినో, వారి గర్వము నణగగొట్ట దలంచినచో, వీని నభ్యసించిన విజ్ఞులైన వారు మాత్రమే, సమర్థులగుదురనియు, వారి దుర్గర్వము నణచుట కవసరమైన రహస్యము లన్నియు వీనిలో ఎన్నో గలవనియు భావము.

1. అజుడనగా ఈశ్వరుడు, అతనిని గూర్చి చెప్పు శబ్దము గుప్తమైనచో, అది "అజగూఢము" 2. మారుడు (మన్మథుడు) గుప్తముగ నున్నచో, అది "మారగూఢము" 3. పదము విభక్త్యంతము, అది గూఢముగ నున్నది "పద గూఢము" 4. శ్లోకము యొక్క నాలుగవ భాగమును "పాద" మందురు. అది గుప్తమైన "పాదగూఢము". 5. అర్థమనగా శబ్దము యొక్క అర్థము. అది గూఢ ముగ నున్నచో దానిని "అర్థగూఢ" మందురు.

ఇక వీనికి. తరువాత ఇతర గూఢ విశేషములకు క్రమముగా యథావసరముగా ఉదాహరణములు. ఉదాహరణాంతరములు కూడ తెలుపబడుచున్నవి.

## 1. అజ గూఢ జాతి

శ్లో॥ రవిసుత కృతగోకర్ణః శ్రుతి విషయ గుణాంబరో వనాత్మధరః।
నరకశిరా జగదఖిలం చిర మవ్యా దనమరు క్ప్రాణిః॥ (వి. ము. 4-14)

(న జాయతే ఇతి =) అజః = పుట్టుకలేనివాడు (శివుడు) అతడు గూఢ ముగా నున్న "అజగూఢము"నకీ శ్లోకము ఉదాహరణ.

అర్థము : 1. రవిసుత కృతగోకర్ణః- రవిసుత = సూర్యపుత్రుడు- కర్ణుడు. అనగా పుంలింగప్వారస్యమున "కర్ణము" (చెవి) అనుకొనవలెను. రవిసుతుని కర్ణము నందు కృతమైన గోకర్ణము ( = కన్నే చెవిగా గలది చక్షుశ్శ్రవము)= సర్పము. అనగా సర్పాన్ని కుండలము (కర్ణాభరణము)గా ధరిం చిన వాడని అర్థము.

2. శ్రుతి విషయగుణామ్బరః, శ్రుతివిషయగుణ = శ్రోత్రేంద్రియ (చెవికి) గోచరమైనది- శబ్దము అశబ్దముగుణముగాగలది(ఆకాశము). ("శబ్ద గుణక మాకాశమ్" అని తర్కశాస్త్రము) ఆ ఆకాశము - అమ్బరః = వస్త్రముగా గలవాడు, అనగా శూన్యమే (ఆకాశమే - "ఆకాశం గగనం శూన్యమ్") వస్త్రముగ గలవాడగుటచే - శివుడు "దిగంబరు" డని భావము.

3. వన + ఆత్మ-ధరః = జలమే - స్వరూపముగా గల (హిమాంశువగు) చంద్రుని (శిరస్సున) ధరించినవాడు - చంద్రశేఖరుడన్న మాట.

4. నరక-శిరాః = నరుని యొక్క శిరస్సును. (నరకము అనగా కపాలము (పుర్రె) దానిని) ధరించిన వాడు. అనగా-కపాలధారియునైన,

5. అసమ.రుక్-పాణిః = (సమముకాని) విషమ- రుచులు (= అంచులు, కాంతులు) గల త్రిశూలమును - చేతియందు ధరించిన-శంకరుడు, అఖిలం-జగత్- సకల లోకము(ల)ను, చిరం = చాలకాలము (ఎల్లప్పుడు) అవ్యాత్ = రక్షించును గాక !

వివరణము : ఈ శ్లోకములోని మొదటి మూడు పాదములలోనున్న నాలుగు గూఢ - అర్థ విశేషణములలో అజుడు (మహేశ్వరుడు) గూఢముగా వర్ణింపబడినందున; ఇది "అజగూఢము" అని చెప్పబడినది.

గమనిక : ఇది గూఢచిత్రభేదము కనుక, దీనిలోని శబ్దములు, అర్థములు గూఢముగా నుండునని, పాఠక మహాశయులకు సులభముగ అర్థజ్ఞానమును గలిగించుటకై, వీనిలో నున్న పదములకు, శ్లోకములకు, అన్నిటికి స్వకపోల కల్పితము లైనవి గాక, నిఘంటు ప్రమాణములతో వివరింపబడినందున, తాత్పర్యావశ్యకత తగ్గినది. దీర్ఘ సమాసములకు ఒకే అర్థము కాక, డాష్ ( — ) లతో ఛేదించి, విడి విడిగా అర్థములు వ్రాయబడినవి. విస్తరభీతిచే నిఘంటు ప్రమాణములను పూర్ణముగా సంక్షిప్తీకరించినందులకు మన్నింతురుగాక !

మరియు, గూఢార్థములు గల విశేషణములతో అజుడు (శివుడు) గూఢముగా వర్ణింపబడినందున, "నామగుప్త"మని కూడ దీనిని గ్రహింపవచ్చును.

# 2. మారగూఢము

శ్లో॥ కు(క్రు)ద్ధేన సూ(శ్రీ)ప్రీ నయనా(శ్ర)శ్రయాశ దగ్ధోన్మదా దర్దుర హర్ష కాలే।
స్వజన్మ భక్షప్రియ భోజనాశా నృత్యన్తి భీమానుజ గోజ భాజః॥

(వి. ము. 4-15)

ఈ శ్లోకమున "స్వజన్మభక్షప్రియ భోజనాశాః" అనునది విశేష్యపదము.

అర్థము : దర్దుర-హర్ష-కాలే=కప్పలకు-సంతోషమును గల్గించు-వర్షాకాలమున ("వర్షా" నామ మిక్కడ గుప్తము) 1 కు-(ధ్ర)+ఇన-సూ+ప్రీ-నయన+ఆశ్రయాశ-దగ్ధ-ఉన్మదాః (ఉత్+మదాః)=భూమిని-ధరించు పర్వతముల యొక్క-ప్రభువునకు (హిమవంతునికి) పుట్టిన కూతురగు పార్వతిని-సంతోషపెట్టిన శివునియొక్క=(మూడవ) నేత్రమందలి-అగ్ని (ఆశ్రయాశ) చే-బూడిదగా చేయబడిన మన్మథునిచే అనగా కామముచే-మిక్కిలి మత్తు చెందినట్టివియు, 2 భీమ+అనుజ-గో-జ-భాజః = భీమసేనునియొక్క తమ్ముడగు "అర్జున" నామములో-భూమినుండి-పుట్టిన-అనగా అర్జున (మద్ది) వృక్షమును-సేవించుచు-దానిపైనున్న, 3. స్వ-జన్మ-భక్ష-ప్రియ భోజన+ఆశాః=తమనుండి-పుట్టిన వానినే (తమపిల్లలనే)-భక్షించు సర్పములనే (పాములు తమపిల్లలను తామే తినుచుండుట-అనునది లోక ప్రసిద్ధము) ఇంపైన భోజ్యవస్తువులుగా కోరునట్టి (సర్పభక్షకములైన) మయూరములు (నెమిళ్లు)నృత్యన్తి=నాట్యమాడుచున్నవి.

పూర్వపద్యములో అజుడు గోపితుడు కాగా, ఇక్కడ 'కు(క్రు)ద్ధేన సూ(శ్రీ)ప్రీనయనాశ్రయాశ దగ్ధ' అను పదముచే మారః(-మన్మథుడు)గుప్తముగా నుంచబడెను. అట్లే అజమారాదిగూఢం లోని ఆది పదముచే మూడవచరణంలో నెమళ్లు, నాల్గవ చరణంలోని భీమార్జున గోజపదముతో అర్జున (మద్ది) వృక్షము కూడ గూఢముగా నుంచబడినవని గమనింపగలము.

తా॥ కప్పల కానందము గల్గించు వర్షాకాలమున, శివనేత్రాగ్ని-దగ్ధకామముచే మదించినవై, మద్దిచెట్లపై గూర్చుండి, తమపిల్లలను తామే భక్షించు సర్పములను తినుచున్న నెమళ్లు, నాట్యము చేయుచున్నవని భావము.

వివరణ ; గోశబ్దమునకుగల నానార్థములు.

శ్లో॥ స్వర్గేషు పశువాగ్వజ్ర దిఙ్నేత్ర ఘృణి భూజలే।
లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసి గౌః- అ.కో. 3కాం నానార్థ 26 శ్లో.

గోశబ్దమునకు స్వర్గము, బాణము, పశువు, వాక్కు, వజ్రాయుధము, దిక్కు, కన్ను, కిరణము, భూమి, నీరు-అర్థములుగా అమరకోశమున చెప్పబడినవి. ప్రయోగముల ననుసరించి, ఈ గోశబ్దము స్వర్గ, వజ్ర, కిరణ, వృషభము (ఎద్దు) లు- అను అర్థములు చెప్పినపుడు పుంలింగమనియు, ఇతరత్ర స్త్రీలింగమని కూడ గమనింపవలెను.

## 3. పదగూఢము

శ్లో॥ వాతాచ్ఛీతి రరిద్ధ్రోఽరం వో హరతా న్మహోఽసురీ దయితః।
ప్రీడ్ప్రా (ప్రా) డ్యానౌకా వార్వాహో భోఽశ మస్తానాః॥
(వి. ము. 4-16)

ముందు పదచ్ఛేదముచేసి, అన్వయించుకొనిన అర్థము సులభావగాహమగును. వాతాచ్ఛీతిః, అరిద్ధ్రః, మహోఽసుః, ప్రీడ్ప్రాడ్యానౌకాః, అస్తానాః, వార్వాహోభః, ఈదయితః; వః, అశమ్, అరమ్, హరతాత్.

అర్థము : వాతాత్ (వాత + అత్)+శీతిః=వాయువును భక్షించు సర్పము (ఆదిశేషుడు) శయనము (పడక) గాగలవాడు (శేషశాయి), అరి-ధ్రః=ఆకులు (అరలు)గల సుదర్శన చక్రమును-ధరించువాడును (సుదర్శన-చక్రధారి), మహో+అసుః = గొప్ప-ప్రాణములు గలవాడు (మహాశక్తిమంతుడు) ను, వి+ఈట్+అప్+రాట్+యాన+ఓకః = పక్షులకు - ప్రభువు ( గరుత్మంతుడు ), జల-రాజు (అప్-రాట్=సముద్రము) వాహనము-స్థానము(ఉనికి)గా గలవాడు (యథాక్రమముగ-గరుడవాహనుడు, సాగరశాయి), అస్త-అనః=నాశనముచేయబడిన-శకటము (బండి) గలవాడు (శకటాసుర సంహారి-యగు కృష్ణుడు)ను, వార్-వాహ+అభః = నీటిని-ధరించు మేఘము యొక్క-కాంతిగలవాడు "నీలమేఘశ్యాముడు" ను, ఈ-దయితః= లక్ష్మికి-ప్రియుడైనవాడును, అయిన విష్ణుభగవానుడు, వః=మీయొక్క (మా యొక్కయు)అ-శమ్=అశుభమును,అరమ్=వెంటనే,హరతాత్=పోగొట్టుగాక!

తా॥ ఆదిశేషునిపై పరుండువాడును, సుదర్శనచక్రధారియు, శక్తిసంపన్నుడు, గరుడవాహనుడు, పాలసంద్రముపై పవ్వళించువాడు, శకటాసుర భంజకుడు, మేఘశ్యాముడు, లక్ష్మీప్రియుడునగు శ్రీమన్నారాయణుడు మీ కష్టములను (అశుభమును) వెంటనే పోగొట్టుగాక !

" మహాః సుఖోదయితః " ; పదములో " ఈదయితః " అను విశేష్యపదము గూఢముగా నుంచబడినందున, ఇది "పదగూఢము"

## 4. పాదగూఢము

5 4 7 8 2 1
శ్లో॥ దయావాన్ ప్రయతః శుద్ధః ప్రబుద్ధః కమలేక్షణః ।

3 6
పాపాఽపహాపి భువనం బుద్ధః పాయా దపాయతః॥ (వి.ము. 4-18)

అర్థము : దయావాన్ = దయగలవాడును, ప్రయతః = పవిత్రుడును, శుద్ధః = దోష రహితుడును, ప్రబుద్ధః = పూర్ణజ్ఞానము నొందినవాడును, కమల + ఈక్షణః = పద్మనేత్రుడును, పాప + అపహః = కల్మషమును హరించువాడును-అయిన బుద్ధః = బుద్ధదేవుడు, అపాయతః = నాశనమునుండి, త్రిభువనమ్ = ముల్లోకములను, పాయాత్ = రక్షించునుగాక ! (భావము స్పష్టము)

ఈ శ్లోకమున " బుద్ధః పాయా దపాయతః " అను నాల్గవ పాదమునకు సంబంధించిన అక్షరములు, మొదటి మూడుచరణములలో 1,2,3.... మొ॥ అంకెల క్రమములో దాగియున్నందున, ఇది ' పాదగూఢ'మైనది.

వివరణ : ప్రతిపదార్థమునందే తాత్పర్యముకూడ ఇముడునట్లుగా వ్రాయబడినందున, విస్తరభీతిచే ప్రత్యేకముగ తాత్పర్యము వ్రాయబడలేదని మనవి.

## 5. అర్థగూఢము

శ్లో॥ దృష్టోమయా సఖి ! బ్రూహి రోదయిత్వా గతోఽద్యమామ్ ।
భద్రే ! కల్యాణినీ భూయాః ప్రాచీం పశ్యాతి నిర్మలామ్ ॥
(వి.ము. 4-20)

అర్థము : (హే) సఖి! = ఓ చెలీ! అద్య = ఇప్పుడు, మామ్ = నన్ను రోదయిత్వా = ఏడ్పించి, గతః = (నా ప్రియుడు) వెళ్ళెను. బ్రూహి = (దీనికి ఫలిత మేమియో) తెల్పుము. (ఇతి = ఇట్టిదైన-ఒకకల) మయా = నాచేత, దృష్టః = చూడ బడినది. (నాయిక చెప్పిన యీ మాటలను విని, చెలికత్తె ఇట్లు ప్రత్యుత్తర మిచ్చు చున్నది.) భద్రే! = శ్రేష్ఠురాలా! కల్యాణినీ = శుభములతో గూడినదానవుగా, భూయాః! = కమ్ము (అని ఆశీర్వచనము లేక ఆకాంక్ష) అతినిర్మలామ్ = మిక్కిలి పరిశుద్ధముగానున్న, ప్రాచీం-దిశమ్ = తూర్పుదిక్కును, పశ్య = చూడుము.

తా॥ సఖీ! "నేడు నా నాథుడు నన్ను విడచి, హఠాత్తుగ వెళ్ళిపోయినట్లొక కలగంటిని" అని. ఒక నాయిక, తన చెలికత్తెకు చెప్పి, "దీని ఫలితమేమో వివరింపు" మని, ఆ సఖి నడిగినదట. అంతనా చెలి "భద్రే! నీకు శుభమగుగాక! అతిస్వచ్ఛ మైన ఆ తూర్పుదిక్కు నొకసారి పరిశీలింపుము" అనెను. అనగా యీ ప్రాచీన దిక్కాంత తన ప్రియుడగు సూర్యుని యొక్క విరహముతో రాత్రియంతయు దుఃఖించుచున్నను. నేడు తెల్లవారగనే, సూర్యోదయముతో నెట్లు ప్రకాశించు చున్నదో, అట్లే, నీవు కూడ త్వరలో నీ భర్త రాగానే, ఆనందమును పొంద గలవు సుమా! అని వివరించెను.

ఈ అర్థమంతయు, వెంటనే స్ఫురింపక, గూఢముగా నున్నందున, ఇది "అర్థగూఢము" నకు ఉదాహరణమైనది. మరియొక "అర్థ గూఢము"

శ్లో॥ స్వజనక జన్యా భావోప జనక జననీయ పుర నిహన్తృ సఖః ।
తం తనయం సమజనయ త్తద్వ వితనయైర్జగ ద్విజితమ్॥ (క.క.)

అర్థము : స్వజకన....సఖః, స్వజనక = తనకు నిమిత్తమైన, అనగా దానికి విరుద్ధమైన, జన్యాభావ = ధ్వంసమునకు, ఉపజనక = కారకమగు అగ్నికి, (అగ్ని, ఆశ్రయాశము = తనను ఆశ్రయించిన దానిని ధ్వంసము చేయును. ఆ కారణము చేతనే దానికి ఇన్ధన (వంటచెరకు) దాహ హేతుత్వము సిద్ధించునని గమనింపవలెను.) జననీయపుర = పుట్టింపదగినది హిరణ్యము (బంగారము) దానికి సంబంధించిన పురము = హిరణ్యపురము (ఈ హిరణ్యపురము నివాత కవచులను రాక్షసులకు నివాసము) దానియొక్క, నిహన్తృ = నాశనము చేసిన అర్జునునియొక్క

సఖః=స్నేహితుడైన కృష్ణుడు, తం—తనయమ్ = ఆ—కాముని ("మన్మథు"డను పుత్రుని) అజనయత్ = పుట్టించెను. తత్—బలితనయైః=ఆతనియొక్క పుష్ప బాణములతో (బలిచక్రవర్తియొక్క కుమారుడు "బాణాసురుడు" అనగా యీ "బాణ" సాదృశ్యముతో ఇక్కడ "బాణము"లతోనని అర్థం చెప్పుకొనవలెను. జగత్=లోకమంతయు, జితమ్=జయింపబడినది.

ఇంత డొంకతిరుగుడుగా, అర్థము చెప్పబడిన యీ శ్లోకమున, ముఖ్యముగా "కామ రూపమగు అర్థము" గూఢముగా దాగియున్నందున ఇది అర్థగూఢము

కొందరు దీనిని "అర్థకూటము"గా పరిగణించిరి. యీ విధంగానున్న కూట ప్రయోగాలను, చ్యుత, దత్తచిత్ర, ప్రశ్నోత్తరాది చిత్రాలంకారాలతో సంకరం చేయుటవలన ఇవి మరింత జటిలముగా చేయబడినవని చెప్పవచ్చును.

ఇతరులు కొందరు ఆచార్యులు "ఒకే అర్థబోధ కొరకు అనేక శబ్దాల నాశ్రయించినచో, అది "ఏకార్థగూఢ చిత్ర" మగునని చెప్పిరి. ఈ ప్రక్రియ సమస్త పదాలతోను, అసమస్తపదాలతోను, రెండు విధాలుగా గ్రహింపబడుచున్న దనియు తెల్పిరి. ఉదా :

ఏకార్థగూఢ చిత్రమ్ (సమస్తమ్) :

శ్లో॥ వాయుమిత్ర-సుత-బంధు-వాహనా-రాతి-భూషణ-శిరో వలమ్బినీ ।
తజ్జ-వైరి-భగినీ-పతేః-సఖా, పాతుఽమాం కమలలోచనో హరిః॥

అర్థము : వాయుమిత్ర... లమ్బినీ=వాయువుకు మిత్రము అగ్ని, అగ్నికి పుత్రుడు (సుత) = కుమారస్వామి, అతనికి బంధువు=గణేశుడు, అతనియొక్క వాహనం = ఎలుక, దానికి శత్రువు (అరాతి) = సర్పము, దానిని భూషణముగా ధరించినవాడు-శివుడు, వాని తల (శిరః) నాశ్రయించి పిరాజిలునది=గంగ, తత్జ-వైరి ...సఖా, తత్జ=ఆమెకు పుట్టినవాడు=భీష్ముడు, అతనికి శత్రువు (వైరి)= శిఖండి, అతని సోదరి (భగిని)=ద్రౌపది, ఆమెకు భర్త (పతి)=అర్జునుడు, ఆతని స్నేహితుడు (సఖా) అయిన, కమలలోచనః=తామరపూవుల (రేకుల) వంటి నేత్రములుగల హరిః=విష్ణువు (కృష్ణుడు)మామ్=నన్ను, పాతు=రక్షించునుగాక !

ఇక్కడ "విష్ణువు" అను ఒకే అర్థాన్ని (ఏకార్థాన్ని) సంపాదించుటకు, శ్లోకంలోని 1, 2, 3 పాదాలలోని ఎన్నో సమస్త (సమాస) పదాల సాహాయ్యం,

తెసికోవలసి వచ్చినది. ఆ పదాలన్నీ వాయుమిత్ర....తజ్ఞపైరి. ఇత్యాదిగా నున్న సమాసాలతో కలిసి, గూఢముగా నుండుటవలన, ఇది సమస్త-ఏకార్థ గూఢ చిత్రము నకు ఉదాహరణమైనది.

ఏకార్థ గూఢ చిత్రమ్ (అసమస్తమ్)
శమీగర్భస్య యో గర్భః తస్య గర్భస్య యో రిపుః।
రిపు గర్భస్య యో భర్తా న మే విష్ణుః ప్రసీదతు॥

శమీ గర్భస్య = జమ్మిలోపలనుండునది-అగ్ని, దానికి, యః- గర్భః ఏది గర్భమో (నీరు) తస్య-గర్భస్యః యః- రిపుః- = ఆ గర్భమునకు (నీటికి) ఎవడు శత్రువో, అతడు అగ్ని, రిపు గర్భస్య-యఃభర్తా= ఆయగ్నికి శత్రువు (రిపుః)- జలము (సముద్రము) దాని గర్భమున పుట్టినది= లక్ష్మీదేవి, ఆమెకు-యఃభర్తా = ఎవడు-భర్తయగునో, సః-విష్ణుః= ఆ-విష్ణువు, మే= నాకు, ప్రసీదతు = అనుగ్రహము నివ్వుగాక! లేక= శమీ గర్భము = అగ్ని, తద్గర్భము= నీరు, తద్రిపుః= సూర్యుడు, తద్గర్భము = కాళింది (ఈమె విష్ణువును పెండ్లి చేసుకొనగోరి, తపస్సు చేసి. కృష్ణుని పెండ్లాడి అతని అష్టమహిషులలో నొకతె యయ్యెను-అని పురాణగాథ, తద్భర్తా= ఆమెపతి కృష్ణుడు, అనుగ్రహించుగాకః అని కూడ అర్థాంతరము చెప్ప వచ్చును.

శ్లోకము యొక్క 1,2,3, పాదాలలో ఎన్నో శబ్దాలతో, కేవలం "లక్ష్మి" అను ఒకే అర్థము (ఏకార్థం) మాత్రమే చెప్పబడినది. పై పదాలన్నీ సమస్తంగా నుండక, విడివిడిగా, అసమస్తంగా, గూఢంగా నుండుటచే, ఇది "అసమస్త ఏకార్థ గూఢచిత్రము !

వివరణ : వర్ణ యోగంతో శబ్దనిర్మాణం జరిగినప్పుడును. రూపలేకధ్వని-సాదృశ్యంతో శాబ్దబోధ కల్గింపబడినప్పుడును, సంఖ్యావాచక శబ్దంతో ఇష్టార్థాన్ని సాధించినపుడును, ఇంకను, లక్ష్యార్థ-నేయార్థ ప్రసంగంతోగాని, వ్యుత్పత్తి ద్వారా ఇష్టార్థాన్ని సాధించినడుపుగాని=ఇట్లు గూఢతా కారణంగా, గూఢ చిత్రసాహిత్య పరంపరలో ఎన్నో పద్ధతులు పుట్టుకొని వచ్చినవి. ఈ గూఢ ప్రహేళికామాధ్యమం

లోనే అనేక స్తుతి గ్రంథాల రచనలు. వానిలో మంత్రగర్భ, తంత్రగర్భ. యస్త్రగర్భ, భోజ్యాది నామగర్భ. ఆభరణ గర్భ, సహస్రనామగర్భ -ఆదు లెన్నింటినో కవులు ఈ గూఢచిత్ర-పరంపర మాధ్యమంగా సృష్టించి, పుష్పింపజేసి, తమతమ పాండిత్య ప్రకర్షను పరిపరి విధముల ఫలింపజేసి ప్రదర్శించారు. ఇవి యన్నియు సహృదయ పాఠకమహాశయుల మెదడుకు మేత నందించినను సామాన్యుల మేధను మేధింప(మర్దింపు)టచేతను, ముద్రించుటకు కూడ కష్టమగుట వలన విస్తరభీతిచేత ముఖ్యమైన వానినే తెల్పుచున్నామని పాఠక ప్రముఖులు గమనింప ప్రార్థితులు.

క్రియా గుప్త్యాది లక్షణమ్ :-

క్రియాదికం స్థితం యత్ర పదసన్ధాన కౌశలాత్?

స్ఫుటం న లభ్యతే తచ్చ క్రియాగుప్త్యాదికం యథా॥ విము-433

అర్థము : యత్ర=ఏ పద్యమున, పద-సన్ధాన కౌశలాత్=శబ్దముల-యోజనా నైపుణ్యంతో. స్థితమ్-ఉన్న క్రియా+అదికమ్=క్రియాగుప్తము మొదలగునది, స్ఫుటం=స్పష్టముగా. న-లభ్యతే=పొందబడదో, తత్+చ=దానిని-కూడ, క్రియాగుప్త- ఆదికం-యథా=క్రియాగుప్తము మొదలగు దానివలె, తెలిసికొనవలెనని భావము.

వివరణ : ఇక్కడ, క్రియాదికంలోని ఆది శబ్దంచే క్రియయేగాక, కారక, సంబంధ, ఆమంత్రిత, లింగ,వచన, సుప్-తిజ్, వచన గుప్తములు, "కారక"మనుటచే, కర్తృ, కర్మ, కరణ, సంప్రదాన, అపాదాన, అధికరణములను ఆరుకారకములను గ్రహింపవలసియున్నదనుట మరువరానిది)

ఈ గుప్తి విషయ వివేచనలో కొన్ని భిన్నస్వరాలు వినబడుచున్నవి

క్రియా కారక సంబంధైః పదాభిప్రాయ వస్తుభిః।

గోపితం షడ్విధం ప్రాహుః గూఢం గూఢార్థవేదినః॥ స.కం.

క్రియా, కారక, సంబంధ, పద, అభిప్రాయ, వస్తువులలో ఏదో ఒకటి గూఢంగా మరుగుపరచబడినపుడు, గుప్తార్థము నెరిగిన విద్వాంసులు, ఆయా గూఢములను, ఆయానామములతో ఆరు విధములుగా విభజించిరని భోజమహారాజు తెల్పెను.

దేవేశ్వరుడు తన "కవికల్పలత"లో నిట్లు వివరించెను.

శ్లో॥ భంగ శ్లేషాద్యుపాయేన య త్క్రియాది నిగూహనమ్।
తత్క్రియా గుప్తకా ద్యాహుః చతుర్విధ మిదం యథా॥ (దే. క.)

ఖండ శ్లేష మొ॥ ఉపాయములతో, క్రియాపదము. వానిని, మాటుపరచుట జరిగినచో, వానిని "క్రియాగుప్తము" మొదలగు పేర్లతో పిల్తురు. ఈ క్రియా గూహనము 1. క్రియా, 2. కర్తృ, 3 సంబంధ, 4. అధార-గుప్త భేదములచే నాల్గు విధములని చెప్పబడినది.

"కవీన్ద్ర కర్ణాభరణము"న విశ్వేశ్వర పండితుడిట్లు చెప్పెను.

శ్లో॥ క్రియా కారక సమ్బన్ధ సమాస వచనాదికమ్।
న భా త్యాకాంక్షిత మపి యత్ర త ద్గుప్త ముచ్యతే॥ (క. క.)

క్రియలు కారకములు, సంబంధము, సమాసములు, వచనములు మొ॥నవి అవసరమై, కోరబడినపుడు కూడ. పైకి స్పష్టముగా కన్పడక, గూఢములుగా నున్నచో, వానిని "గుప్తము" లందురు. మరియు,

"గూఢస్య-క్రియాకారాది భేదా దనేక విధత్వమ్" కేశవమిశ్ర-అ-శే 4-1

"గూఢం క్రియాకారక సంబంధ విషయత్వేన చతుర్ధా" (హే. కా.)

'యస్మిన్ గుప్తేఽపి వాక్యాంశే భావ్యర్థోఽపారమార్థికః।
తదంగ విహితాధ్యక్షః తద్గుప్తం గూఢ మప్యదః॥ (అ. పు. 303-26)

.... .... .... ....

ఇత్యాదిగా వివరించిరి.

మాత్రాచ్యుతక, బిందుచ్యుతక, ప్రహేలికలను, కారకగూఢ, క్రియాగూఢములను, ప్రశ్నోత్తరాములను సర్వప్రథమంగా సమీకరించిన రుద్రటాచార్యుడు తన "కావ్యాలఙ్కారమున" వీనిని క్రీడామాత్రోప యుక్తము లనెను.

శ్లో॥ "మాత్రా బిన్దుచ్యుతకే ప్రహేలికా కారకక్రియాగూఢే।
ప్రశ్నోత్తరాది చాన్యత్ క్రీడా మాత్రోపయోగ మిదమ్॥ రు.కా.5-24

భోజమహారాజు గూఢమును "చిత్రాలఙ్కార" భేదముగా పరిగణించి, ఆరు గూఢాలంకారములను చర్చించెను. శోభాకరమిశ్ర దీనికి శబ్దాలంకారములలో స్థానమిచ్చెను. మమ్మట, రుయ్యకాదులు చర్చింపక విడిచిపెట్టినను, విశ్వనాథుడు

"ఉక్తి వైచిత్ర్యము"గా పరిగణించెను. తరువాత, అమరచంద్రయతి, వాగ్భట-II శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాలయతి మొ॥వారు దీనినొక చిత్రభేదమనగా, విశ్వేశ్వరుడు జాతిభేదాలలో స్థానమిచ్చెను. కొందరు ఆచార్యులు దీనిని ప్రహేలికా భేదాలలో సమ్మిలితం చేశారు. మరి కొందరీ గూఢమును "కూటము"గా కూడ పరిగణించారు.

ఈ గూఢ ప్రక్రియలలో ముఖ్యంగా అభిధేయవక్రత, అభిప్రేతార్థ-దురూహత, భావ సంగోపనము, లక్ష్యంకంటే విపరీతార్థకథనము మొ॥నవి ఉంటాయి. ఇట్లు గుప్తముగానున్న వానిని తెలిసికొనుటకు నైకవిధ శాస్త్రజ్ఞానము అవసరము. వ్యాకరణ శాస్త్రజ్ఞానము అత్యవసరము. ముఖ్యముగ సంధులను విడదీయుట, కలుపుట మొ॥నవి కూడ తెలియని వారికిది అరణ్యరోదనము, అంధముఖదర్పణము కాగల దనుటలో సందేహము లేదు. అవి తెలిసిన వారికి "శబ్దబ్రహ్మము"యొక్క చాతుర్యమును, చమత్కారమును, అనంత పాండిత్య ప్రకర్షను ప్రదర్శించి, అమందానందమును ప్రసాదించును.

ఈ గూఢ చిత్రాద్యలంకారములకు, బీజాలు, వైదిక సాహిత్యంలో చాల చోట్ల కన్పడుచున్నవి. దేవ-అసుర-మనుష్యుల ద్వారా ప్రార్థింపబడిన ప్రజాపతి "ద" అనే ఒక్క అక్షరాన్ని ప్రవచించి (బృహదారణ్యక-5అ.ద్వి.బ్రాహ్మణం) ఆ ఒక్క వర్ణంలో గుప్తంగానున్న "దమన-దాన-దయ"లను బోధించెను.

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయో రన్యః స్వాద్వ త్త్య నశ్న న్నన్యోఽభిచాకశీతి॥
(ముండకోపనిషత్-3-1-1)

వేద, వేదాన్తాలలోని కొన్ని అనుభవాలు ప్రకటింప వీలుగానివగుటవలన, గూఢంగా, చిహ్నాల, ప్రతీకల రూపంలో నుండవలసి వచ్చినది. అయోగ్యులకు అర్థంకాకుండా రక్షించుకొనుటకే ఈ గూఢాలు వైదిక కాలంలో ఎంతో ఉపయోగ పడినవి. ఇట్టివి ఋగ్వేదం (1-164) లో చాల ఉన్నవి. వానిలో చాలా సరిగా అర్థంకావు. కొన్నిటిని మాత్రమే వ్యాఖ్యాతలు సరిగా వ్యాఖ్యానించారు. కొన్ని తప్పుడు వివరణలు గలవి, కొన్ని విడిచిపెట్టబడినవి కూడ గలవు. యాస్క, సాయణులు కూడ, కొన్ని ఋక్కుల అర్థాలను స్పష్టంగా చెప్పలేదు. అట్లే కొన్ని

యాగాలలో ఋత్విక్ - పురోహితులకు, రాజులకు మంత్రులకు జరిగిన ప్రశ్నోత్తరములందును "గూఢభాష" ఉపయుక్తమైనది. మరియు "చత్వారిశృంగా త్రయోఽస్య పాదాః" (ఋక్ 4-58-3) మొ.నవి విరుద్ధంగా, అర్థరహితంగా కన్పడినా, సాయణుడు చాల అర్థాలను వివరించెను. పతఞ్జలి మహర్షి దీనిని "శబ్దబ్రహ్మ"గా వివరించెను. ఇట్టివి తర్వాత భారత, రామాయణ, భాగవతాదులలోనే గాక, కావ్య పరంపరా స్రోతస్సులకు కూడ ఎగప్రాకినవి. అట్లే ప్రాకృతాది భాషలలోకి తర్వాత క్రమంగా ఆధునిక భాషలలోనికి గూడ ప్రవేశించి, అనేక ప్రభేదములను ప్రక్రియలను సంతరించుకొన్నవి.

ప్రస్తుత "క్రియాగుప్తములు" సరస్వతీ కణ్ఠాభరణ, సాహిత్య దర్పణ, కవికల్పలతా, దేవీశతక, విదగ్ధముఖమండన, చిత్రరత్నాకర, కవీంద్రకర్ణాభరణ, చమత్కారచంద్రిక, సుభాషిత రత్నభాండాగార, మన్దారమకన్ద చంపు, చమత్కార తంద్రిక, లక్ష్మీ సహస్ర, కావ్యానుశాసన, .... మొదలగు అనేక గ్రంథాలలో పలువిధాలుగా ప్రదర్శింపబడినవి. వీనికి ఉదాహరణములెన్నో ఉన్నను, కేవలము సంఖ్యకొరకు గాక, పాఠకమహోదయులకు వానిలోని ప్రత్యేక విశిష్టతలను తెల్పుటకు, విస్తరణభీతినికూడ ప్రక్కకు నెట్టి, ఉదాహరణాస్త్రములు కూడ అవసరములగు అర్థ తాత్పర్యములతో ప్రదర్శింపబడుచున్నవి. ఈ గుప్తములకు గూఢ, గుప్తి, గోపన, గర్భిత, వంచన - అది పదాలు పర్యాయపదములుగా వాడబడినవి.

## క్రియాగుప్తములు

ఈ క్రియాగుప్తాలు కించిద్భేదంతో అనేకవిధాలుగా కన్పడుచున్నవి.

శ్లో॥ పుంస్కోకిల కులస్యైతే నితాన్త మధు రా రవైః।

సహకార ద్రుమా రమ్యా వసన్తే కా మపి శ్రియమ్॥ వి.ము. 4-35

పుంస్కోకిల కులస్య=గండుకోయిలల సమూహముయొక్క, నితాన్త మధుర+అరవైః = మిక్కిలి తీయనైన ధ్వనులతో, వసన్తే = వసన్తఋతు

సమయమున, రమ్యాః = సున్దరములైన, ఏతే — సహకార-ద్రుమాః = ఈ-తియ్యమామిడిచెట్లు, కామ్ - అపి = ఒక అనిర్వచనీయమైన (ఇట్టిదని చెప్పుటకు వీలుకాని) శ్రియమ్ = కాన్తిని, ........ ఇక, ఈ వాక్యం పూర్తికావటంలేదు. పూర్తిచేయు క్రియ" ఎక్కడనో దాగియున్నది. వెదకి పట్టుకొనవలెను. పరిశీలించి నచో, ఈ క్రియ పద్య - ద్వితీయ చరణమున దాగియున్నట్లుగా తెలియబడగలదు. మొదట దానికి చెప్పిన పదచ్ఛేదం శ్రావ్యంగా ఉన్నను, క్రియాసమన్వయంకోసం మరొకవిధంగా ఛేదింపక తప్పదు. అప్పుడు ఆ రెండవపాదమును నితాన్తం-అధుః+ ఆరవైః" గా విభజించిన, మధ్యలోనున్న "అధుః" అను క్రియకు "ధరించినవి" అను అర్థం చెప్పుకొనిన, వాక్యార్థము పూర్తియగును

వసన్తసమయమున గణ్డు కోయిలల గుంపు మధురారావములు చేయు చుండ, ఆ వనమున అందముగా నున్న తియ్యమామిడి చెట్లన్నియు చెప్పరాని చెలువమును (అధుః =) ధరించియున్నవి" అను అర్థము చక్కగా సమకూర్చు చున్నది.

∴ (కనుక) ఇక్కడ "అధుః' అను బహువచన క్రియ గుప్తమై యున్నది.

అస్య లోకస్య విపదం రణే హత్వా దశాననమ్ ।

ఇతి సంప్రార్థితో దేవైః భగవా న్మధుసూదనః ॥ చ.చి. 3-45

యుద్ధమున రావణుని చంపి, ఈ లోకముయొక్క (అస్య-లోకస్య) ఆపదను ... ... (క్రియ గుప్తము) అని దేవతలు భగవంతుని ప్రార్థించిరి.

"అస్య-లోకస్య' అనుచోట, "లోకస్య' అను పదసాన్నిధ్యము వలన "అస్య" అనునది, "ఇదమ్" శబ్దముయొక్క షష్ఠీవిభక్తిగా, విశేషణముగా మనకు భ్రాన్తిని గల్గించుచున్నది. అట్లుగాక, "అసు-క్షేపణే" (తొలగించుట) అను ధాతువు (క్రియ) యొక్క, "లోట్" (Imperative Mood) యొక్క మధ్యమ పురుషైక వచనముగా గమనించిన, "అస్య = త్రోసివేయుము లేక పోగొట్టుము - అనగా- "లోకము యొక్క ఆపదను తొలగించుము" అను అర్థము సుసంగతమగును. ∴ "అస్య" అను క్రియాపదము గుప్తమైనందున "క్రియాగుప్తి"

హరేః ప్రియే! భగవతో హృతసంశ్రిత సాధ్వసా।
అన్వహం క్రియమాణానాం అంహసాం సంహతీ రయాత్॥

ల.స.చి. 7

హృతసంశ్రితసాధ్వసా = ఆశ్రితుల భయమును పోగొట్టుచు భగవతః - హరేః - ప్రియే = భగవంతుడగు - విష్ణుదేవునికి ప్రియురాలవగు ఓ లక్ష్మీ! వేగముగా .... .... "ఏమిచేయవలె" నను క్రియ గూఢముగనున్నది ∴. హరేః - ప్రియే! లోని "హరేః" అనునది, మొదట "హరి" శబ్దముయొక్క, షష్ఠీ – ఏక వచన భ్రాన్తిని గల్గించినది, కాని, అది "హృఞ్" = హరణే (పోగొట్టుట) అను ధాతువుయొక్క విధిలిఙ్ (Potential Mood) మ.పు. ఏకవచన రూపము. ∴. భగవంతునికి ప్రియురాలవైన ఓ లక్ష్మీ! .... .... పాపసంతతిని, హరేః = పోగొట్టుము - అని చెప్పిన అర్థము సరివడును. ∴. హరేః- అను క్రియ గుప్తము.

గృహద్వారగత స్యాస్య పుంసః కామార్తచేతసః ।
విలాసై ర్గణికాం సంఖ్యో విత్తాకర్షణ నిర్భరామ్॥ మం. చ.

సఖులారా! తన యింటిముందు విలాసభంగిమలతో తారాడుచున్న కామ పీడితుడగు (ఆ) పురుషునియొక్క ధనమును ఏదోవిధముగ తన విలాసములతో లాగుకొనుటలో మునిగితేలుచున్న (ఆ) వేశ్యను (గణికాం) .... క్రియగుప్తము. ... "విత్తాకర్షణనిర్భరామ్-"ను, "విత్త + ఆకర్షణ - నిర్భరామ్ - గా విడదీసిన, దీనిలోని "విత్త" పదము ధనార్థమునీయక, "విద=జ్ఞానే" (తెలిసికొనుట) అను ధాతువుయొక్క, లోట్ - మ. పు. బహువచన క్రియగా, "తెలిసికొనుడు" అను అర్థమును చెప్పగా, అర్థము సంగతమగును.

**N.B.** మందార మరందచం పూకర్తం-, కృష్ణకవి శ్లోకంలో "క్రియ" గుప్తంగా లేకున్నను, బైటనుండి కూడ గుప్తక్రియను దెచ్చి సమన్వయింపవచ్చు నని, నవీనంగా ఉదాహరణ నిచ్చెను.

అంచితోఽపి నికుంజోఽసౌ కుంజకంటకవీరుధా ।
స్వైరిణ్యా శ్చిరరాత్రాయ లుఠన్త్యాః కామినః కృతే॥ మం.చ.

అసౌ - కుంజః = ఈ పొద (రిల్లు), కుంజ = కంటక - వీరుధా = పొదముళ్ళతోను, తీగలతోను, అంచితః+అపి = ఒప్పుచున్నదైనను చిరరా త్రాయ= చాలసేపటివరకు, కామినః-కృతే = ప్రియునికొరకు ఎదురుచూచుచూ (3) లుఠంత్యాః = దొర్లుచున్న, స్వైరిణ్యాః = స్వేచ్ఛగా తిరుగు—జారిణికి .... క్రియ (శ్లోకంలో) లేదు. ఏమి చేయాలి? "సౌధాయతే" అను క్రియను, బైటనుండి తెచ్చుకొనవలెను. అపుడు, సౌధాయతే = (మేడలేకున్నను) మేడయందువలె పడకకు పనికివచ్చి, జారిణికి సంతసమును గల్గించుచున్నది - అనగా ముళ్ళపొదలో దొర్లినను. అంకుటాలి కాపొద, గొప్ప మేడలో హంసతూలికాతల్పమున, స్వేచ్ఛగా విటునితో రమించినట్లున్నదను భావమును కల్గించినదట.

చేలాంచలేన వక్షోజౌ తిరోధానగతా వపి।

బత మన్దిత మన్దాక్షం సుభ్రు విభ్రమ వైభవమ్ ॥ క.క.

హే సుభ్రు! వస్త్రపు కొంగుతో - నీ స్తనములు కప్పబడినవైనను (తిరోధాన - గతౌ+అపి) చొరవలేని - సిగ్గుతో నిండిన కన్నులు గలదానినిగా.... క్రియగుప్తము. ∴ "తిరోధానగతావపి"ని తిరః+అధాః - న - గతౌ+అపి అని విడదీసిన, గతౌ+అపి = నీవు నడచుచున్నవుడు కూడ, న—తిరః - అధాః = (నీవు -నీ స్తనములను) మరుగువరచనేలేదుసుమా! అయినను విభ్రమచేష్టితమ్= (నీ) శృంగారచేష్ట చొరవలేనివారి "మందితుల" నేత్రములను కూడ కామముచే, మెల్లగా మూసుకొనునట్లుగా చేసి, ఆశ్చర్యమును గొల్పుచున్నది.

∴ "అధాః" అను మ.పు. ఏకవచన క్రియగుప్తము.

పాండవానాం సభామధ్యే దుర్యోధన ఉపాగతః।

తస్మై గాం చ సువర్ణం చ సర్వా ణ్యాభరణాని చ॥

సా.ద. 10_64

పాండవుల సభలోనికి దుర్యోధనుడు వచ్చెను. అతనికి ఆవును, బంగారమును, సర్వాభరణములను.... క్రియగుప్తము "పాండవుల సభకు దుర్యోధనుడు రావటం అతనికి ఆవు మొ, వాటినిచ్చుట" అను ఈ అర్థము అసంగతము....

కాబట్టి 'సభామధ్యే దుర్యోధనః' ను 'సభామధ్యే+అదుః+యః+అధనః' అని పదచ్ఛేదం చేసినచో, సభకు వచ్చిన దరిద్రునకు (యః-అధనః- ఉపాగతః) గోవు లేక భూమిని, బంగారమును, సర్వాభరణములను, అదుః=ఇచ్చిరి- అని అర్థము చెప్పిన సరిపోవును. ఇక్కడ 'దుర్యోధన' పద శ్రవణ మాత్రమున ధార్తరాష్ట్రి సుయోధనుడు గుర్తుకు రావడంతో 'అదుః' అను క్రియాపదము మరుగున పడినది. కాబట్టి క్రియాగుప్తము.

రాజ న్నవఘనశ్యామ నిస్త్రింశాకర్ష దుర్జయ।
అకల్పం వసుధా మేతాం విద్విషో ద్య రణే బహూన్॥ దే.క

కొంగ్రొత్త మేఘమువలెనల్లనై, ఖడ్గాకర్షణచే జయింపశక్యము గాని రాజా! ఈ భూమిని కల్పాంతము (బ్రహ్మదినము-చివరి) వరకు...., ఇప్పుడు యుద్ధమున అనేక శత్రువులను.... ఏమి చేయవలెను? అను క్రియలకు గోపనము జరిగినది.

కాబట్టి 1. 'రాజన్నవ ఘనశ్యామ- 2. విద్విషోద్య'- లను జాగ్రత్తగా, 1. రాజన్! + అవ-ఘనశ్యామ- అనియు, 2. విద్విషః+ ద్య" అనియు విడదీసిన 1. రాజా! భూమిని (ల్పాంతకము వరకు) అవ = రక్షింపుము, 2. (శత్రువుల నందరిని) ద్య = ఖండించుము- అనినచో అర్థము సరియగును. ఇక్కడ 'అవ,ద్య' అను రెండు క్రియాపదములు గుప్తములగుట విశేషము. అవ-అనునది 'అవ = రక్షణే' అనుధాతువు యొక్కయు, ద్య-అను క్రియ 'దో=అవఖండనే' ధాతువు యొక్కయు, లోట్. మ, పురుష, ఏ రూపములు.

ఇట్లే సుభాషితసుధాభాండాగారమున అనేక 'క్రియాగోపనములు' ఉట్టంకింప బడినవి. మచ్చునకు కొన్ని ఉదాహరణములు.

1. విరాట నగరే రాజన్ కీచకా దుపకీచకమ్।....

2. నారసింహాకృతిం వీక్ష్యదనే మత్తమతంగజః।....

3. సంధ్యావందనవేలాయాం తడాగాన్తే ద్విజోత్తమైః।....

4. రాఘవస్య శరైః ఘోరైః ఘోరరావణ మాహవే....

పై నాలుగు శ్లోక-పూర్వార్ధములకు "అత్ర క్రియాపదం గుప్తం యో జానాతి స పండితః" అనియే ఉత్తరార్ధము.

అర్థాలు : 1. రాజా! విరాట నగరమున కీచకునినుండి ఉపకీచకుని వరకు....

2. వనమున నొక మత్తేభము నరసింహాకారమును గాంచి....

3. సంధ్యావందన సమయమున చెరువు దగ్గర బ్రాహ్మణోత్తములచే....

4. రాముని కఠోర బాణములచే యుద్ధమున క్రూరుడగు రావణుని....

ఈ పద్యములలోని క్రియాపదములను వెదకి, వెలికి దీసిన వాడే పండితుడు- అని భావము. ఇట్టి పదగోపనములచే, పై నాల్గింటి అర్థములు దుర్ఘటమైపోయినవి.

కనుక, పద విభాగములను చక్కగా చేసుకొని, క్రియలను వెదకి, వెలికి తీయవలెను. ఆ పదచ్ఛేదము ఎట్లనగా-

1. విః(విర్)+ఆట-నగరే-గా విడదీసిన. నగరమున, పక్షి (విః) ఒక వెదురుచెట్టు నుండి (కీచకాత్) ప్రక్కనున్న చిన్న వెదురు మీదికి (ఉపకీచకం) ఎగిరి, వెళ్ళెను (ఆట). ఇక్కడ 'విరాట నగర, కీచక....' పదబంధన సాన్నిధ్యముచే, క్రియా పదము అస్ఫుటమైనను, పై విభాగముచే అర్థము స్పష్టమైనది. కాబట్టి 'ఆట' అను క్రియ 'అట=గతౌ' (పోవుట) ధాతు- లిట్- ప్ర. పు. ఏ వచనము.

గమనిక : రంధ్రము నుండి గాలి దూరగా ధ్వని చేయుచుండు వెదురును కూడ, కీచకమందురు.

2. 'నారసింహాకృతిం' అను దానిని 'న+అర-సింహాకృతిం'గా విడదీసిన, మదపుటేనుగు, సింహాకారమును చూచి, న+ అర= ముందుకు వెళ్ళలేక పోయెను. కాబట్టి 'అర' అను క్రియాపదము 'ఋ=గతౌ' (వెళ్ళుట) అను ధాతులిటు రూపము.

3. 'ద్విజోత్తమైనః'ని "ద్విజోత్తమ+ఐః"గా ఛేదించిన, ఓ బ్రాహ్మణోత్తమా! ఐః=పొమ్ము. అర్థము పొసగినది. 'ఐః' అను క్రియ, 'ఇణ్=గతౌ' (పోవుట) అనుధాతువు యొక్క లఙ్ మ. పు. ఏక. వచనము గుప్తమైనది.

4. 'రాఘవస్య'ను, 'రాఘవ-స్య'గా విడిదీసిన, ఓ రామా! బాణములతో రావణుని, స్య=చంపుము- అని చెప్పిన, అర్థము సరిపోవును. 'స్య' అను క్రియ గుప్తము.

అమ్లానసంకజామాలా కంఠే రామస్య సీతయా!
ముధా బుధా భ్రమన్త్యత్ర ప్రత్యక్షే పి క్రియాపదే॥ సురభాం
సీతాదేవి చేత, వాడని తామరపూవుల దండ శ్రీరాముని కంఠమున....

దీనిలో క్రియాపదం ప్రత్యక్షంగా కన్పడుచున్నను గ్రహింపలేక, పండితులు పండితమ్మన్యులై కూడ వ్యర్థంగా భ్రాన్తి చెందుచున్నారు. అయినచో - ఆ క్రియాపద మేది? 'ప్రత్యక్షేపి' (ని ఉంచబడెను) అనునది గుప్తమైన క్రియ. ముందు ప్రత్యక్షే+ అపి-గా విడదీసుకొనుట వలన, మనకు భ్రమను కల్గించినది.

గమనిక : ఈ క్రియా, కారకాదిగోపములు పదగూఢములో నంతర్గతములగుచున్నవని కూడ గమనింపవలెను.

## కారకగుప్తములు

క్రియతో నన్వయించు కర్తృ, కర్మాదులను, వ్యాకరణ పరిభాషలో 'కారకము' లందురు. ఇవి ఆరు. ('కారకాణిషట్') సుబంతములకు ఉన్న ఏడు విభక్తులతో, షష్ఠీవిభక్తి తప్ప, మిగిలిన ఆరు విభక్తులు అంతమందుకల వ్యాకరణాంశములను 'కారకము' లందురు. క్రియతో నన్వయించుట కారక లక్షణము. షష్ఠీవిభక్తికి క్రియతో అన్వయము కుదరనందున, కారకములలో చేరదు.

1. కర్తృ-కారకము (Subject) 2. కర్మ (Objeet) 3. కరణ (Instrument) 4, సంప్రదాన (Gift) 5. అపాదాన (Seperation) 6. అధికరణ (Location) ములను ఈ ఆరును 'కారకములు'.

1. కర్తృకారక గుప్తము

కర్త అనగా క్రియ చెప్పు అర్థము యొక్క వ్యాపారమునకు ఆశ్రయమైనవాడు. నేరుగా కార్యము నుత్పత్తి చేయువాడు.

శరదిన్దు కున్ద ధవలం నగపతి నిలయం మనోహరం దేవమ్।
యైః సుకృతం కృత మనిశం తేషామేవ ప్రసాదయతి॥ వి.ము. 4-37

యైః- అనిశం- సుకృతం - కృతం = ఏజనులచే - ఎలపుడు- పుణ్యము చేయబడినదో, తేషాం-ఏవ= ఆ జనులకే, శరత్+ఇన్దు-క న్ద-ధవలం = శరదృతువు నందలి-చంద్రుడు- మల్లెపూవు- వలె- శుభ్రమైన, నగపతి- నిలయం = పర్వత రాజైన కైలాసము- నివాసముగాగల, మనోహరం-దేవం = మనస్సు నాకర్షించు చున్న -శివుని, ప్రసాదయతి= ప్రసన్నునిగ చేయుచున్నాడు (నున్నది) ఏది? ఎవరు?

ఇక్కడ 'ప్రసాదయతి' అను క్రియతో అన్వయించు కర్తృపదము గుప్తముగ నున్నది. కనుక 'మనోహరం' అను దానిని 'మనః+హరమ్'గా విభజించిన, తేషాం-మనః+ ఏవ= ఆ జనుల యొక్క మనస్సే, దేవం-హరం= దేవుడగు- శంకరుని, ప్రసన్నునిగ చేయుచున్నది (=ప్రసాదయతి)

కాబట్టి 'మనోహరం'లో 'మనః' (=మనస్సు) అను కర్తృపదము గుప్తమై ఉన్నట్లు తెలిసికొనగలము.

గౌరీవదన సంకాశం శ్రద్ధయా శశినం దధౌ।

ఇహైవ గోపితః కర్తా వర్షేణాపి న లభ్యతే॥ దే. క

పార్వతి మోముతో సమానంగా ఉన్నాడని, చంద్రుని శ్రద్ధతో ధరించెను. (ఎవరాకర్త ?) ఆ కర్తృపదము ఇహ+ఏవ-గోపితం- ఇక్కడనే గుప్తమై ఉన్నది. కాని, సంవత్సరమంతా వెదకినను, దొరకక పోవచ్చు.

కాబట్టి 'ఇహైక'ను 'ఇహ+ఏవ' (=ఇక్కడనే) అని కాక, 'ఇహా + ఏవ అని విడదీయవలెను. ఇః+మన్మథుడు, ఇంహన్తీతి (=కాముని చంపినవాడు) =ఇహా=ఈశ్వరుడు, కాబట్టి ఇహా-అనుకర్త గుప్తముగ నున్నవి. శివుడు శ్రద్ధతో చంద్రుని ధరించి, 'చంద్రశేఖరు'డగుట వ్యక్తమగుచున్నది.

అన్న వస్త్ర సువర్ణాని రత్నాని వివిధాని చ।

బ్రాహ్మణేభ్యో నదీతీరే దదాతి వ్రజ సత్వరమ్॥ దే.క

అన్నము, వస్త్రము, బంగారములను, అనేక మణులను గూడ, నదియొడ్డున బ్రాహ్మణుల కొరకు ఇచ్చుచున్నాడు. త్వరగా వెళ్లుము.

ఎవరు ఇచ్చుచున్నారో, ఆకర్త గుప్తము. కాబట్టి 'బ్రాహ్మణేభ్యః'ను 'బ్రాహ్మణ! + ఇభ్యః'గా విడదీసిన, ఓ విప్రుడా! ఇభ్యః = ధనవంతుడు(దదాతి) ఇట్లు ఛేదింపగా ఈ 'ఇభ్యః' అను గుప్త కర్తృపదము: లభించినది.

బాలే! మకరకేతో స్త్వాం మహేషు రతిరూపిణీమ్।
పశ్యత స్తస్య హృదయం అదయం సాదయ త్యలమ్॥ క. క

బాలామణీ! ఉత్సవములలో (మహేషు) రతిదేవి వలెనున్న నిన్ను చూచు చున్న అతని మనస్సును, మిక్కిలి నిర్దయతో బాధ పెట్టుచున్నది. అట్లు బాధ పెట్టు చున్నది ఏది? ఎవరు?

కాబట్టి 'మహేషు రతిరూపిణీమ్'ని, 'మహా+ఇషుః+ అతిరూపిణీమ్'గా విడ దీసిన మన్మథుని యొక్క, మహా+ఇషుః= గొప్పబాణము - అను కర్త బహిర్గత మగును.

షడ్జ సంవాదమాపన్నైః స్వరైః శ్రుతిమనోహరైః।
గిరిశృంగస్థితం నర్త్యం మయూరం జయతి స్థిరమ్॥ శా. ద.

చెవి కింపైన షడ్జమును పోలియున్న స్వరములతో, నెమలి (మయూరం) పర్వత శిఖరము నందున్న జనసామాన్యమును గట్టిగా గెలుచుకొనుచున్నది.

'మయూర' శబ్ద శ్రవణముచే, ఈ పద్యము నెమలికి సంబంధించినదిగా తలంపబడినది. అట్లు గాక, 'మయూరంజయతి'ని 'మయుః+రంజయతి'గా విడ దీసిన, మయుః = (గుఱ్ఱపుమూతి గల) కిన్నరుడు, రంజయతి=సంతోష పెట్టు చున్నాడు అను అర్థము చెప్పిన సరిపోవును.

1. షడ్జం మయూరో వదతి 2. 'మయుస్తురంగవదనః'అని అమరకోశము.

1. నెమలిచేయు ధ్వనిని 'షడ్జమందురు' 'స-రి-గ మ-ప-ద-ని' అను సప్త స్వరాలలో 'స' అనునది- ఈ షడ్జస్వరము (ఇది ఆరుస్థానములను ఒరయుచు వెలువడుచుండును.)

2 గుర్రపు మొగము గల వానిని 'మయువు' అందురు. ఈకిన్నరులు గాన మునకు ప్రసిద్ధులు.

1. శ్యామౌ తవ స్తనా వేతౌ పిబన్తి సతతం ముదా।....

2. వ్యామోహం తవ భిన్దన్తు చిన్దన్తు దురితాని చ।....

3. రాక్షసేభ్యః సుతాం హృత్వా జనకస్య పురీం యయౌ।....

వీనికి ఉత్తరార్థములు:- కర్తృగుప్త మిమం శ్లోకం యే జానన్తి విచక్షణాః॥
లేక—2 అత్ర కర్తృపదం గుప్తం మర్యాదా దశవార్షికీ॥ (అనిపాఠాన్తరం)

1. నీ యొక్క నల్లనైన ఈ స్తనములను, ఎల్లప్పుడు సంతోషంతో పాపము

చేయుచున్నారు (-చున్నవి) (పిబన్తి) ఎవరు లేక ఏవి? కర్తృగుప్తము. ఈయర్థము పైకి అసభ్యముగ కూడ కన్పడుచున్నది.

కాబట్టి "శ్యామౌతవః" అనునవి రెండు పదాలు కావు. సంధింపబడిన ఒకే పదము. దానిని విడదీసిన 'శ్యామ+ఓ తవః' (నల్లని-పిల్లులు)

కాబట్టి నల్లని పిల్లిపిల్లలు (కర్తలు), ఏతౌ-స్తనౌ=ఈ చన్నులను, పానము చేయు (కుడుచు) చున్నవి. కాబట్టి అర్థము కూడ సరిపోయినది.

2 నీ యొక్క సంభ్రమమును, పాపములను కూడ- ఛేదింతురుగాక! ఎవరు! ఈ కర్తలు శ్లోకంలో మాటున మణిగియున్నారు. కాబట్టి 'వ్యామోహం'ను, 'వ్యాః+మోహం'గా ఛేదించిన, వ్యాః= శివ- బ్రహ్మ- విష్ణువు-లు (కర్తలు) నీ అజ్ఞానమును (మోహం) ఛేదింతు రను అర్థము సరిపడును. ఉః+ ఇః+ అః= (ఈమూడింటికి సంధి చేసి కలిపిన) 'వ్యః' అగును. దాని బహువచనము వ్యాః (వ్యః వ్యౌ వ్యాః) అను కర్తృపదము గుప్తము. ఉః- శివుడు, ఇః= బ్రహ్మ, అః= విష్ణువు - అని ఏకాక్షర నిఘంటువులు.

3. రాక్షసుల నుండి- లేక రాక్షసుల కొరకు,కూతురిని- అపహరించి జనకుని యొక్క- పట్టణమునకు - వెళ్ళెను. ఈ యర్థము అసంబద్ధముగ నున్నందున 'రాక్షసేభ్యః' అను దానిని, రాక్షస శబ్దం యొక్క పంచమి లేక చతుర్థీ - విభక్తుల బహువచనంగా తలంపక, 'రాక్షస+ఇభ్యః-గా విడదీసి, ఈ రెండింటిని సంధించిన 'రాక్షసేభ్యః=రాక్షసుల యొక్క- ప్రభువు అగు 'రావణుడు' అను అర్థము వచ్చును.

కాబట్టి ఆ రాక్షస రాజగు రావణుడు జనకుని కూతురగు సీత నపహరించి, లంకాపురికి వెళ్ళెను. అను అర్థము సరిపడుచున్నది. కాబట్టి ఇభ్యః (= ప్రభువు) కర్త బహిర్గతమైనది.

ఇట్టి శ్లోకము లెన్నో ఉన్నను, విస్తరభీతిచే విడువబడినవి.

## కర్మ గుప్తము

కర్తకు ఈప్సితతమమైనదానిని కర్మకారకమందురు. అనగా - క్రియ దేనివి విషయము గావించుకొనునో - అది "కర్మ".

శ్లో॥ శీకరాసార సంవాహీ సరోజవన మారుతః ।
ప్రక్షోభయతి పాన్థస్త్రీ విశ్వాసైరివ మాంసలః॥ వి.ము.38

1. శీకర+ఆసార - సంవాహీ=తుంపరల - జడివానను - మోసుకొని వచ్చుచున్న.

2. సరోజ - వన - మారుతః = కమల - వన - వాయువు,

3. పాన్థస్త్రీ - నిః శ్వాసైః - మాంసలః - ఇవ = బాటసారుల భార్యలయొక్క - నిట్టూర్పులతో - బలసినట్లున్నదై 4. ప్రక్షోభయతి = కలతపెట్టుచున్నది.

దేనిని? ఫలాశ్రయమైన "కర్మ" గుప్తముగనున్నది.

∴ "సరోజవనమారుతః" ను "సరః + జవనమారుతః"గా ఛేదించినచో, అతి వేగముగా వీచుచున్న గాలి, "సరః = సరస్సును" కలతపెట్టుచున్నది. కనుక "సరః" అను కర్మ గుప్తము

విషం భుంక్ష్వ సహామాత్యైః వినాశ ముపయాస్యసి।

నాభ్యాంకే నాపి రాజేంద్ర! కృష్ణాజిన మకంటకమ్ ॥ చం. చ.60

రాజేంద్ర! = మహారాజా! అమాత్యైః - సహ, విషం - భుంక్ష్వ = (నీ) మంత్రులతోపాటు, విషమును త్రాగుము. వినాశనమును పొందగలవు"....... అను అశుభార్థములను చెప్పినచో భయము కలుగును. ∴ అట్లుగాక - మహారాజా! వి - షం = షకారము లేనట్టియు, నాభ్యాం = రెండు నకారములతోను, కేన + అపి - వినా = ఒక కకారము - కూడ లేకుండా ఉన్నట్టి, కృష్ణాజినం= కృష్ణాజినముఅను శబ్దముయొక్క అర్ధమును,అకంటకం=శత్రుభయము లేనివాడవై, అమాత్యైః + సహ = మంత్రులందరితో - పాటు, భుంక్ష్వ = అనుభవింపుము,

∴ శమ్ = సుఖమును, ఉపయాస్యసి = పొందగలవు - అని అర్థం చెప్పుకోవాలి.

గమనిక : ఇక్కడ (క్-ఋ-ష్-ణ్-ఆ-జ్-ఇ-న్-అ-మ్" ఈ 10 అక్షరములను కలిపిన = "కృష్ణాజినమ్" అగుచున్నది. దీనినుండి "ష్" కారమును, రెండు "న"కారములను, ఒక "క" కారమును అనగా "ష్-న్-న్-క్" అను 4 అక్షరాలను తొలగించిన, "ఋ-ఆ-జ్-ఇ-అ-మ్"అను 6 అక్షరాలు మిగులుచున్నవి. వీనిన్నింటిని కలిపిన "రాజ్యమ్" అగుచున్నది. అనగా ఓ రాజా "రాజ్యము" ను నిష్కంటకముగ అనుభవించుచు, సుఖమును (శం) పొందుమని ఆశీర్వాదము

∴ "కృష్ణాజినమ్" అను పదంలో గూఢంగా నున్న "రాజ్యమ్" అను ఫలాశ్రయమగు కర్మ, ఇపుడు బహిర్గతమై, భవ్య భావము నందించినది.

శ్లో॥ సతతం 1. భూధరభువో దేవో రక్షతు మాధవః।
2. స్వభక్తానల్పసంకల్పకల్పనాకల్ప పాదపః ॥ చ.చి.

1. హిమవత్పర్వతమునకు బుట్టిన - పార్వతి యొక్క, దేవరయై నట్టియు, 2. తన భక్తుల - అనేక కోర్కెలను - తీర్చుటలో - కల్పవృక్షము వంటి వాడైనట్టియు, మాధవః = విష్ణువు.... రక్షతు = రక్షించును గాక ।

"ఎవరిని ?" - అను కర్మ లోపించినది. అంతేగాక, "పార్వతీ భర్త విష్ణువు" అను అపార్థము కూడ స్ఫురించుచున్నది. కనుక, మాధవః" ను, "మా-ధవః" గా విడదీసిన, పార్వతికి, ధవః = భర్త, దేవుడునైన శివుడు, మా= నన్ను, రక్షించుగాక - అను అర్థము సమంజసమగును.

గమనిక : ఈ "మా" అను పదము "అస్మత్" శబ్దముయొక్క ద్వితీయైక - వచనము (మాం, మా-ఆవాం, నౌ-అస్మాన్, నః) గా తెలియదగును.

"మా" అను కర్మ లుప్తమగుటచే, ఇది కర్మగుప్తము.
కే నే మా దుర్విదగ్ధేన హృదయే వినివేశితౌ।
పిబత స్తే శరావేణ వారి కల్హారశీతలమ్॥ హే.కా.శా.

కల్హారశీతలం - వారి = సౌగంధిక పుష్పములతో - చల్లనైన నీటిని, మూకుడుతో (శరావేణ) త్రాగుచున్న నీ రొమ్మున, ఏ మూర్ఖునుచే .... .... నాటబడినవి ? ఇట్లు నాటబడిన కర్మలు గుప్తములుగా నున్నవి. ∴ ఇక్కడ "శరావేణ" అనునది ఒక పదము కాదు. దానిని "శరౌ + ఏణ!" గా విభజించిన, (హే) ఏణ= ఓ లేడీ! శరౌ = రెండు బాణములు-గ్రుచ్చబడినవి అను అర్థము సరిపోవును.

∴ శరౌ (= రెండు బాణములు) (శరః శరౌ శరాః) అను, "కర్మ" గుప్తము.

గమనిక : ఒక సందేహము. ఇక్కడ "బాణములు" ప్రథమావిభక్తిలో నున్నవి. "కర్మ" ద్వితీయావిభక్తిలో నుండవలెనుగదా ? అని ప్రశ్న. "రాముడు పుస్తకమును చదువుచున్నాడు - వాక్యములో కర్తయగు రాముడు ప్ర.వి. లోను, కర్మయగు పుస్తకము ద్వితీయావిభక్తిలోను ఉన్నవి. ధాతువు సకర్మకము (Active voice) అయినపుడు మాత్రమే కర్మపదము. ద్వి.వి.లో ఉండును. ఈ

సకర్మకము కర్మణి ప్రయోగము (passive voice) లోనికి మార్చబడినపుడు సకర్మకం లోని కర్తృపదము తృతీయావిభక్తిలోనికి, కర్మపదము ప్ర. వి. లోనికి మారును. ∴ రామునిచే చదువబడుచున్నది. ∴ ఇక్కడ 'పుస్తకము' ప్ర.వి. లోనే ఉన్నది. అట్లే 'శరౌ' (=రెండు బాణములు) అను పదము కర్మణి. ప్రయోగములో నుండుటవలన, దీనిని 'కర్మ' గానే గ్రహింపవలెను.

ఈ విశేషములను దెల్పుటకే, ఈ దృష్టాంతము విడిగా నీయబడినది.

## కరణపదగోపనమ్

అహం మహానసా యాతః కల్పితో నరక స్తవ।
మయా మాంసాదికం భుక్తం భీమం జానీహి మాం బక!॥ వి.ము.4-41

భీమసేనుడు బకాసురునితో నిట్లు చెప్పుచున్నాడు. ఓ బకాసురా! నీకు భోజనముగా కల్పించి, పంపబడిన, చిన్న మనిషిని (నర-కః) లేక నీకు మృత్యువుగా కల్పింపబడిన - నేను, వంట యింటి నుండి వచ్చితిని. (మహానస+ఆయాతః). నాచే మాంసాదిక మంతయు తినబడినది. నన్ను భయంకరునిగా, లేక భీమసేనునిగా తెలిసికొనుము.

'కరణ' మనగా సాధకతమమైనది, అనగా - దేనిచేత క్రియ ఉత్పత్తి చేయబడునో, అదియే 'కరణ' కారకము. ఇక్కడ, దేనిని సాధనము (ఉపకరణము=పనిముట్టు)గా చేసికొని, భీముడు వచ్చెను? అను 'కరణ' (తృతీయావిభక్తి) పదము గూఢము. కాబట్టి 'మహానసాయాతః' అనుదానిని, మహా + అనసా+ ఆయాతః' అని ఛేదించి, పెద్ద - బండితో (బండిని సాధనముగా చేసికొని) వచ్చితిని - అని అర్థము చెప్పవలెను. అప్పుడు, గూఢముగానున్న 'అనసా' (= బండితో) అను తృతీయాన్త - కరణ పదము బహిర్గతమగును.

వివరణ : 'నరః ఏవ = నరకః' లోని "క" ప్రత్యయము స్వార్థమున గాక, అల్పార్థమున వచ్చినందున, 'చిన్న మనిషి' అని అర్థము. 'అనస్' శబ్దము సకారాన్త నపుంసకలింగము. మనః - మనసా, వలె, 'అనః' అను ప్రథ

మైక వచనము కూడ 'అనసా' అని, తృ. ఏ. గా మారినదని, విజ్ఞ పాఠకులు గమనింపక పోరు.

పూతి పంకమయేఽత్యర్థం కాసారే దుఃఖితా అమీ ।

దుర్వారా మానసం హంసా గమిష్య న్తి ఘనాగమే ॥ సు. భా

వర్షాకాలము వచ్చినంతనే, దుర్గంధము, బురదతో నిండియున్న సరస్సునందు, మిక్కిలి బాధపడి, వారింప నలవిగానివియైన (దుర్వారాః) ఈ హంస జాతి పక్షులు, మానస - సరోవరమును గూర్చి, పోవుచున్నవి. "దేనితో బాధపడి?" అను 'కరణ' (తృతీయా న్త) పదము 'దుర్వారా'లో గోపితమైనది.

దుష్టం వాః (=జలము) = దుర్వాః (=చెడ్డనీరు) తేన = దుర్వారా= చెడిన లేక కలుషితమైన నీటితో, ఇది రేఫాన్త 'వార్' శబ్దము కాని, ఇకారాన్త "వారి" శబ్దము మాత్రము కాదు. "ఆపః స్త్రీ భూమ్ని వార్ వారి" అని అమర కోశము. 'దుర్వారా దుర్వార్భ్యాం దుర్వార్భిః' (తృ.వి.). కాబట్టి "దుర్వారా" అను 'కరణ' పదము బహిర్గతము చేయబడినది.

యాం గీతిం తవ వదనాత్ సుతను! పిబామః సుధామధురామ్ ।

మఘవా పి న తాం త్రిదివే లభతే హాహాపి పశగేన॥ క. క.

సుతను! మేము నీ నోటి నుండి వింటున్న అమృత మధురగీతికను, దేవేంద్రుడు తన స్వాధీనములో నున్న "హాహా" అను గంధర్వుని (గానము)తో, కూడ పొందలేకున్నాడు. కాబట్టి నీ గానము అమరగాంధర్వగానమును మించినదని భావం.

స్వర్గమున 'హాహా' అను గానకోవిదుడగు గంధర్వుడొకడు గలడు. అతడు 'హా+ఆహా' అని గానము చేయుటచేగాని, అతని గానమును విన్న శ్రోతలు "హా+అహా"(వాహ్వా) అని మెచ్చుకొనుటచేతగాని 'హాహా' అను పేరు గలవాడయ్యెనేమో?) ఈ "హాహా" శబ్దమునకు తృతీయాన్తము గూడ "హాహా" యగును. అప్పుడు - హాహా = హాహా అను పేరుగల గంధర్వుని (గానము)తో, దేవేంద్రుడు పొందజాలని ఆనందమును కూడ మేము నీ సుధామధుర గీతికలో

గాంను పన్నామను అర్థము సమంజసము. హాహా హాహాభ్యాం హాహాభిః అని ఆకారాన్త "హాహాః" శబ్ద తృ. ఏ. వచనము. కాబట్టి కరణగుప్తము.

శ్లో॥ 1. కేనాన్నస్య వినాశః స్యాత్, 2 కురుకులమధ్యే ద్రక్షిచ పాంచాలీ।

అత్రైత్రివోత్తర ముక్తం సువ్యక్తం ప్రశ్నయో రుభయోః ॥

బ్రిటిష్ పరిపాలనలో అధికారిగా పనిచేసిన శ్రీ కొండ శేషాచలం నాయుడు దేశమంతట తిరుగుచు, అక్కడక్కడ సేకరించిన శ్లోకాలతో 'చిత్ర ప్రశ్నోత్తర రత్నావళి' పేరుతో, నొక చిరుపొత్తమును ప్రకటించెను, అ జర్జర ప్రతి రాజమండ్రి గౌతమీ గ్రంథాలయములో నున్నది. దాని నుండి ఈ శ్లోకము గ్రహింపబడినది. నాయుడుగారికి కృతజ్ఞతతో.

1. అన్నము దేనిచే తరిగిపోవును? 2. కౌరవసభలో పాంచాలి ఎల్లండెను?

ఈ రెండు ప్రశ్నలకు 'అత్రా' అనునది సమాధానముగా నిక్కడనే ఉన్నది. తెలిసికొనుడు.

1. అత్రా = అన్నము నెక్కువగా తిను తిండిపోతుచేత (అద-భక్షణే- అను ధాతుజన్య పదము యొక్క ప్రథమా - ఏకవచనము 'అత్తా'. దాని తృతీయావిభక్తి -అత్రా, ('ధాతా - ధాత్రా' వలె)

2. అః = విష్ణువు, దాని పైన 'త్రా = రక్షణే' అను ధాతువు నుండి పుట్టిన "త్రాః" రూపం యొక్క, తృతీయా - ఏకవచనరూపము- అత్రా = కృష్ణునిచేత, (ద్రౌపది, కౌరవసభలో వస్త్రాపహరణము నుండి కృష్ణునిచేత రక్షింపబడుటను గుర్తుచేసుకొనవలెను.

కాబట్టి 'అత్రా' అనునది తృతీయా న్తమని, 'అత్రైవ' (అత్రా+ఏవ) అను సంధిలో గుప్తమైనదని కూడ గ్రహింపవలెను.

## సంప్రదాన గుప్తి

శ్లో॥ అంభోరుహ మయే స్నాత్వా వాపీ పయసి కామినీ,
దదాతి భక్తి సంపన్నా పుష్పం సౌభాగ్య కామ్యయా॥

ఒక వనిత అనేక పద్మాలతో నిండిన, నడబావి నీటిలో స్నానముచేసి, సౌందర్యము పొందవలెనను కోరికతో, దైవభక్తితో గూడినదై, పూవును సమర్పించుచున్నది. ఎవరికి? (-కొరకు, కోసమై?)ఇచ్చుచున్నది? అను సంప్రదానము గుప్తముగనున్నది.గమనిక: ఒక వస్తువును ఎవరికొరకు దానము చేయగోరుదురో ఆ వ్యక్తి 'సంప్రదానము'. అట్టి సంప్రదానబోధక ప్రాతిపదికపై, చతుర్థీ విభక్తి వచ్చునని వ్యాకరణకర్తలు చెప్పిరి.

ఉదా: రాజా గాం విప్రాయ దదాతి. రాజు ఆవును బ్రాహ్మణుని కొరకు ఇచ్చుచున్నాడు.

ఈ శ్లోకమునందలి 'అంభోరుహ మయే' ను, 'అంభోరుహం-అయే' అని విడదీసినచో, తామరపూవును, అయే = మన్మథునికొరకు, దానము చేయుచున్నది. 'ఇః' అనగా మన్మథుడు. దాని చతుర్థీ విభక్తి 'అయే' అనగా మన్మథుని కొరకు, పూవును సమర్పించుచున్నది. అనగా 'అయే' అను సంప్రదాన కారకము గుప్తి నుండి బైటపడినది. 'అయే' -'హరిః - హరయే ' వలె, చ. విభక్తి.

మగ్నాపి వారవనితా మదనోదన్వ త్యనన్తరాయేఽ సౌ।
లావణ్యశాలిన మపి స్వాత్మాన మశంక మర్పయతి॥ క.క.

అడ్డులేని మన్మథుడు అనుసముద్రమున, మునిగినది, అయినను,ఈ వారవనిత, అందమైన తన ఆత్మను కూడ, జంకులేక (అశంకం) సమర్పించుచున్నది. 'ఎవరికోసమై?' అను 'సంప్రదానము గూఢము.

అసలే వెలయాలు. ఆమె ఎప్పుడైన వెలను (ధనమును) తీసుకొనక, తనను సమర్పించుకొనునా? అసంభవము. కాబట్టి 'అనన్తరాయే' (= అడ్డులేని) అనునది విశేషణము కాదు "అనంతః రాః యస్యసః = అనన్తరాః= అంతులేని డబ్బు (రాః) కలవాడని అర్థము. దాని చతుర్థి - అనన్తరాయే = మహాధనికుని కొరకు (సంప్రదానము) తనను (ఆత్మను) అర్పించుకొనుచున్నది. ఇప్పుడు గుప్తముగా నున్న "అనన్తరాయే" అను సంప్రదానము బహిర్గతమైనది.

# అపాదానగుప్తమ్

శ్లో॥ శిలీముఖై స్త్వయా వీర! దుర్వారై ర్నిర్జితో రిపుః।
బిభేత్యత్యన్త మలినో వనేఽపి కుసుమాకులే॥ వి.ము. 4-44

అపాదానము అనగా విడివడుట. 1. ఏది ధ్రువము (స్థిరము) గా నిల్చునో - అదియును, 2. భయము, రక్షణము - అను అర్థములు వచ్చు పదాలు ప్రయోగించినపుడు దేనివలన ఈ భయాదులు కలుగునో - అదియును, "అపాదానము' అనబడును. 1. ధ్రువ మపాయేఽపాదానమ్, 2. భీత్రార్థానాం భయహేతుః అనియు వైయాకరణ-పాణిని సూత్రములు. అట్టి అపాదానబోధక శబ్దరూపముపై పంచమీ విభక్తి వచ్చును. ఉదాః 1. చెట్టునుండి కాయపడినది. 'చెట్టు' అపాదానము, 2. దొంగవలన భయము. 'దొంగ' అపాదానము.

ఓ శూరుడా! నీచేత నివారించుటకు వీలుకాని బాణములతో (శిలీముఖైః) జయింపబడిన, మిక్కిలి దోషములతో గూడిన (అత్యన్త-మలినః) శత్రువు, పూవులకు నిలయమైన అరణ్యమునందు కూడ భయపడుచున్నాడు. దేనివలన? అను అపాదాన కారకము (పఞ్చమీవిభక్తి) గుప్తము, కాబట్టి 'అత్యన్తమలినః' ను 'అత్యన్తం-అలినః, గా, ఛేదించి, అలినః=తుమ్మెద లేక తేనెటీగవంటి చిన్న దాని వలన కూడ, అత్యన్తం-బిభేతి-=మిక్కిలి-భయపడుచున్నాడు-అని అర్థము చెప్పుకొనవలెను. అందువలన "అలినః" అను అపాదానము వ్యక్తమగుచున్నది.

శ్లో॥ దయితే! మదనాయాస వశంవద పద స్పృశః!
పద వారయసి ప్రేమ్ణా కి మితి స్తిమితా దృశమ్॥ (క. క.)

ప్రియురాలా! కాముని శ్రమకులోనై నీ పాదములనంటిన ..............
నీ చూపును, ఏల స్థిరంగా మరల్చుకొనుచున్నావో తెల్పుము. "ఎవని నుండి?" ఇక్కడ "మదనాయాస........పదస్పృశః"ను, 'మత్+అనాయాస.... స్పృశః'గా విభజించిన, అప్రయత్న(అనాయాస....)ముగానే నీ స్వాధీనుడనైన మత్=నా (మీద) నుండి (నీ) చూపును, ఏల నివారించు చున్నావు? కనుక ఇక్కడ 'మత్' అనునది "అపాదానము" (పంచమీ). ఇది గుప్తముగనున్నది. "మత్-ఆవాభ్యామ్-అస్మత్" అని, అస్మచ్ఛబ్దము యొక్క పంచమీ విభక్తియొక్క ఏకవచనరూపము-'మత్' అగుచున్నది.

# అధికరణగుప్తమ్

శ్లో॥ యా కటాక్షచ్ఛటాపాతైః పవిత్రయతి మానవమ్।
ఏకాన్తే రోపిత ప్రీతిః అస్తి సా కమలాలయా॥ (వి. ము.4-46)

ఏకాన్త స్థలమున మానవునికి ప్రేమను పెంచిన ఎవతె, తన కడగంటి చూపులను విసరి, పవిత్రమైన వానినిగా చేయుచున్నదో, ఆ పద్మనిలయమైన లక్ష్మి ఉన్నది (అస్తి).

ఏకాన్తే-రోపిత ప్రీతిః-రహస్య స్థలమున-నాటియున్న ప్రేమగలది ' ఎవరియందు'? అను 'అధికరణకారకము' గుప్తముగనున్నది. లక్ష్మియొక్క ప్రేమను ఏకాన్తమునందు ఆరోపించుటకూడ అసందర్భము కావచ్చును. కనుక, 'ఏకాన్తే'ను 'ఏ+కాన్తే' అని విడదీసి, కాన్తే-ప్రియుడైన, ఏ=కృ(వి)ష్ణునియందు, ప్రేమను-పెంపొందించుకొనినలక్ష్మి (కమలాలయా) అని చెప్పిన అర్థము సరిపోవును. అః= విష్ణువు, కృష్ణుడు అని ఏకాక్షర నిఘంటువు. "దాని సప్తమీ ఏకవచనము = ఏ, రామః ప్ర. వి. రామే అను సప్తమివిభక్తి అయినట్లు, అః-ఏ(సప్తమి) ఐనది. అధికరణమనగా ఆధారము. ఎచ్చట సర్వము ఉత్పత్తి చేయబడునో లేదా ఉంచబడునో అది "ఆధార" మనబడును.

శ్లో॥ విప ద్య మానతా సిద్ధా సర్వ స్యైవ నిరూష్మణః।
యథాత్ర భస్మ పద్భ్యాం చ నిర్వాణం హన్త్యయం జనః॥ వి.ము.4-47

ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు పోయిన (నిరూష్మణః) ప్రతి మనిషికి కూడ ఆపదను (మరణమును) పొందుట (విపద్యమానతా) తప్పక సిద్ధించియున్నది. "దేనియందు"? సిద్ధించును-అను " అధికరణము " గుప్తముగనున్నది. కనుక "విపద్యమానతా"ను " విపది+అమానతా "గా భేదించిన, విపది=ఆపదయందు, అనగా కష్టములేక మరణము మొ॥నవి వచ్చిన సమయమందు, అ-మానతా= ఆదరము లేకపోవుట-కలుగును. ఆపదలోనున్న వానిని ఆప్తులుకూడ ఆదరింపరని భావము.

కాబట్టి "విపది" అను అధికరణము గుప్తము.

# సంబంధగుప్తము

శ్లో॥ ప్రాప్త మదో మధుమాసః ప్రబలా రుక్ ప్రియతమోఽపి దూరస్థః!
అసతీ సన్నిహితే యం సంహృతశీలా సఖీ నియతమ్॥ (వి.ము.4.49)

వివరణ : ఈ సంబంధగుప్తము కారకములలో చేరదు. ప్రధానంగా క్రియా హేతుసంబంధముగలది మాత్రమే "కారక" మని లోగావివరింపబడినది. కావున ఇది ప్రత్యేకముగ చెప్పబడినది.

"మత్తు నెక్కించెడి చైత్రమాసమొక వైపున నుండగా, మిక్కిలి బలవత్తరమైన కామజ్వరము మరొక వైపున పీడించుచున్నది. ప్రియతముడగు భర్తను చూతమా - ఎక్కడో దూర (దేశ)స్థము నందున్నాడు సత్స్వభావమును సాగనంపిన కులటయగు ఈ సఖి, నిశ్చయముగా ఇప్పుడు అతనికి సమీపము నందున్నది. అయ్యో ! ఏమి చేయ(జరుగ)నున్నదోగదా? అని ఒక నాయిక విరహ వ్యథ నొందుచున్నది.

దీనిలో ఏ పదముగాని గుప్తమైయున్నట్లు పైకి కన్పడదు. కాని, ప్రబలా-రుక్ = బలవత్తరమైన-రోగము అనుటచే "ఎవనియొక్క' రోగము?-అను సంబంధ పదము (షష్ఠీవిభక్తి) గూఢముగ, ఉండనే ఉన్నది. కావున 'ప్రాప్తమదో మధు మాసః' ను, ప్రాప్తం-అదః-మధు-మాసః గా విడదీసిన, అదః = ఈ, మధు = మత్తును గలిగించు పానీయము-అనగా మద్యము, మాసః = చంద్రుని(యొక్క)-సంబంధమైన, ప్రబలా-రుకు = బలవత్తరమైన-కామజ్వరము, పీడించుచున్నది. అని కలిపి చెప్పుకొనిన, అర్థము సరిపోవును. చంద్రుడు కామోద్దీపకుడుకదా! కావున, మాసః = చంద్రునియొక్క అను సంబంధము (షష్ఠీవిభక్తి) ఇక్కడ గుప్తముగనున్నది. 'మాస్'-శబ్దము సకారాంతము. దానియొక్క షష్ఠీవిభక్తి "మాసః" అని గమనింపవలెను.

శ్లో॥ న మయా గోరసా భిజ్ఞం చేతః కస్మాత్ ప్రకుప్యసి।
అస్థాన రుదితైరేభిః అల మాలోహితేక్షణే॥ (స.కం. 2-368)

అర్థము : మయా-చేతః-గోరసాభిజ్ఞం-న = నాచేత-మనస్సు-పాలరుచిని ఎరుగగోరునదిగా-చేయబడలేదు. కస్మాత్-ప్రకుప్యసి = ఏల-(నాపై) కోపగించు చున్నావు ? ఆలోహితేక్షణే=గుడ్లెర్రగాచేలియున్నదానా !

ఏఖి :- అస్థానరుదితైః- అలమ్ = (ఇకనైనా) ఈ అనవసరంగా ఏడ్పు టలను- చాలింపుము.

ఇది వాస్తవార్థమా? కాదు. కృష్ణుడు పాల నాశించటం లేదు. ఇంకా ఏ పాప కార్యం వలని సంతోషం కూడ పొందగోరటం లేదు. ఇక్కడి ప్రథమ పాదము నందలి "న-మయా-గోరసాభిజ్ఞం"లోని 'మయా' తృతీయార్థాన్ని కల్గిస్తోంది. అట్లు విడదీయక, మే+అగోరసాభిజ్ఞం' అని విడదీసినచో, మే-చేతః, అగోర సాభిజ్ఞం-న= నాయొక్క-మనస్సు- పాపము నందు అనురాగము కలది- కాదు. అందువలన 'మే' సంబంధపదము. కాబట్టి షష్ఠీవిభక్తి గుప్తం చేయబడుటచే, ఇది సంబంధగుప్తము.

వివరణము; సాధారణంగా 'సంబంధ' గణన ప్రత్యేకంగా నిర్దేశింపక, కారకాల లోనే చేర్చవచ్చును. కాని, సంస్కృతంలో 'సంబంధం, సంబోధనం' ఈ రెండూ ప్రధాన కారకాలుగా గ్రహింపబడలేదు.

2. మే + అగోరసాభిజ్ఞం'ను 'ఏచోఽయవాయావః' అను సూత్రముచే సంధింపగా, 'మయాగోరసాభిజ్ఞం' అయినది. అందువలన దీనిని "సంధి గుప్తం" అని కూడ పిలుస్తారు. దండి మహాకవి దీనిని 'సమాగత-ప్రహేలిక'గా పరిగణిం చెను. కా. ద. 3-108.

3. 'కారకాణి షట్' ఆధారంగానే, ఇది వేరుగా తలంచబడింది. కాని, 'విభక్తి గూఢం' దృష్టిలో, అన్యాచార్యమతంలో, ఈ ప్రభేదం 'విభక్తిగూఢం' అనియే భావింపబడింది. ఏలన-ఇక్కడ, కర్తృ, కర్మ,.... ఆది ప్రథమా. ద్వితీయా లకు సమానంగా షష్ఠీగుప్తమున్నది. 'మయా' పదంలో, సంధి-దురూహతా- ఆధా రంగా, సు. ర. భాం.లో దీనిని 'సంధిగూఢ' చిత్రంగానే పేర్కొన్నారు.

4. భోజరాజు క్రియా, కారకగూఢ- అతిరిక్తంగా, 3.వ భేదమును సంబంధగూఢం గా నిర్దేశించెను. దీనిలో షష్ఠీవిభక్తి గూఢంగా ఉండటం వలన 'సంబంధగూఢం' అన్నాడు.

బాలయా పృథివీపాల! వ్యలోకత తయాననమ్।
తదా ప్రభృతి తాం విన్యే స్మరః స్వశరవేద్యతామ్॥ దే. క.

రాజా! ఆ యువతిచే (తయా-బాలయా) నీ మొగము చూడబడినప్పటి నుండి, మన్మథుడు ఆ బాలను తన బాణములకు పాత్రముగా చేసుకొనెను.

దీనిలో 'తయా' పదము 'బాలయా'కు విశేషణమను భ్రమను కలిగించి, 'తే' (=నీ యొక్క) అను సంబంధ పదాన్ని మాటుపరచింది. 'తే+ఆననమ్=తయా ననమ్ (అయవాయావాదేశ సంధి)గా విడదీసిన, తే-ఆననం-వ్యలోకత=నీయొక్క-మొగము-చూడబడెను- అను అర్థం సరిపోతుంది. అందువలన 'తే' (షష్ఠి) గుప్త మగుటచే 'సంబంధ గుప్తం'.

## సంబోధన 'అమన్త్రిత' గుప్తమ్

శ్లో॥ కమలే కమలే నిత్యం మధూని పిబత స్తవ।
భవిష్యతి న సన్దేహః కష్టం దోషాకరోదయే॥

ప్రతిపద్మము నందును ఎల్లప్పుడు తేనెలను త్రాగుచున్న, తుమ్మెదవగు నీకు, చంద్రోదయము కాగానే, (దోషా+ఆకర-ఉదయే) దుఃఖము రాగలదు సుమా! ఈ విషయంలో నీవేమీ సందేహింపవలసిన పనిలేదు.

దోషాకరుడు=రాత్రిని చేయువాడు= చంద్రుడు. చంద్రోదయమైనంతనే, తామరపూవులు ముడుచుకొని పోవును. అందుచే పగలు తేనెను త్రాగుచు, పద్మము లోపల పడిపోయిన నీకు, రాత్రి రాగానే, పద్మము ముకుళించుకొనుటచే, దుఃఖము తప్పదన్న మాట.

ఈ వాక్యము ఎవరిని సంబోధించి చెప్పుచున్నట్లు? ఆ సంబోధన పదము ఎక్కడ ఉన్నను వెదకి, వెలికితీసిన గాని, అర్థము పొసగదు.

అందువలన "కమలే"- అనుపదమును 'కమ్-అలే' అని విడదీసిన (హే) అలే!=ఓ తుమ్మెదా!(కమలే = తామరపూవు నందు-సదా,మధుపానము-చేయుచున్న నీకు- చంద్రోదయమునకు ముందు) కమ్=సుఖము, భవిష్యతి= సంభవింపగలదు. అని చెప్పుకొనిన, గుప్తమైన "అలే!" అను సంబోధన — బైటపడి అర్థము సరిపోవును.

అలి (=తుమ్మెద) శబ్ద-సంబోధన 'అలే!' అగును. అందువలన ఇది సంబోధన లేక అమన్త్రిత-గుప్తము.

శ్లో॥ సర్వజ్ఞేన త్వయా కించిత్ నాస్త్యవిజ్ఞాత మీదృశమ్।
మిథ్యావచస్తథా చ త్వం అసత్యం వేత్సి న క్వచిత్॥

సర్వము నెరిగిన నీకే, తెలియబడని దేదియు లేదు- అని చెప్పుట వ్యర్థమే. పిదప- 'నీవు అబద్ధమును గురించి, ఎప్పుడైనా ఏమైనా తెలుసుకొన్నావా?' ఈ మాత్రం కూడ తెలియని నీవు 'సర్వజ్ఞుడవు' ఎలా కాగలవు? అని, పైకి కవినింద కప్పబడినను, తర్వాత ఇది రాజస్తుతి పర్యవసాయి'యే యగును.

ఈ వాక్యము ఎవరిని సంబోధించి చెప్పుచున్నట్లు? ఆ సంబోధన గుప్తముగ నున్నది. అందువలన 'సర్వజ్ఞేన'ను 'సర్వజ్ఞ+ఇన!' అని విడదీసిన, సర్వము నెరిగిన పండితులకు- ప్రభువా? అని గాని, లేక సర్వజ్ఞ! ఇన! అను వానికి సర్వము నెరిగిన వాడా 'ప్రభువా' అని గాని, సంబోధించినట్లు గాని, చెప్పుకొనవచ్చును. మొత్తం మీద 'ఇన!'= ప్రభువా! అను సంబోధన బహిర్గతమైనది.

శ్లో॥ వటవృక్షో మహా నత్ర మార్గ మావృత్య తిష్ఠతి
తావ త్త్వయా న గన్తవ్యం యావత్ నా న్యత్ర గచ్ఛతి॥

త్రోవకు అడ్డంగా, ఇక్కడ మఱ్ఱి చెట్టొకటి ఉన్నది. అది మరొక చోటకు తొలగిపోనంతవరకు, నీవు అచ్చటికి వెళ్ళవద్దు- అని నిషేధం.

ఎవరిని సంబోధించి (పిలిచి) చెప్పుచున్నట్లు? ఆ చెట్టు కదలి మరొక చోటికి ఎలా వెళ్ళుతుంది? అందువలన సంబోధనను వెదకి వెలికితీయాలి. "వటవృక్షః"ను "వటో+ఋక్షః"గా విడదీసిన, (హే)వటో!= ఓ బ్రహ్మచారీ! లేక ఓ అబ్బాయీ!, ఋక్షః= ఎలుగుబంటు, త్రోవకు అడ్డంగా నిలిచి ఉన్నది. అది తొలగి వెళ్ళిపో నంత వరకు, అటువైపు వెళ్ళవద్దు సుమా?.... అన్నచో అర్థం కూడ సరిపోతుంది. అందువలన "వటో!" అను సంబోధనం గుప్తం.

## గత ప్రత్యాగత- సంబోధన గుప్తమ్

శ్లో॥ కాశీ దాసతి దాయోమా చంద్రదంతే రిపు రక్షకః।
కంజకం పురి తేన్ద్రించ మాయో దాశీ సదాశికా॥ చా. చ.

(హే) దాసశీ=(పుత్రులవలె) దాసులను అనుగ్రహించుదానా! ("ల-శ" లకు భేదం గ్రహింపబడలేదు) (హే) దాయో!= (దాయః+ఉః= అవిభక్తుడగు—శివుడు. అర్ధనారీశ్వర రూపం) విభజింపబడని శరీరము గలవాడా! (హే) మాయో! = "మాయా+ఉః" మాయారూప దేవతా! (హే) దాశీ=(దాం-లాతి) ఒర్పు గలదానా! (హే) సదాశీ = (సత్యః-ఆళ్యః) లక్ష్మీ సరస్వత్యాదులు చెలికత్తెలుగా గలదానా!

(హే) కాళి = ఓ కాళికా మాతా!, పురి = సేవకుల విషయమున, తే = నీ యొక్క, తా = కరుణ, చంద్రం ఇవ = చంద్రుని-వలె, కంజరక్షి = (కంజాని- రాతిగృహ్ణాతి) సూర్యుని, ఇంద్రం-చ = దేవేంద్రుని గూర్చియు, రిపుకం = అరిషడ్వర్గమును పెంచు) అజ్ఞానినగు, మా = నన్ను గురించి, కా = సుఖగౌరవస్థానము, (భవతు = కలుగచేయు దుపు గాక!) అనగా, ఓ కాళీమాతా ! నీ కరుణ చంద్ర-సూర్య-ఇంద్రులందువలె, నన్ను గూర్చియు సర్వ సుఖముల నిచ్చుగాక !

దీనిలో అనేక సంబోధనలుండుట ఒక ప్రత్యేకత. దీనిని కాళిదాసమహాకవి శ్లోకంగా కొందరు పేర్కొన్నారు.

శ్లో॥ కఠిన కుచౌ తవ బాలే: చటుల చకోరాక్షి తావకే నయనే।
కుటిల సుకేశ్యలకా స్తే మిథ్యావాది న్లతాంగి తవ మధ్యమ్॥ (చా.చ.)

అర్థము : (హే! కఠిన! = ఓ క్రూరుడా। (అని నాయిక, పరిహసించుచు, నాయకుని సంబోధించి, ఎత్తిపొడుచుచున్నది. దానికి నాయకుని సమాధానము.) (హే) బాలే = (16 సం. వయస్సుగల లేక మూర్ఖురాలపైన) బాలికా !, తవ-కఠిన కుచౌ = నీ-స్తనములే -చన్నులే- కఠినములు -గట్టిగనున్నవి సుమా!- చటుల ! = ఓ చంచల స్వభావంగలవాడా -అని-నాయిక సంబోధింప-,చకోరాక్షి! = వెన్నెలపులుగు -ఒక పక్షి- యొక్క-వలె-చంచల నేత్రాలు గలదానా!, తావకే-నయనే = నీ-కన్నులే సుమా -చంచలములు- అని నాయకుని ప్రత్యుత్తరం], కుటిల! = వంకరనడత- కలవాడా ! -నాయికా-సంబోధన-, సుకేశి! తే-అలకాః = మంచివెంద్రుకలు కలదానా! నీ-ముంగురులే-వంకరగనున్నవి -కుటిలాః-; మిథ్యావాదిన్ = కల్లరీ ! -నాయిక- సంబోధింప- లతాంగి!-తవ-మధ్యం = తీగవలె సన్నని శరీరముగలదానా : నీ- నడుమే-మిథ్య-కల్ల-, అసలు ఉన్నదో? లేదో? అనగా సదసత్సంశయగోచరోదరి వని భావము.

ఈ నాయికా నాయక పరిహాస సంభాషణలో, ఆ యానమానసములందు కూడ, గుప్తములైన 'కఠిన!, చటుల!, కుటిల!, మిథ్యావాదిన్!' అను చాల సంబోధనలు గుప్తములై యుండుట ప్రత్యేకముగా గమనింపదగినది.

## సప్తవిభక్తిగూఢము

కవులు ఆ యా విభక్తులను విడివిడిగానేకాక, ఒకేసారి మొత్తంగా అన్ని విభక్తులనుకూడ, గూఢంచేసి, పాఠకుల పరిజ్ఞానాన్ని పరీక్షిస్తారు. ఒకసారి వేంకటాధ్వరి యొక్క ఈ శ్లోకాన్ని అర్థంచేసుకొని ఆనందించండి.

శ్లో॥ పాయా న్మా మురసా వితః శ్రియ మునా రాధ్యాం ప్రపద్యే తమాం
కో వా న స్థిర మశ్నుతే శ మధనోఽప్యాలోకి తో జాతుచిత్ ।
వేదాన్తై ర్విమతాం ఘ్రయే న కి ముత శ్రేయో నతిం తన్వతాం
సేవా మో రచయామి, మానస సదా భక్త్యావహా వాదరమ్ ॥ (ల.స.చి 8)

ముందు పదవిభాగం చేసుకోకుండ, దీని అర్థం తెలుసుకోవడం మిక్కిలి కష్టం. కాబట్టి,పాయాత్, మాం, ఉః, అసౌ, ఇతః, శ్రియం,ఉనా,ఆరాధ్యాం, ప్రపద్యే తమాం, కః, వా, న, స్థిరం, అశ్నుతే, శమ్, అధనః, అపి, ఆలోకితః, జాతుచిత్ వే, దాన్తైః, విమతాం ఘ్రయే, న, కిమ్, ఉతః, శ్రేయః, నతిం, తన్వతాం సేవాం, ఒః, రచయామి, మానస !, సదా, భక్త్యా, ఆవహ, ఔ, ఆదరమ్.

దీనిలోని సంధులలో కొన్ని అర్థాలుకూడ గుప్తపరచబడినందున, పై పదచ్ఛేదము ననుసరించి, అర్థము చేసుకొనుట ఆవశ్యకము.

అర్థము : అసౌ–ఉః = ఈ–లక్ష్మి, మాం–పాయాత్ = నన్ను–రక్షించుగాక– అనేది సరియైన అర్థం. కాని, ఈ పద విభాగాన్ని గమనింపకున్నచో, ఉరసా– పాయాత్ = లక్ష్మి రొమ్ముతో–రక్షించును–అను అపార్థము అసంగతమగును. కనుక, ఇక్కడ, "ఉః" =లక్ష్మి అను 1 కర్తృకారకముగుప్తము, అహం= నేను, 3 ఉనా=శివునితో, ఇతః=ఇచ్చట, ఆరాధ్యాం- శ్రియమ్=సంతోషపరచు- సంపదను, ప్రపద్యేతమాం=బాగుగా పొందుదునుగాక ! "యమునారాధ్యాం" లో "ఉనా" అనుట లో కరణము గుప్తము. యయా = ఏలక్ష్మిచే జాతుచిత్= ఒకప్పుడైనను, ఆలోకితః+అపి= అను గ్రహదృష్టితో చూడబడినను, కః+ అధనః–వా=ఏ–దరిద్రుడైనవాడు–గాని, స్థిరం–శమ్=విలుకడగానుండు–సుఖమును న–అశ్నుతే=పొందకుండును? తప్పకపొందును 'శమధనః' శమమే ధనముగా గలవాడు అను వంచనతో 'శమ్' అను 2 కర్మకారకముగుప్తము. 4,5, దాంతైః= తపఃక్లేశము నణచుకొన్న–మునులచే, విమలాంఘ్రయే = స్వచ్ఛపాదములుగల, 4. వే=లక్ష్మికొరకు, నతిం–తన్వతాం= నమస్కారము–ల–ను–వి స్తరింప–జేయు వారికి, 5 ఉతః=లక్ష్మివలన, శ్రేయః–న–కిమ్=శుభము–కలుగుటలేదా? తప్పక కలుగుచున్నది ఇక్కడ 'వేదాన్తైః–న కి ముతః....'అనుచోట్ల చాతుర్థీ–పంచమీ విభక్తులు గుప్తములు. 4 'ఉ' శబ్దమునకు "ధేనుః–ధేనవే"వలె, 'వే' చతుర్థి

విభక్తి కాగా, ఇట ఈ సంప్రదానము గుప్తము. 'ఉతః' లో, పంచమ్యర్థమున 'తసిల్' ప్రత్యయము వచ్చుటచే, 5 అపాదానము గుప్తము. 6. ఓః=లక్ష్మి, యొక్క, సేవాం=పరిచర్యను, రచయామి=చేయుదును. ఇక్కడ 'సేవామోరచ యామి' లో 'సేవామః' పైకి క్రియగా కన్పడి, "ఓం" వంచింపబడుటచే, 6 షష్ఠీ సంబంధ గోపనము జరిగినది. హే మానస! ఓ చిత్తమా! సదా–భక్త్యా= ఎల్లప్పుడు–సేవాభావంతో, ఔ = లక్ష్మియందు, ఆదరం–ఆవహ = మన్ననను– వహింపుము లేక తాల్చుము. ఇక్కడ, "మానస సదా భక్త్యావహావాదరమ్ " లో " 'మానస!' అను సంబోధన ప్రథమావిభక్తి, మరియు, అధికరణ కారకము– గుప్తములై యున్నవి.

ఇట్లే ఒక్క శ్లోకమున 'ఉ' శబ్దముయొక్క ఆరు విభక్తులు, "శమ్" లో ద్వితీయా–కర్మకారకము, 'మానస!' లో సం. ప్ర. వి.(–సంబోధన–) మొత్తము 6+1+1 = 8–విభక్తులను కూడ గుప్తముచేసిన, వేంకటాధ్వరి పాండిత్య ప్రకర్ష నేమని కొనియాడగలము ?

షరా : శ్లోకార్థమునందలి 1, 2, 3 సంఖ్యలు కారకాదులకు, విభక్తులకు, సంజ్ఞలు. విస్తరభీతిచే వ్యాకరణ–సూత్ర–రూపసాధనలు వివరింపలేదని మనవి.

శ్లో॥ భాతిదృశి మమేయం, జగతిష్టే యా సమరిత్పస్వాయే।
జనతాయా ఆధత్తే, శ్రియ స్సుతాయా మనోను భవతి చ యా॥
(శ్రీకృష్ణ పరకాలస్వామి–అలంకార మణిహారంలోని–2–325శ్లోత్రం)

దీనిలో "ఈ" శబ్దముయొక్క ఏడు విభక్తులు గూఢములై యున్నందున, ఇది మరియొక సప్తవిభక్తి వంచిత చిత్రము. (విస్తరభీతిచే అర్థము వివరింపలేదని విజ్ఞప్తి.

ఇంకను పార్శ్వ జినాది గ్రంథాలలో అనేక గూఢ ప్రక్రియలుగలవు. వారి చిత్రాలంకారసేవ అనన్యసాధ్యము మచ్చునకొక ఉదా :

శ్లో॥ అనర్ఘ రో రుచిర పాతక కూటకాల
క్షిప్త స్త్వయాఽవనతదేవ న యానయాస్త్వమ్।
కిం పూర్యతే మమ చ తేన గుణోర్మిమాలి
రో్న వైరి త ప్రసతి యో భజతే హితాత్ త్వామ్॥

జీరాపురీశ పార్శ్వజిన స్తోత్రమునుండి ఉద్ధరింపబడిన, ఈ శ్లోకంలో

సప్తకారకాలు, సంబోధన, ఏకక్రియా, ద్వికర్మగూఢములు కూడ ఉన్నవి విస్తర భీతిచే, మిగిలిన గూఢచిత్రభేదాలు, అర్థాలు విడువబడినవని మనవి,

## సమాసగుప్తము

వివరణ ; సాధారణంగా సమాసగుప్తంలో వ్యుత్పత్త్యర్థాన్ని కూడ, తీసుకొంటే గాని, "గుప్తత" రాదు. అర్థం అన్వర్థంకాదు. కావున సమాసపదంలో ఉన్న ఒకే శబ్దం, రూఢి, వ్యుత్పత్తుల ననుసరించి, భిన్నార్థాలనీయవచ్చును. ఇస్తుంది కూడ. మరియు, ఈ గుప్తత శ్లేషమీదకూడ ఆధారపడి ఉంటుందన్న సంగతి మరువరానిది.

శ్లో॥ విషాదీ భైక్ష్య మశ్నాతి సదా రోగం న ముఞ్చతి
రుష్టే నాపి త్వయా వీర! శంభునాఽరిః సమః కృతః॥ (వి.ము.4-52)

అర్థము : (హే) వీర!, రుష్టేన+అపి=(శత్రువుపై) కోపము చెందినపుడు కూడ, త్వయా = నీచేత, అరిః=శత్రువు, శంభునా-సమః-కృతః = శంకరునితో-సమానమైన వాడుగా-చేయబడినాడు. శత్రువుపై నీవు కోపగించినను,, నీవు వానిని శివునివలె చూస్తున్నావు సుమా !

ఎందువలన? అనగా ఇక్కడ రెండు పక్షములు.

1. ఓడిపోయిన నీ శత్రువు 'విషాదీ'(విషాదం అస్య అస్తీతి-వ్యుత్పత్తిచే) =దుఃఖముతో గూడియున్నాడు. 1. ఈశ్వర పక్షమునగూడ 'విషాదీ'యే. ఎట్లన 'విషం అత్తీతి' వ్యుత్పత్తిలో, 'కాలకూట'మను విషమును త్రాగినవాడు "శివుడు". దేవదానవులు అమృతముకొరకై పాలసంద్రమును చిలికినపుడు, పుట్టిన 'కాలకూట' మను విషమును త్రాగి, శివుడు, విష-గరళ-కంఠుడైనట్లు పురాణగాథ. ఇక్కడ, మొదట 'సమాసగోపనం' చేయబడి, పిమ్మట ప్రకాశితము. 2. భైక్ష్యం-అశ్నాతి (ఓడిపోయిన నీ శత్రువు, తిండి దొరకక; బిచ్చమడుగుకొని తినుచున్నాడు. 2. ఈశ్వరుడు కూడ 'భవతి ! భిక్షాం దేహి' అని యాచించుట ప్రసిద్ధము...... ... భిక్ష నడుగుకొనుట-ఉభయపక్షములకును సమానము. 3. ఇక, నీ శత్రువు, సదా-రోగం-న-ముంచతి = ఎల్లప్పుడు-జబ్బును-విడిచిపెట్టడు. (భయముతో పారిపోయి, పుష్టిగా తిండి దొరుకక, నీరసపడి, రోగగ్రస్తుడైనాడు.) 3. ఇక శంకరుని పక్షమున-సదారః+అగం-న-ముంచతి = (దారైః సహితః=సదారః) భార్యయగు పార్వతితో గూడి, కైలాస పర్వతమును-విడువడు.

ఇక్కడ, ఒక కవి భోజమహారాజు నిట్లు శ్లేషతో వర్ణించెను.

1. విషాదీ, 2. సదారః అని రెండుచోట్ల, మొదటసమాసములో గుప్తముగా నుండి, పదవిభాగానంతరము విడదీయబడుటచే, ఇది 'సమాసగుప్త' జాతికి చెందిన గూఢ చిత్రాలంకారము. 1. విషాదీ=విషాదం అస్య అస్తీతి-అనెడి-ఉపపద-సమాసం యొక్క అభాస గోచరమాతుండగా, వస్తుతః 'విషంఅత్తి' అను అర్థంలో సమాసమైనది గనుక, ఇది సమాసగుప్తము.

శ్లో॥ ధనా యా వైభవం ప్రాప్య సఖే! కింబహు ఖిద్యసే।
మౌక్తికాని గృహే పద్మరాగాఢ్యా మావృతాని తే॥ (క. క.)

అర్థము : సఖే!-అవైభవం-ప్రాప్య=మిత్రమా!-అసమర్థతను పొందియు, ధనాయ-బహు-ఖిద్యసే — కిమ్? = డబ్బును సంపాదించుటకు-అధికముగా-ఏల-దుఃఖించుచున్నావు? నీ ఇంటిలో పద్మరాగమణులతో కూర్పబడిన ముత్యములెన్నో ఉన్నవికదా!

ఈ భావ మిక్కడ సరిపడుటలేదు. కావున "ధనాయావైభవం"ను, 'ధనాయ-అవైభవంగా'కాక, 'ధన+ఆయా-వైభవం'-గా విడదీసిన, ధనమునందలి-ఆశను-గొప్పగా పెంచుకొని, ఏల దుఃఖింతువు? అని చెప్పుకొనిన, అర్థము రమ్యమగును. ఆయా=ఆశ, ఈ వైచిత్ర్యమంతయు 'ధనాయావైభవమ్' అను సమాసమున గుప్తమై యున్నది. 'ఆశ నాయా(అశన + ఆయా)బుభుక్షుత్....' అని అమరం.

శ్లో॥ అహం చ త్వం చ రాజేన్ద్ర! లోకనాథా వుభా వపి।
బహువ్రీహి రహం రాజన్! షష్ఠీ తత్పురుషో భవాన్॥

మహరాజా! నీ వొక్కడవే లోకనాథుడవుగావు. నీతోపాటు నేనుకూడ లోకనాథుడనే. ఇక మనకిద్దరికి తేడా ఏమిటంటే-నేను బహువ్రీహిని. నీవు షష్ఠీ తత్పురుషవు. అనగా- ఈ 'లోకనాథ' శబ్దం 'బహువ్రీహి, తత్పురుష' అను రెండు రకాల సమాసములతోను సిద్ధిస్తుంది. 1. "లోకాః ఏవ నాథాః" = ఎవనికి లోకులే (ప్రజలే) ప్రభువులో-అను 'బహువ్రీహి' సమాస ప్రభావంతో, నేనొక లోకనాథుడను. అనగా నాకు ప్రజలే ప్రభువులన్నమాట. 2. లోకానాం నాథః = లోకనాథః=ప్రజలకు ప్రభువు-అనునది షష్ఠీతత్పురుషము. ఈ సమాసంతో నీవొక "లోకనాథుడ"వు.

ఇక్కడ బహువ్రీహి, తత్పురుష లను భిన్న సమాసాలు గుప్తంగా నుండి, చమత్కారజనకములైనవి.

# లిఙ్గగోపనమ్

శ్లో॥ నితాన్త స్వచ్ఛ హృదయం సఖి ప్రేయాన్ సమాగతః
త్వం చిరాద్దర్శన ప్రీత్యా యః సమాలింగ్య రంస్యతే॥ వి.ము.4-54

ఓ సఖీ ! మిక్కిలి నిర్మల హృదయముగల ప్రియతముడు వచ్చినాడు. ఆ ప్రియుడు ఎంతో కాలముగా నిన్ను చూడవలెనను ప్రేమతో వచ్చి నిన్ను గాఢాలింగనము చేసికొని క్రీడింపగలడు.

'నితాన్త స్వచ్ఛ హృదయం, అనునది, మొదట ఒకే సమాసమునందు ఉండుటచేత, మిక్కిలి నిర్మల హృదయముగల-లేక కల్గునట్లుగా, అని, న పుంసక లింగముగనో, క్రియా విశేషణము గనో, అర్థము తికమకగా చెప్పుకొనవలసి యున్నది.అట్లుగాక, ' నితాన్త స్వచ్ఛ-హృత్+అయం " అని భేదించిన, సర్వదా-నిర్మల హృదయముగల, ప్రేయాన్=ప్రియతముడగు, అయమ్ = ఈ ప్రియ నాయకుడు (వచ్చెను) అని, అర్థము చెప్పుకొనినచో, అంతకుముందు ఈ పదమున, గుప్తముగానున్న 'పుంలింగము' ఇప్పుడు వ్యక్తము కాగలదు. ఇట్టి పద విభాగముతో 'ని.... హృత్, అయమ్ ' అను గుప్తపదములు పుం లింగములై. బైటపడి, అర్థము సుగమ్యమై, పుంలింగ-ప్రేయాన్‌తో పొందిన కూడ కుదుర్చుకుండి.... కావున పుంలింగ-లింగ గోపనము.

శ్లో॥ కలికాల మియం యావ దగస్త్య స్య మునే రపి।
మానసం ఖండయ త్యత్ర శశిఖండాను కారిణీ॥ వి.ము.4-55

చంద్రవంకవలెనున్న ఈ కలియుగసమయము అగస్త్యుడను ప్రసిద్ధమహర్షి యొక్క మనస్సును కూడ చీల్చుచున్నది.

ఇక్కడ " ఇయమ్ " అనునది స్త్రీలింగమున, " కలికాలం " నపుంసకలింగ మందును ఉండుటచే, విశేషణ విశేష్యభావము సరిగా కుదరలేదు. కావున "కలికాల మియం"ను "కలికా+అలం-ఇయం"గా భేదించిన, అగస్త్యస్య = అగస్త్యము (అవిసె) అను పేరుగల చెట్టుయొక్క, శశిఖండానుకారిణియగు, ఇయం=ఈ, కలికా = మొగ్గ-అనగా-అవిసెమొగ్గ అలం = ఎక్కువగా, మునియొక్క మనస్సును కూడ ఆకర్షించి, ఖండించుచున్నది-అనుటచే సమన్వితమగుచున్నది. " ఇయం-కలికా' (ఈ-మొగ్గ) అను రెండు శబ్దములు స్త్రీలింగమున నుండుటచే, విశేషణ

విశేష్య భావముకూడ సమంజసముగ నుండును. కాబట్టి "కలికాలం" లో గుప్తంగా నున్న " కలికా " స్త్రీలింగ శబ్దంగా, ఇపుడు బహిర్గతమైనది. కాబట్టి స్త్రీలింగ గోపనము.

## సుబ్వచనగుప్తము

వివరణ : వాక్యరూపమున వ్యవహరింపడు ఏ నాగరిక భాషయందైనను నామ, సర్వనామ, విశేషణ, క్రియా.... ఆది భాషాభాగములన్నియు తప్పక ఉండ వలెను. సంస్కృతభాషయందలి పదాలను, పాణిని మహర్షి సుబంతములు,తిజంతము లని రెండుగా విభజించెను. "సుప్తిజన్తం పదమ్ " - " సు-ఔ-జస్___" ఇత్యాది 'సుప్' ప్రత్యయములు, అంతమందుగలవి "సుబంతములు". "తిప్-తస్-ఝి...." ఇత్యాది 'తిఙ్' ప్రత్యయములు, అంతమందుగలవి 'తిజన్తములు'.

శ్లో॥ ప్రమోదం జనయత్యేవ సదారా గృహమేదినః ।
యది ధర్మశ్చ కామశ్చ భవేతాం సంగతా విమౌ ॥ వి.ము.4-56

అర్థము : సదారాః-గృహమేధినః = దారల(భార్యల)తో గూడిన-గృహస్థులు లేక గృహస్థులను, ధర్మఃచ-కామఃచ-ఇమౌ-సంగతౌ-భవేతాం-యది = ధర్మ-కామములను-ఈ పురుషార్థములు రెండు-పరస్పర విరుద్ధములు కాకుండ,- కలిసి పోయినవి - అయినచో, ప్రమోదం - జనయతి+ఏవ = సంతోషమును - తప్పక కలిగిస్తాయిగదా !

ఇక్కడ "సదారాః-గృహమేధినః శబ్దాలకు అర్థముపొసగుటలేదు. తాత్కాలికముగ ప్రథమా లేక ద్వితీయా విభక్తి బహువచనముగా భ్రమపెట్టుచున్న ఈ 'గృహమేధినః' అనునది, వస్తుతః షష్ఠీ ఏకవచనము. అట్లే "సదారాః" ఏక పదముగాక, 'సదా-రాః' అను రెండు పదముల కలయిక. కావున గృహమేధినః-రాః=గృహస్థునియొక్క-ధనము, ధర్మ-కామవిరుద్ధము కానిదైనచో ___ తప్పక సంతోషమును కల్గించును అని అర్థము సమన్వితమగును.

ఇక్కడ 'గృహమేధినః' లో షష్ఠీవిభక్తి ఏకవచనము,"సదారాః"లో 'రాః' అను ప్రథమైకవచనము-అను సుబ్వచనములు, గుప్తినుండి బహిర్గతములైనందున, అర్థసమన్వయము సుగమమై 'సుబ్వచన' గుప్తమగుచున్నది.

శ్లో॥ విభ్రమ సంభవభూమిః స్పృహణీయా గుణగణై రగణనీయైః ।
మానిన్య స్తుంకారం ధినోతి మదనోత్సవే దధతీ॥ క. క.

అసంఖ్యాక-గుణములతో భ్రాంతిని కల్గించుచు, కోరదగిన కామినులు (మానిన్యః), మదనోత్సవే - తుంకారం - దధతీ - ధినోతి - వీనితో సమన్వయము కుదురుటలేదు. ఏలన—విభ్రమ.... భూమిః, దధతీ, ధినోతి-ఇవన్నీ ఏకవచనముల లోను, "మానిన్యః" బహువచనములోను ఉన్నట్లు పైకి కన్పడుచున్నవి. కావున "మానిన్యస్తుంకారం"ను "మానిన్యః+తుంకారం"గా విడదీయక, "మానినీ+అస్తుం కారం"గా, పద విభాగం చెప్పుకొనిన, 'భ్రాన్తిని గొల్పుచున్న అభిమానవతి (మానినీ) అస్తుంకారం = (మదనోత్సవమునందు) అనుమతిని, తెల్పుచున్నది' అనుట పొసగును. ('అస్తుంకారోఽభ్యుపగమః' అని అమరకోశము)

(మానినీ-మానిన్యౌ-మానిన్యః=అనునది మొదట ప్ర.వి.బ.హువచనముగా, భ్రమపెట్టి, పదచ్ఛేదంతో 'మానినీ' ప్ర. వి. ఏకవచనంగా మారినది. కావున ఏకవచన రూపమగు సుబ్వచన మిక్కడ గుప్తముగానున్నది.

## తిఙ్వచనగూఢము

శ్లో॥ కస్మాత్త్వం దుర్బలాసీతి, సఖ్య స్తాం పరిపృచ్ఛతి ।
త్వయి సన్నిహితే తాసు దద్యాత్ కథయ సోత్తరమ్॥ వి.ము 4-57

అర్థం : త్వం-కస్మాత్-దుర్బలా+అసి+ఇతి= నీవు-ఏల-బలహీనురాలవు. అయితివి.-అని, తామ్ = ఆ నాయికను, సన్నిహితే-త్వయి=సమీపమునందున్న-నీవు (సతిసప్తమి) పరిపృచ్ఛతి = మాటిమాటికి ప్రశ్నించినవాడవుకాగా, తాసు=ఆ చెలికత్తెలు ప్రక్కన ఉన్న సమయమున, సా=ఆ నాయిక,(కిమ్=ఏమని) ఉత్తరం-దద్యాత్ = (సిగ్గుతో) సమాధానమును ఎట్లు ఇవ్వగలదు? సఖ్యః=చెలికత్తెలు (కూడ, ఉన్నారని) కథయ=(సమాధానమును) చెప్పును.

ఇక్కడ అర్థ సమన్వయము కదురుటలేదు.కావున'సన్నిహితేతాసు'ను, 'సన్నిహిత+ఇత+అసు' గా విభజించిన, (హే)సన్నిహిత! = సమీపము నందున్న ఓ ప్రియా! అసు=ఈ చెలికత్తె లందరు ఎదుటనుండగా,కిం-ఉత్తరం-దద్యాత్=ఏమని-సమాధానం- చెప్పగలదు ? (అనగా,) (హే) సఖ్యః=ఓ చెలులారా! ఇత=(ఇక్కడి నుండి) వెళ్ళండి.-అని చెప్పును. కావున గుప్తముగానున్న "ఇత" అనునది 'ఇణ్= గతౌ (వెళ్లుట)' అను ధాతువు యొక్క లోట్-మధ్యమ పురుష-బహువచనము

(ఏహి- ఇతాత్, ఇతం-ఇత)గా, తిజ్ ప్రత్యయాంతర్గతముగా బహిర్గతమైనందున, 'తిజ్వచనగుప్తము" అయినది.

మరియు "సఖ్యః" బహువచనం కాగా, పరిపృచ్ఛతి ఏకవచనం. ఈ రెంటికి సమన్వయ మెట్లనికూడ ప్రశ్నింపవచ్చును. కాని, వస్తుతః 'పరిపృచ్ఛతి' అనునది- "పరి" అను ఉపసర్గ పూర్వక "ప్రచ్ఛ=జిప్సాయాం" (అడుగుట) అను ధాతువు యొక్క, లట్-ఏకవచనంకాదు. అందుచేత, అతిశయేన పృచ్ఛతి = పరిపృచ్ఛతి (= అధికముగా అడుగుచున్నారు) అను "యఙ్లుగన్త రూపము" అని కూడ గుర్తించవలెను. కావున ఇది తిజ్వచనముకూడ అగును.

వివరణ : సంస్కృతమున "యఙ్లుక్" అనునది అతిశయార్థమును దెల్పు ఒక ధాతు ప్రక్రియ. ఇది బహువచనంగా గాక, ఏకవచనంగా ప్రయుక్తమగు చుండును. కావున ఇక్కడ "క్రియాబహువచనం"-ఏకవచనంలో గోపితమైనది.

షరా : ఇక్కడ-కొందరు 'సఖ్యః పరిపృచ్ఛతి'= చెలికత్తెలు మాటిమాటికి లేక ఎక్కువగా అడుగుచున్నారు" అని, యఙ్లుక్కునందు, ప్రథమపురుష-బహు వచన మని చెప్పినారు. కాని, ఇట్లనుట వ్యాకరణ శాస్త్రవిరుద్ధముగా కన్పడుతుంది.

శ్లో॥ జనానాం సందార త్యజి పథి నిశీథేఽథ నఘనః
తమిస్రా వ్యామిశ్రే నదతి ముదిరే మేదురతమే।
ప్రియం స్వప్రాణానాం అభిసి షయిషీం నైన బిభయాం
బభూవు స్తా స్సఖ్యో హ్యాహహ సహ జాహర్యతి యతః॥ క.క.

జనసంచారములేని మార్గమున, చిమ్మచీకటి రాత్రియందు, మిక్కిలి దట్టమై-నల్లగానున్న మేఘము, ఆకాశమున వ్యాపించి గర్జించు చుండగా, ప్రాణప్రియుని గూర్చి సంకేత స్థలమునకు అభిసరింపబోవుచున్న (అభిసిసయిషీం) నాయికను. తోడుగనున్న సఖులు (సఖ్యః) ఎందుచేతనో గాని (యతః) భయపెట్టజాలకున్నారు, (న+ఏవ-బిభయాం బభూవుః) అహహా! అయ్యోపాపం! ఎంత విచారకరము !

ఇక్కడ "సహజాహర్యతి"ని "సహజాః+హర్యతి" అనిగాక, "సహ, జాహర్యతి"గా ఛేదింపవలెను. కావున "జాహర్యతి-(=వెళ్లుచున్నది) అనునది ఏక వచనముగా గాక, అది-అతిశయేన హర్యతి=జాహర్యతి" అను - యఙ్లుగన్త మని, బహువచన రూపార్థము నిచ్చునని కూడ గమనింపవలెను.... అట్టి భయంకర సమయమున అభిసరింపబోవుచున్న సఖిని చెలికత్తెలు భయపెట్టకపోగా, ఎందు

వలననో (యతః) సహ-జాహర్యతి= ఆమె ననుసరించి కుటిలముగా పోవుచున్నారు. ఎంత ఆశ్చర్యము ! అని అర్థము చెప్పుకొనినను సమంజసముగానే యుండును. కావున " జాహర్యతి " అను యఙ్లు గన్తమున, తిఙ్వచనము గుప్తమని ఎరుక.

## అభిప్రాయగూఢమ్

శ్లో॥ యది దేవరేణ భణితా ఖడ్గం గృహీత్వా రాజకులం వ్రజ।
తత్కిం సేవకవధ్వా హసిత్వా వలోకితం శయనమ్॥ స.కం. 2-370

భోజమహారాజుయొక్క ప్రాకృత శ్లోకానికి, ఇది సంస్కృతీకరణము. దేవరేణ=(సేవకుని) మరది (లేకబావ) చేత, ఖడ్గం-గృహీత్వా-రాజకులం-వ్రజ=కత్తిని-పట్టి-రాజగృహమునకు-పొమ్ము (అని) యది-భణితా=చెప్పినంత మాత్రమున, సేవకవధ్వా=సేవకుని భార్యచే, హసిత్వా=నవ్వి, తత్-శయనమ్=ఆ-పడకవైపు (కు) కిమ్-అవలోకితమ్=ఎందుకు-చూడబడినది.

దీనిలో, విపరీత రతి చిహ్నాలైన పారాణి మొదలగు వానిని కాళ్లపైజూచి, 'ఇతడు నన్ను పురుషాయితమునకు (పురుషునివలె పైకెక్కి సంభోగము నాచరించుటకై) ఆజ్ఞాపించుచున్నా'డని, పూర్వము ఇతడెప్పుడును పురుషాయిత సుఖమును అనుభవింపలే'దని, దాసి నవ్వుకొనుచు, పడకను, పట్టిమంచమును చూచినది'-అను అభిప్రాయము గూఢముగా నుండుటచే, ఇది 'అభిప్రాయగూఢ'మైనది.

మరియు, దేవరుడు 'ఖడ్గమును ధరించి, రాజకులమునకు పొమ్ము' అని చెప్పిన పిమ్మట, దీనివలన వధూద్వారా చేయబడిన పురుషాయిత రతికి సంబంధించిన, శయన స్థలం మీది, పాదలిక్ష........ఆదిచిహ్నాం యొక్క అభిప్రాయం, గుప్తంగా నుండుటవలనగూడ " అభిప్రాయగూఢ చిత్ర " మగుచున్నది. (ఖడ్గ గ్రహణము పురుష చిహ్నమైనందున, అది పురుషాయితమును సూచిస్తోంది.)

ఒక్కొక్కచో సాభిప్రాయ శబ్దప్రయోగము ఏదో ఒక విశేష భావమునో, లేక అభిప్రాయమునో బోధిస్తుంది. కొందరు ఆలంకారికులు, దీనిని "సూక్ష్మాలంకార' మగునని కూడ వివరించారు.

కాచి ద్వియోగానల తప్తగాత్రీ-ప్రాణాన్ సమాధారయితుం లిలేఖ ।
బాహ్వో ర్భుజంగం హృది రాహుబింబం-నాభౌ చ కర్పూరమయం మహేశమ్॥

విరహాగ్నితప్తయగు ఒక నాయిక—ఈ విరహబాధతో తన ప్రాణాలు పోకుండ రక్షించుకొనుటకై, తన భుజాలమీద సర్పమును, హృదయమున రాహువును, నాభి (బొడ్డు) పైద కర్పూరంతో శివుని చిత్రించుకొన్నదట.

ఎందుకు ? సర్పం వాయుభక్షకం. సర్ప చిహ్నాన్ని చిత్రించుకొనుటవలన తనలోవలనున్న ప్రాణవాయువు, భుజాలమీదనున్న సర్పముద్రను చూచి, ఆ పాము తనను భక్షించునను భయంతో బైటకిరాదు. హృదయం మీది రాహు చిహ్నాన్ని చూచి, తనను మ్రింగునను భయంతో, చంద్రుడు, ఆమె మనస్సును తనవైపునకు లాగుకొనుటకు ప్రయత్నింపడు. ('చంద్రమా మనసో జాతః' ఇత్యాతి సూక్తాలలో, మనస్సు చంద్రునికి సంబంధించిన అంశంగా చెప్పబడింది.) ఇక, బొడ్డుపై శివుని చిత్రణ వలన, ఆ శివుడు తనను దహింపజేయు— నను భయంతో, మన్మథుడు ఆమె శరీరంలో ప్రవేశింపజాలడు. ముందుగా ప్రవేశిస్తేనే గదా, ఆ తర్వాత, మనథుడు బాధించేది. అందుచే, వారెవ్వరు, తనలో ప్రవేశింప గూడదని, వారి శత్రు చిహ్నాలను చిత్రించి,- భయపెట్టి, ఆ నాయిక ఆత్మరక్షణ చేసుకొనుచున్నదను అభిప్రాయము దీనిలో గూఢము.

ఈ విషయంలో మన ఆంధ్ర మల్లినాథుడేమీ తక్కువ తిన్న వాడుకాడు. అతడొక మల్లనాథుడై, మన పాఠకులను మల్లచరచి, సాహిత్య రంగమున మల్ల యుద్ధానికి రమ్మని ఛాలెంజ్ చేస్తున్నట్లున్నాడు. సమాధానం చెప్పుటకు మనం సన్నద్ధులం కావాలి.

శ్లో॥ కాచి ద్బాలా రమణవసతిం ప్రేషయ స్తీ కరండం
సా తన్మూతే సభయ మలిఖత్ వ్యాల మస్యో పరిష్టాత్,
గౌరీనాథం పవనతనయం చంపకం చాస్య భావం
పృచ్ఛ త్యార్యాన్ ప్రతి, కథ మిదం? మల్లినాథః కవీన్ద్రః॥

ఒకానొక యువతి తన ప్రియుని ఇంటికి ఒక పెట్టెను పంపుచు, త్రోవలో ఇతరు లపహరింపకుండ, భయాన్ని కల్పించుటకై, దాని మొదటి భాగాన ఒక పామును, ఆ పెట్టె మీద శివుని, హనుమంతుని, చంపక పుష్పాన్ని చిత్రించి, పంపించినదట! దీని భావాన్ని భాషింపుడని, ప్రతి పండితునికి, మల్లచరచి, ప్రశ్నిస్తున్నాడు మన మల్లినాథ కవి చక్రవర్తి. ఇక ప్రత్యుత్తర మీయవలసిన పని,మన పండితులపై పడియున్నది

దీని భావమే మన- పాములు వాయుభక్షకాలు (గాలిమేపరులు)గా ప్రసిద్ధాలు. పెట్టె పైన సర్ప చిత్రాంకనం వలన తనను భక్షించునను భయంతో పెట్టె లోపల నున్న పుష్పగంధాన్ని రుచి చూచుటకు, గాలి ముందుకు రాదు. శివ ముద్రను చూచి, ఆ శివుడు తనను కాల్చివేస్తాడను భయంతో, మన్మథుడు దానిలోని పూలను- బాణాలుగా నుపయోగించుకొనుటకు రాడు. ఇక హనుమంతుని చిత్రం చూచి, తనను మ్రింగునను భయంతో, సూర్యుడు తన కిరణాలతో, లోపలి పూలను వాడునట్లు చేయడు. (ఉదయభానుని అరుణబింబాన్ని చూచి, పండని భ్రమించిన బాలాంజనేయుడు, సూర్యుని మ్రింగుటకు ప్రయత్నించెనని పురాణ గాథ) చంపక (సంపెంగ) చిత్రాన్ని చూచి, ఆ పుష్పరసమును పానం చేయుటకు తుమ్మెదలు ప్రయత్నింపవు. తుమ్మెదలు సంపెంగ సమీపానికి రావని, 'నానాసూన వితాన వాసనల' పద్యం, కవి సమయాన్ని కళ్ళెదుట పెడుతుంది. ఇన్ని తంటాలన్నీ తడవి, అంతర్లీనమైన ఈ గూఢ అభిప్రాయాన్ని సెలికిదీసి, పింగడిస్తే గాని, ఊరుకోడు మల్లినాథుడు,

## వస్తుగూఢము

శ్లో॥ పానీయం పాతు మిచ్ఛామి త్వత్తః కమలలోచనే!
యది దాస్యసి నేచ్ఛామి నో దాస్యసి పిబా మ్యహమ్॥ స. కం.

ఆరవ గూఢచిత్ర భేదంగా భోజమహారాజు స.కం.లో దీనిని ఉదాహరించెను.

పద్మాక్షీ! త్వత్తః- పానీయమ్- పాతుం- ఇచ్ఛామి, నీవు తెచ్చియిచ్చిన- మంచినీటిని- త్రాగ- గోరుచున్నాను. యది- దాస్యసి- న-ఇచ్ఛామి = (నీవు) ఇవ్వబోయినచో (నేను) త్రాగుటకు ఇష్టపడను. నో-దాస్యసి- అహం-పిబామి = ఇవ్వకున్నలో- నేను- త్రాగుదును.

"ఇస్తే త్రాగను. ఇవ్వకపోతే త్రాగుతాను" అనటం. పరస్పర విరుద్ధంగా తికమక పెడుతుంది. అందువలన 'దాస్యసి' పదం పనిపట్టాలి. మొదట, దానిని 'దాసీ+అసి'గా ఛేదించిన, నీవు దాసీ దానివి, (పని మనిషివి, అశుచిగా ఉంటావు) గనుక, నీవిస్తే నీరు త్రాగను. నో-దాసీ-అసి= దాసీ దానివి కాకపోయినచో, (శుచిగా నుందువు గనుక) నీ విచ్చిన నీటిని త్రాగెదను- అని చెప్పుకొన్నచో, అప్పుడు అర్థం రసరమ్యం అవుతుంది.

ఈ 'దాస్యసి' పదం. మొదట 'దా-దానే' (=ఇచ్చుట) అను ధాతువు యొక్క, భవిష్యత్కాల రూపమగు 'దాస్యసి' (= ఇవ్వగలవు.) అను క్రియవలె,

గూఢమై, భ్రాన్తిని గల్గించినది. ఆ క్రియారూపానికి "దాసీ+అసి=దాస్యసి" అను సంధి రూపం కూడ సమానంగా నుండుట వలన, విపరీతార్థమును భాసింపజేసింది. ఇట్లు, దానిలో 'దాసీ రూపవస్తువు' గూఢం కావడంతో, ఇది 'వస్తు గూఢం' అయినది. 'దాసీ+అసి=దాస్యసి' అని, సంధి చేయటం వలననే, ఈ విశేషార్థం స్ఫురించింది కనుక, ఇది 'సంధి కూటం' కూడ అవుతుందన్నారు కొందరు.

## భావ గుప్తము

శ్లో॥ మారనారాచ నిర్భిన్న - మానసా మత్తకాశినీ।
మన్దరం మృగశాబాక్షీ- ముహుర్నిన్దతి లుంఠతి॥ మం.మ.

మన్మథ బాణములచే చీల్చబడిన మనస్సు గల, మదముతో ప్రకాశించుచున్న, ఆ బాలహరిణేక్షణ (మృగ-శాబ-అక్షీ), మందర పర్వతమును మాటిమాటికి నిందిస్తూ, దొర్లుచున్నది (లుంఠతి). ఎందువలన?

చంద్రోదయము కామినులలో విరహ వ్యథను పెంచుతుంది. అందువలన ఆ చంద్రోదయం కాకుండా, మందర పర్వతం అడ్డుపడి, తనకు సహాయం చేయలేదని, ఆ మందరాద్రిని తిట్టుచు, ఆ చంద్రోదయంతో వియోగ బాధకు తట్టుకొనజాలక, దొరలుచున్నది— అనుభావం గుప్తంగా నుండుటవలన, ఇది 'భావగుప్తము'.

గమనిక : సుభాషిత భాండాగారాది గ్రంథాలలో, పైన చూపబడిన కొన్ని గూఢ-భేదాలు సంగ్రహింపబడినను, వానికి అతీతంగా ఇతర- మిశ్రభేదాలు, అన్లే, అక్కడక్కడ నవీన పద్ధతుల ననుసరించినవి కూడ, మరికొన్ని కన్పడుచున్నవి.

అందువలన ఈ క్రియా. కారకాదులలో ఒక్కొక్కటిగానే కాక, మిశ్రణతో అనేక గుప్తాలు కూడ గూఢంగా నున్నందున, వానిని కూడ పఠించి, పరిశీలించి, పాఠక మహాశయులు పటిష్ఠులగుదురు గాక.

## కర్తృ- కర్మ- గూఢ చిత్రమ్

శ్లో॥ మాన కోపహతే పుంసి- శాశ్వతీం స్థితి మాశ్రయేత్।
శంఖేభ్యో నాప్నుయాత్ కోఽపి-దేశః ప్రాప్నోతి కంకణైః॥ దే. కా.

అభిమాన- కోపములచే- కొట్టబడి, తీక్ష్ణముగానున్న — పురుషుని యందు, శాశ్వతముగా ఆశ్రయించి యుందును. (అట్లు శాశ్వత స్థితిలో నుండు కర్త ఎవరు?

ఏది?) శంఖముల నుండి- ఏ ఒక్కడు గాని-పొందడు (దేనిని పొందడు) దేశము-కంకణములతో- పొందుచున్నది (దేనిని పొందుచున్నది?)

ఈ శ్లోక ప్రథమార్ధమున ఒక కర్త, ఉత్తరార్ధమున రెండు కర్మలు గుప్తములై ఉన్నవి. వానిని కనుగొనుటకు-, 'మానకోపహతే' అను దానిని 'మా-న-కోపహతే....'గా విడదీసిన, మా=లక్ష్మి, కోపహతే- పుంసి- న= కోపం గల-పురుషుని యందు- నిల్చియుండదు, అను అర్థం సంగతమగును. అందువలన మానకోపహతే 'సమాసంలో గుప్తంగా పడియున్న, 'మా' =లక్ష్మి పదం విడదీయబడి, 'కర్త' లేకకర్త్రి'గా బహిర్గతమైనవి. 2. అట్లే, 'శంఖేభ్యః'ను, 'శం-ఖేభ్యః'గా విడదీసిన, ఖేభ్యః=చంచలములగు ఇంద్రియముల వలన, శం= సుఖమును. న-ఆప్నుయాత్ = పొందజాలడు. దీనిలో 'శమ్' అను కర్మ బహిర్గతమైనది, 3. 'కంకణైః'ని, 'కం-కణైః'గా విభజించిన, దేశము, కణైః= గింజలు లేక నూకలు మొదలగు వానిచేత, కం=సౌఖ్యమును- పొందుచున్నది. దీని నుండి 'కమ్' అను మరొక కర్మ బహిర్గతము కాగా, మొత్తం మీద గుప్తంగా నున్న ఒక కర్త, రెండు కర్మలు కూడ బహిర్గతములైనవి.

శ్లో॥ నారీ నాశోదయ ద్ధూలిపాళీ పిహిత పూషణి।
ఖాన్తరే ఖండయామాస ఖడ్గే నైకేన ఖండశః॥ మం. మ.

ఇక్కడ 'నారీనాశ....'చే, మనం తొందరపడి స్త్రీల వినాశమును గోరక, క్రింది విధంగా అన్వయించుకొనవలెను. నా + అరీన్-ఆశా - ఉదయత్... ఇత్యాదిగా పదవిభాగం చెప్పుకోవాలి.... ఆశా + ఉదయత్.... పూషణి= దిక్కు లందు-పుట్టిన-ఎక్కువ దుమ్ముచే- సూర్యుడు (కూడ) కప్పబడిన, ఖాన్తరే= అకాశ మధ్యమున, ఏకేన-ఖడ్గేన= ఒకే- కత్తిదెబ్బతో, ఖండశః = ముక్కలు ముక్కలుగా (నారీన్ = స్త్రీలను కాదు-శాన్తం పాపమ్!) (నా + అరీన్) నా=మనుష్యుడు లేక నరుడు, అరీన్= శత్రువులను, ఖండయామాస= ముక్కలుగా నరికెను.

ఇక్కడ 'నారీ నాశోదయ....'లో 'నా+అరీన్....' ఇత్యాదిగా విడదీయుట వలన, ఆ సంధిలో గుప్తముగానున్న, 'నా' అను కర్త, 'అరీన్' అను, కర్మ బహిర్గతములైనవి.

## సంబోధన- కర్త్రు- కరణ- గోపనము

శ్లో॥ వేత్రాగ్రే కోపరం నాస్తి నాస్తి బాణధరో యువా।
ఇత్యుక్త్వా కురుషాం త్యక్త్వా విర్పి వా సహ నిర్యయౌ॥ చా.చ.

దీని పదవిభాగం:- వే, అత్ర, అగ్రే, కోటరం, న, అస్తి, నా, అస్తి, బాణ ధరః, యువా, ఇతి ఉక్త్వా, కుదుహం, త్యక్త్వా, విః, వినా, నహ. నిర్యయౌ.

(హే) వే=ఓ పక్షీ! (విః=పక్షి, తత్సంబోధన=వే!) అత్ర- కోటరం- న- అస్తి=ఈ చెట్టుమీద- గూడు-లేదు, కాని, అగ్రే-బాణధరః- యువా-నా-అస్తి= ఎదుట-బాణము నెక్కుపెట్టియున్న- యువకుడగు- పురుషుడు- ఉన్నాడు సుమా! ఇతి+ఉక్త్వా=అని చెప్పి, విః- వినా నహ- కుదుహం- త్యక్త్వా- నిర్యయౌ=ఒక పక్షి (కర్త)— మరియొక పిట్టతోగూడి (కరణం)- చెట్టును- విడిచిపెట్టి- ఎగిరి పోయినది.

ఇక్కడ 'వేత్రాగ్రే'లో గుప్తంగా నున్న 'వే' అను సంబోధనము, 'నా-విః' అను కర్తృ- పదాలు రెండు, 'వినా'లో 'కరణ' కారకము, గుప్తి నుండి బహిర్గతములైనవి.

## క్రియా కర్తృ గుప్తము

శ్లో॥ దశకంఠే వినిహతే హరీణాం రక్షసా మపి।
ప్రహర్షేణ స్తుతోరాజా వృషభం రఘుభూభుజామ్॥ చ. చి.

దశకంఠే- వినిహతే= రావణుడు- చంపబడగా, హరీణాం-రక్షసాం- అపి- రాజౌ= క్రమంగా కోతులకు- రాక్షసులకు- కూడ- రాజులైన సుగ్రీవ విభీషణులు, రఘుభూభుజాం- ఋషభం= రఘురాజులలో-శ్రేష్ఠుడైన శ్రీరాముని, ప్రహర్షేణ= మిక్కిలి సంతోషముతో, స్తుతః= స్తోత్రము చేసిరి.

ఇక్కడ, 'రాజౌ+ఋషభం' లకు, సంధిలో ఆవా దేశము రాగా, 'రాజా వృషభం' అయినది. అందువలన 'రాజౌ' అను కర్తృపదం గుప్తం. ఈ 'రాజౌ' రూపము, 'రాట్ రాజౌ రాజః' వలె, రాట్ శబ్దం యొక్క ద్వివచనమే గాని రాజన్ శబ్దరూపం కాదని, అట్లే, 'స్తుతః' అనునది, పైకి శబ్దంగా కన్పడినను, 'ష్టుఞ్-స్తుతౌ' =స్తోత్రం చేయుట అను ధాతువు యొక్క 'లట్' ప్ర. పు. ద్వివచనం స్తౌతి స్తుతః స్తువన్తిగా గమనింపవలెను. అందువలన 'స్తుతః' అను క్రియాపదం కూడ ఇక్కడ గుప్తము.

శ్లో॥ నాగరంగం ఫలం స్వాదు ఛిత్వా ఛిత్వా వనే వనే।
పీస్వాతః కథితో హ్యర్థం పఠ్యతే న తు బుధ్యతే॥

వనేవనే- స్వాదు- నాగరంగం- ఫలం= ప్రతి అడవి యందును- తీయని-

నారింజ- పండును, ఛిత్వా- ఛిత్వా=కొరికి- కొరికి, వీప్సాతః=అనేక మారులు, అర్థః- కథితః- హి=అర్థము-చెప్పబడినది-కాదా!, (అయినను) పఠ్యతే= చదువబడుచున్నది. (కాని) న-తు-బుధ్యతే= తెలిసికొనుట మాత్రం- జరుగుట లేదు. (ఇక, మనం వానిని తెలుసుకొనలేక పోతే ఎలా?)

ఎట్లనగా- ఇక్కడ, 'వీప్సాతః'లో 'వీ-ప్సాతః' అను కర్త-కర్మ లు రెండును గుప్తములై యున్నవి. 'విః వీ వయః'లోని 'వీ' ప్రథమా- ద్వివచనానికి 'రెండు పక్షులు' అని అర్థం. అందువలన 'వీ' కర్తృగుప్తము. అట్లే, 'ప్సాతః' అనునది 'ప్సా-భక్షణే' (= to eat ) ధాతువు (క్రియ) యొక్క, లట్- ప్ర. పు. ద్వివచనం. అందువలన క్రియాగుప్తం. ఇవి రెండు 'వీప్సాతః'లో గూఢంగా కలిసిపోయి, మనలను మైకంలో ముంచినవి. కాబట్టి ఇట్టి, చిత్రాలంకార గ్రంథాలను చదివితే, మెదడుకు ఎంతో మేత, చాతుర్యం, చమత్కారం, పాండిత్యం లభిస్తుందని మరువరాదు.

## కర్తృ-కర్మ- క్రియా-గుప్తము

1. శ్లో॥ వీర మత్యద్భుతం లోకే కిమహం వచ్మ్యతః పరమ్।
కర్తృ కర్మ క్రియా గుప్తం మర్యాదా బ్రహ్మణో వయః॥ చా.చ.

2. శ్లో॥ భవాని శంకరో మేశం ప్రతి పూజాపరాయణః।
కర్తృ కర్మ క్రియాగుప్తం యో జానాతి స పండితః॥

పై రెండు శ్లోకాలలో, కర్త-కర్మ-క్రియలు మూడూ గూఢంగా వున్నవి. వానిని వెదకి, వివరించుటకు; పాఠకులకు బ్రహ్మయుస్సు (వేలకొలది సంవత్సరాలు) అవధిగా అవకాశం ఈయబడింది. లేక, వానిని తెలిసికొని, చెప్పినవాడే పండితుడౌతాడు

1. లోకంలో దీనిని మించిన, వీరము (పరాక్రమము), అత్యాశ్చర్యకర-విషయమును గురించి, ఏమి చెప్పగలను? ఏమీ చెప్పలేనని భావం

ఆ అత్యాశ్చర్యకర విషయాన్ని మనం తెలుసుకోవాలి. అది 'వీరమత్తి' అను నాలుగక్షరాలలో ఉన్నది. ఎట్లన- దానిని 'విః-రం-అత్తి' అని విడదీసిన, విః=పక్షి (గుప్తమైన కర్త), రమ్=అగ్నిని (గుప్తకర్మ), అత్తి=తినుచున్నది (గుప్తక్రియ) అనగా ఈ నాలుగు అక్షరాలలో కర్త, కర్మ, క్రియలు మూడూ దాగి

ఉండటం కంటె, అత్యద్భుతమైన విషయం ఏమి ఉంటుంది? 'భూచకోరము' అను పక్షి, నిప్పును మింగుతుంది- అని లోకంలో వాడుక ఉన్నది.

2. భవానిశంకరో మేశుని పూజించుటలో ఆసక్తిని పెంచుకొనుము. ఎట్లు? ఈ 'భవానిశంకర' పదం, చిన్తామణి నాటకంలోని 'భవాని శంకరు'ని గుర్తుకు తెచ్చి, మతిని భ్రమింపజేస్తోంది. అందువలన 'భవాని శంకరో మేశం'ను ఛేదిస్తే గాని అసలైన అర్థం బైటికిరాదు. అందువలన 'భవ-అనిశం-కర- ఉమేశం'గా విడదీసిన, 'కర' (=హస్తమా!) అను గూఢకర్త, ఉమేశం (=ఉమా-పతియైన శివుని) - అనుగూఢ కర్మ, భవ (=కమ్ము) అను గుప్త క్రియ, ఈ మూడును ఒక్కసారిగా బహిర్గతములగుచున్నవి. ఇలా చీల్చి, చెండాడి రహస్య భేదనం చేయుట కంటె అత్యాశ్చర్య కార్యమేముంటుంది? కాబట్టి పై రెండు శ్లోకాలలో పద విభాగ ప్రక్రియా మాహాత్మ్యంలో, గూఢములైన కర్త, కర్మ, క్రియలు కను గొని వివరింపబడినవన్నమాట. 'కర' అనునది పైకి 'సంబోధన'గా కన్పడు చున్నను, (సంబోధన) 'ప్రథమావిభక్తి'లోనే చేరి, 'కర్త'గా పరిగణింపబడుతుంది.

## కర్మ - క్రియా-గోపనమ్

శ్లో॥ ప్రలాపినం మారసేనా భయప్రద యమాకులమ్।
ఆగత్య త్వరితం తీవ్ర ప్రభావోచిత విగ్రహ॥ అ. ఈ. 16

దీనికి అన్వయమిట్లు చెప్పుకొనిన, అర్థము సంగతమగును.

(హే) 'తీవ్రప్రభ', ఉచిత విగ్రహ 'అభయప్రద' (ఈమూడును సంబోధనలు) యమ+ఆకులం=యమునిచే పీడింపబడిన, ప్రలాపినం= వదరుబోతునైన మా=నన్ను, రసేన- త్వరితం- ఆగత్య=ఆదరముతో- త్వరగా-వచ్చి, అవ= రక్షింపుము.

శ్లోకంలోని 'మారసేనా....'ను, 'తీవ్ర ప్రభావోచిత....'లను మా=రసేన- అనియు, తీవ్రప్రభ!+అవ-అనియు విడదీసిన, 'మా' అను కర్మయు, 'అవ'-అను క్రియయు బహిర్గతములగుచున్నవి. 'మా' అనునది 'మాం, మా ఆవామ్, నౌ, అస్మాన్, నః' అను అస్మచ్ఛబ్ద - ద్వి. వి. ఏ. వచనరూపము. 'అవ' అనునది 'అవ=రక్షణే' ధాతువు యొక్క, లోట్-మ. పు. ఏ. వచనరూపము.

శ్లో॥ యువరంగ మహీపాల తనోద్యాన మయూరికా।
కాన్తం వినా నదీతీరమ్మద మా లోక్య సోత్సుకా॥ చా. చ.

(హే) యువరంగ మహీపాల! తవ+ఉద్యాన మయూరికా = నీయొక్క-తోటలో నున్న ఆడు నెమలి, కాంతం-వినా=ప్రియుడగు మగ నెమలి- లేనందున (విరహంతో) నదీతీరం=నది యొడ్డును, మదం- ఆలోక్య=మత్తు (ఉత్కంఠ)తో-చూచి, నదతి=అరచుచున్నది అర్థం సరిపోవుటలేదు.

అందువలన 'కాం తం వినా నదీ తీరమ్మద మా లోక్య'ను, 'కాంతం-వినా నదీతి+ ఇరమ్మదం - ఆలోక్య'గా విభజించిన, ఇరమ్మదం- ఆలోక్య = మేఘ జ్యోతిని- చూచి (మత్తెక్కినదై) కాన్తం = ప్రియుడగు మగ నెమలిని (రమ్మని) వినానదీతి= మాటిమాటికి 'కేక' పెట్టుచున్నది.

గుప్తములుగా నున్న 'కాంతం' అను 'కర్మ'యు, 'వినానదీతి' అను క్రియము వెలికి వచ్చినవి. 'మేఘ జ్యోతి రిరమ్మదః' అని అమరకోశము.

## కర్తృ- కర్మ క్రియా అధికరణ గోపనము

శ్లో॥ రోగవీ మదహ ద్యస్య భార్యాకలిత మౌళి రుః।
అప్రియః కాననచ్ఛేత్తా దద్యా చ్ఛం వో గజాననః॥ చా. చ.

అర్థం అగమ్యగోచరంగా సున్నది, కనుక "రః, గవి, ఇమ్, అదహత్, యస్య, భార్యాకలితమౌళిః, ఉః, అప్రియః, కాననచ్ఛేత్తా, దద్యాత్, శమ్, వః, అగజాధిపః అను పదచ్ఛేదంతో, క్రింది విధముగ చెప్పుకొనిన, అర్థం కుదురుతుంది.

యస్య=ఏ దేవుని యొక్క, గవి=నేత్రము నందున్న (అధికరణము)రః= అగ్ని (కర్త), ఇమ్=మన్మథుని (కర్మ), అదహత్=కాల్చి, బూడిదగా చేసెనో (క్రియ), భా+ఆర్య+ఆకలిత- మౌళిః = నక్షత్రములకు-పూజ్యుడగు చంద్రునిచే వ్యాప్తము లేక సంగతమైన- శిరస్సు గలిగినట్టియు, అ-ప్రియః=విష్ణువు (అః)నకు ఇష్టుడైనట్టియు, క+ఆనన+ఛేత్తా=బ్రహ్మ యొక్క-ఒక తలను-ఛేదించి (నరికి) నట్టియు, అగజా+అధిపః పార్వతీ-పతి (శివుడు) వః=మీకు (మాకును), శమ్= సుఖమును, దత్యాత్=ఇచ్చును గాక!

## కర్తృ- కర్మ- అపాదాన- అధికరణ- క్రియా- గోపనమ్

శ్లో॥ యది యా మాదిరాసన్నో భవం కి మబలాబలమ్।
ప్రచ్ఛన్న కర్త్రి పాదాన కర్మాధికరణ క్రియా॥ చా. చ.

తల పగులగొట్టుకొని ఎన్నిసార్లు చదివినా, ఎంత ప్రయత్నించినా, అర్థం కావటంలేదు. ప్రథమార్ధంలోనే- ఒకటి, రెండు గాదు, అయిదు గుప్తాలు దాగి యున్నవట! పరిశీలించండి. పదచ్ఛేదంః యది, యాం, ఆత్, ఇః, ఆపత్, నో, భవమ్, కిమ్, అబలాబలమ్.

అర్థము: ఇః = మన్మథుడు, ఆత్ = విష్ణువు (అః=విష్ణువు)నుండి, యామ్ = ఈః(=లక్ష్మి) శబ్ద సప్తమి విభక్తి లక్ష్మి యందు, భవం=పుట్టుకను, నో- ఆపత్-యది=పొందకపోయినచో, అబలా-బలమ్= స్త్రీల యొక్క-బలము, కిమ్=ఉండి ఏమి ప్రయోజనము? అని భావము. లేక బలహీనురాండ్రగు అబలలగు స్త్రీలకు బలమేమి యున్నది! అని ప్రశ్న? లేదని భావము.

మన్మథుడు అబలా జన బలముతో గాక, లక్ష్మి నారాయణుల కుమారు డగుట వలననే బలవంతు డయ్యెనని భావము.

ఈ శ్లోకంలో ఇః కర్త,భవమ్-కర్మ, ఆత్-అపాదానము (పంచమీ)యామ్-అధికరణము (సప్తమి) 'ఆపత్' అను క్రియ, ఈ అయిదును పూర్వార్థమున గుప్తములు. ఈ శ్లోకము నడిమింటి మంగళేశ్వరశాస్త్రిగారిదని ప్రతీతి

## ఆధార- సంబంధ- కర్తృ గూఢము

శ్లో॥ కావేరీ- రమ్య- రాజీవ- విలస- ద్గంధ-బంధునా।
మధుమాప- సమీరేణ వర్ధతే కుత్ర? కస్య? కా? కా?॥ దే. క.

కావేరీ .... బంధునా = కావేరీ నది యందలి- సుందర- పద్మములయందు-ప్రకాశించుచున్న- పరిమళముతో- సమానమైన, మధుమాస- సమీరేణ వసంత కాలిక- మందమారుతము (పిల్లగాలి) చేత, కుత్ర=ఎక్కడ? కస్య=ఎవనియొక్క? కా=ఏది? వర్ధతే=వృద్ధిని పొందుచున్నది?

ఇందలి ప్రశ్నలకు ఉత్తరములను బట్టి, ఆధార - సంబంధ- కర్తృ గుప్తములు మాటుపెట్టబడినవి. వీనిని బహిరంగపరచుటకు సంధించిన 'కావేరీ' పదమును 'కౌ+వేః+ఈః (=కావేరీ)గా, చించి, చెండాడవలెను. అప్పుడు, వాసన్త వాయువుచేత, కౌ=భూమి యందు (ఆధారము-సప్తమీ), వేః = మన్మథుని యొక్క-(సంబంధము-షష్ఠీ), ఈః=శోభ (కర్త=ప్రథమా) వృద్ధిని పొందుచున్నదను భావము భవ్య మగును. 1. కుః=భూమి,దీని సప్తమీ విభక్తి 'కౌ' (ఈ ఆధారము గుప్తము)

2. ఇః=మన్మథుడు, దాని షష్ఠీ విభక్తి 'ఏః' (ఇక్కడ సంబంధము గుప్తము)
3. 'ఈః' అనగా శోభ. ప్రథమా విభక్తి- కర్త గుప్తము. అందువలన ఈ 'కావేరీ' పదంలో ఆధార, సంబంధ, కర్త-లు మూడును గుప్తములు.

## పదగూఢమ్

శ్లో॥ నాలం కృత కులం క్రూరం విహరన్తం సరస్తటే।
దుద్రావ దూరతో దృష్ట్వా చక్రీ భీతియుతో జవాత్॥ మం. మ.

చక్రీ= (చక్రమువలె చుట్టుకొని యున్న) పాము, సరస్తటే- విహరన్తం క్రూరం= సరస్తీరమున- విహరించుచున్న- క్రూరమగు, న+అలంకృత-కులం= 'న' కారముతో కూడిన- కులమును- అనగా 'న+కులం=నకులం' (=ముంగిస)ను దృష్ట్వా=చూచి, భీతియుతః-జవాత్- దుద్రావ= భయపడి- వేగముగా- దూరమునకు- పారిపోయెను.

ఇక్కడ 'నాలంకృత కులం'లో 'నకుల' పదము గుప్తమైయున్నది.

గమనిక : గ్రంథాదిలో నున్న 'పదాది గూఢము'ల కంటె, వీనిలో గల ప్రత్యేకత పరిశీలింపదగినది.

శ్లో॥ యా మధ్యమం చ సుకృతం లేభే త్వత్తః పురా నృప।
అద్య ధత్తే స్మరార్తా సా నవం కవచ మాకులా॥ మం మ.

రాజా! పూర్వము నీ వలన 'అమధ్యమ'మైన 'సుకృతం'ను పొందిన వనిత, నేడు, మదన పీడితయై 'నవ' మగు 'కవచము'ను ధరించుచున్నది. ఎట్లు? ఈ అర్థము పొసగుట లేదు.

కనుక, ఇట్లు విడగొడించుకొనవలెను. 'అమధ్యమం- సుకృతం' అనగా, 'సుకృతం'లోని మధ్యాక్షరమగు 'కృ'ను తీసివేసిన, సు(కృ)తం= 'సుతం' మిగులును. అట్లే, 'కవచం' నుండి 'న-వం'ను అనగా 'వ' కారమును లేకుండా, లుప్తం చేసిన, క (వ)చం=కచం, మిగులుతుంది. కనుక, రాజా! నీ వలన సుతుని పొందిన ఆ నాయిక, నేడు, నీ విరహమును సహింపక, చెదిరిన 'కచము'ను (వెంట్రుకలను) విరబోసుకొని, విరహ వ్యథ ననుభవించుచున్నది. అందువలన 'సుత-కచ' పదాలు 'సుకృత-కవచ' శబ్దాలలో గుప్తములని గమనింపగలము.

## పదార్థోభయ గూఢము

శ్లో॥ న నిషిద్ధోఽ ప్యగరాజః కుచోపమాయాం పున శ్చ గతివాణ్యోః।
యోగ్యోఽభూ దుపమాయాం సర్వం ధాత్రోపయుక్త మిహ స్పష్టమ్॥

నిషేధ వాచక 'న' కారముతో గూడిన దైనను, 'అగరాజ' పదము అనగా 'న+అగరాజః= నాగరాజః' (=ఏనుగు) అను పదము, కుచము (చన్ను) లతో పోల్చుటకు నిషేధింపబడినది. కాని, మరల దీనిలోని 'న' (న్) ను నిషేధింపగా, మిగిలిన 'అగరాజః' (=పర్వత శ్రేష్ఠము) స్తనములతో పోల్చుటకు యోగ్యమైన దయ్యెను. అందువలన 'పర్వత స్తని' ఇత్యాది ప్రయోగాలు రూఢములైనవి. అట్లే, మరల 'న' కారముతో గూడినదై (న+అగరాజః= నాగరాజః=ఏనుగు) 'నాగరాజ' ను పదము, గమన వర్ణనలో ఉపమించుటకు సరిపోయినది. అందువలన 'గజ గమన- మత్తేభయాన....' ఇత్యాది ప్రయోగాలు గ్రాహ్యములైనవి. ఇలాంటి తికమకలతో గూడిన శబ్ద-చమత్కారమంతా, విధి విలాసం కాకపోతే మరేమంటారు!

ఇందులో 'నాగరాజ & అగరాజ' అను రెండు పదాలు, వాని అర్థాలు కూడ గుప్తము లగుటచే, వీనిలో 'పదములు, పదార్థములు' అను రెండింటి యొక్క గోప నము కూడ జరిగిన దనుట స్పష్టము.

## పాదగూఢము

2 1 4 3 6 5 7 8

శ్లో॥ ద్యు వి య ద్గా మి నీ తా ర సం రావ నిహత శ్రు తిః।
హైమీషు మాలా శుశుభే (విద్యుతా మివ సంహతిః)॥ భా.కి, 15-43

శ్లోక పూర్వార్ధంలో అక్రమంగా (వరుసలో నుండక) గూఢంగానున్న 1, 2, 3....మొ. అంకెల క్రింద నున్న అక్షరాలన్నింటిని వరుసగా కలిపిన "విద్యుతా మివ సంహతిః" అను గూఢమయిన చతుర్థ (4వ) పాదము వస్తోంది కనుక ఇది (చతుర్థ) పాదగూఢము.

గమనిక : ఈ పాదగూఢము అనేకవిధాలుగా వివరింపబడినది అంకెలు వరుసలో లేకున్నను, బేసి అంకెలలోను, సరి అంకెలలోను ఉన్న, ప్రతి 3వ అక్షరాన్ని కలిపియు, ... ... ఇత్యాదిగా ఎన్నో భేదాలు కన్పడుచున్నవి. ఈ గుప్త పాదము నాల్గవదే కావలెనను సిద్ధాన్తము కూడ లేదు. శ్లోకమున ఒకే పాదముగాక, రెండు పాదములు, స్వేష్ట(=తనకిష్టమయిన) పాదములు కూడ, కావచ్చును.ఇంకా, ఇతర విశేషములను లక్ష్మీసహస్ర, అలంకారమణిహార, స్తుతి విద్యా.... ఆది గ్రంథాలలో గాంచగలరు.

తుభ్యం జగత్త్రియ త్రాణ ససంపజ్జయతే నమః।
శివ సంయత్స్వభాశీల జయ సజ్జన వత్సల ॥ అ.ఈ. 9

దీనిలో అక్షర క్రమమేగాక, నియమము కూడ పాటింపబడినది. కాబట్టి వరుసగా— ఈ శ్లోకంలోని ప్రతి 3వ అక్షరమును కలిపి చదివిన, గూఢమగు చతుర్థపాదము బహిర్గతమగుచున్నది.

## తృతీయ–చతుర్థ పాదగూఢమ్

సుధీసారజ్ఞతాభవ్య జయ మాసామగక్షమ ।
సుసాజ్ఞ భజ మా మక్ష ధీరతావ్యయసాగమ॥ అ.ఈ. 91

ఈ పద్యంలోని మొదటి రెండు పాదాలలో, చివరి రెండు అనగా 3, 4 పాదాక్షరాలు దాచబడియున్నవి. ఎట్లన–మొదటి 1, 2 పాదాలలోని బేసి అక్షరాలను కలిపి వ్రాసిన, 3వ పాదమున్నూ, సరి అక్షరాలను గ్రహించి వ్రాసిన, 4వ పాద మున్నూ ఏర్పడుచున్నవి గదా!

## ప్రశ్నోత్తరశ్లోక - గూఢోత్తరము

ఒకచో ప్రశ్నోత్తరశ్లోకమున ఉత్తరము గూఢమై యుండవచ్చును.

శ్లో॥ కేన క్రౌంచో విభిన్నః? క మవనతగతాః? కే దినేశస్య తీక్ష్ణాః?
అన్తస్థాద్యక్షరం కిం ? ద్విజకుల మధికాం వక్తి కాం జాతి మగ్ర్యామ్?
భృత్యానాం కుత్ర భక్తిః? కి ముచితం? అజనయన్ క్ష్మాం నరేంద్రాః కిమర్థం?
కస్మై భక్తా అజస్రం విదధతి నమః "స్వామినే శంకరాయ"॥
అ. ఈ. 100

1. ఎవనిచే క్రౌంచ పర్వతము చీల్చబడినది? (ప్రత్యుత్తరమగు 'స్వామినే శంకరాయ'ను "స్వామినా – ఈశం–కరాః–య"గా విడదీసి మొదటి 4 ప్రశ్నలకు అన్వయించుకొనవలెను.) ఉత్తరం— స్వామినా = కుమారస్వామి చేత. (మహిషాసురాది రాక్షసులు దేవతలను బాధించి, క్రౌంచపర్వతమున దాగి యుండ, కుమారస్వామి ఆ పర్వతమును ఛేదించి, ఆ రాక్షసులను చంపెనని— వాయుపురాణగాథ కాబట్టి ....కుమారః క్రౌంచదారణః" అని అమరము)

2. జనులు ఎవనికి తలవంచి పోవుదురు? ఈశం = శివుని (గూర్చి)కి, 3. సూర్యుని – వాడియైనవి ఏవి? కరాః = కిరణములు, 4. అన్తస్థలలో ఆద్యక్షరమేది? 'య' (= యకారము. 'య–వ–ర–ల–వ'లు అన్తస్థము'లని వ్యాకరణ శాస్త్రము. అందువలన వీనిలో మొదటి అక్షరం "య." 5. బ్రాహ్మణవర్గము ఏ జాతిని శ్రేష్ఠమని, అగ్రగణ్యమని చెప్పుచున్నది? (ఇప్పుడు స్వామినే శంక–

రాయ'ను మరల "స్వాం- ఇనే-శం-కరాయ"గా విభజించుకొని 5-8 ప్రశ్నలకు, ప్రత్యుత్తరింపవలెను) ఉ. స్వాం=తమ 'బ్రాహ్మణ కులము,ను శ్రేష్ఠము, ముందు లెక్కింపదగినదవి బ్రాహ్మణవర్గము చెప్పుచున్నది. 6. సేవకులకు భక్తి ఎవరిపై నుండును? ఇనే= ప్రభువుపై, 7. ఉచితమైనది ఏది? శమ్=శుభము, కల్యాణము, 8. రాజులు భూమిని ఎందుకు జయింతురు? కరాయ = (ప్రజల నుండి) పన్ను వసూలు చేయుటకు, 9. భక్తు లెల్లప్పుడు ఎవనికి (కొరకు) నమస్కరింతురు? స్వామినే- శంకరాయ= ప్రభువగు- ఈశ్వరునికి. (9 వ ప్రశ్నకు 'స్వా....య' మొత్తంగా సమాధానమగుచున్నది.)

ఈ శ్లోకంలో 'స్వామినే శంకరాయ' అను ఉత్తరం 'గూఢం'గా నుండి, రెండుసార్లు భిన్న పదవిభాగంతోను, మరల సమస్తంగాను ప్రత్యుత్తరమైనది.

## నామ గూఢచిత్రము

శ్లో॥ జీ వవత్ ప్రతిమా యస్య-వ చోమధురిమాంచితమ్।
దే హాం గేహం శ్రియ స్త్వం స్వం-వ న్దే సూరివరం గురుమ్॥

పై శ్లోకంలోని ప్రతిచరణం యొక్క ఆద్యక్షరాన్ని గ్రహించి, కలిపినచో గూఢమైన 'జీవదేవ' అనే నామం బహిర్గతమౌతుంది.

శ్లో॥ యే నానన్ద కథాయాం త్రిదశానన్దే చ లాలితా వాణీ।
తేన సుదుష్కర మేతత్ స్తోత్రం దేవ్యాః కృతం భక్త్యా॥ ఆ.దే. 104

ఎవనిచే ఆనంద కథ (అనగా 'విషమ బాణలీలా' గ్రంథం)లోను, త్రిదశానందమున (ఈ వృత్తాంతం గల 'అర్జునలీలా' గ్రంథంలోను), వాణి (భారతి) వినోదింప- బడినదో, ఆతనిచే (ఆ-ఆనంద వర్ధనునిచే) అన్యులకు అసాధారణము, మిక్కిలి దుష్కరమునైన ("దేవ్యాః- స్తోత్రం దేవీశతకము, భక్తితో, ఆరి రాధయిష (ఆరాధింపవలెనను కోరిక)తో కూర్పబడినది.

ఈ శ్లోకంలో గూఢములుగా నున్న 1. 'ఆనంద వర్ధన' కవి నామము, 2. ఆ కవి యొక్క విషమ బాణలీలా, అర్జున చరితము'లను కావ్యద్వయ నామములు, కవిచే స్వయంగా చెప్పబడక, అన్యాపదేశంగా సూచింపబడుట విశేషము. మరియు, పక్షాంతరమున 'చిత్ర కావ్య రచన', అవగాహన, అందరికి సాధ్యమైనది కాదని, అది సుదుష్కరమైనదని, అట్టి దానిని తాను సాధించితినని కూడ ఆనంద వర్ధనాచార్యుడు ధ్వనింప జేయుట గమనార్హము.

## కవి, బిరుద- నామ, గూఢ చిత్రము

1. శ్లో కశ్రీశపతే భక్త విపత్కరాణాం- విమాథ్య ముష్మిన్నిహ చ ప్రపంచే।
తాన్విశ్వదేవాంస్తు యథాఽవసి త్వం-చక్రాయుధాస్మాన వ తద్వదేవ॥
2. శ్లో॥ తులస్యురస్సగ్ధర స్కత్పపాంథో-రాశ్లే హరేఽస్మత్పరిపాలనం తే॥
న షా ప్రణా మాదభిమృష్య మన్తూ-న్నర్య బ్జపాణేఽపరిహార్య మేవ॥ వి.వేం.చి1

ఈ రెండు శ్లోకాలలోని ప్రతిపాదం యొక్క 1. ఆద్యక్షరాలను కలిపిన 'కవితా చతురానన' అను కవి యొక్క బిరుదము, 2. ప్రతిపాద- ద్వితీయాక్షరాలను కలుపుటచే 'శ్రీ మాన్విక్రాల శేషార్య' అను, కవి నామము బహిర్గతము లగుచున్నవి.

గమనిక : ప్రకాశం జిల్లా, 'కలికివాయి' అగ్రహారవాసులగు శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు గారు, ఆధునిక చిత్ర కవులలో అత్యంత సంస్తవనీయ చరితులు. 'శ్రీ వేంకటేశ్వర చిత్ర రత్నాకరము' (3 భాగాలు) మొదలగు అనేక చిత్ర ప్రబంధములను వ్రాసి. ఇటీవలనే యశః కాయులైరి. వీరి శ్రీమతి కూడ కవయిత్రి.

## నామధాతు గూఢచిత్రము

శ్లో॥ కతి తే కబరీభారః సుమనస్సంగాత్ ప్రియేఽతి నీలత్వాత్।
భవతి చ కలాపకత్వాత్ నిర్జర సేవ్యః కథం వా స్యాత్॥

ప్రియే = ప్రియురాలా!, తే-కబరీ భారః = నీ- సుందర కేశపాశము (కొప్పు), సుమనః- సంగాత్ = పూవుల లేక దేవతల యొక్క, సంబంధము వలన, కతి= బ్రహ్మతో సమానముగ నున్నది. నీలత్వాత్=నల్లగా నుండుట వలన, అతి=ఎక్కువగా- విష్ణువువలె నున్నది. కలాపకత్వాత్=హారాదులను- సర్పాలను- భూషణములుగా ధరించుట వలన, భవతి-చ=శివునివలె కూడ కన్పడుచున్నది.

ఇక్కడ, 'కతి-అతి-భవతి' అనునవి నామధాతు క్రియారూపములు. సుబంతాలు తిజంతాలుగా మారినవి. 1. దేవతా సంసర్గం వలన బ్రహ్మవలే ఆచరించుచున్నది. (కః(= బ్రహ్మ) ఇవ ఆ చరతి=కతి.) 2. నల్లదనం వలన విష్ణువుతో పోలిక. (అః(=విష్ణువు) ఇవ ఆ చరతి=అతి.) 3. సర్పభూషణ ధారణ వలన (భవః (=శివుడు) ఇవ ఆ చరతి=భవతి) అని, ఈశ్వరునితో పోలికయు సరిపోవుచున్నది. కనుక, ప్రియా! నీ కేశపాశము దేవతలకు కూడ సంసేవ్య మానమగు

చున్నది. అట్లే, ముసలితనమును మూచూడని (నిర్జర) యువకులకు కూడ సేవింప దగిన దగుచున్నదనియు భావము.

ఈ అర్థము లన్నియు 'కతి– అతి– భవతి' అను నామధాతువులలో గుప్తము లగుట వలన, ఇది 'నామధాతు గుప్తము'.

## గుణిత క్రమ గూఢమ్

శ్లో॥ భట్టి ర్నష్టో భారవి శ్చాపి నష్టః భిక్షుర్నష్టో భీమసేనోఽపి నష్టః।
భుక్కుండోఽహం భూపతి స్త్వం చ రాజన్! భాభావల్యా మన్తక స్సన్నివిష్టః॥

దొంగతనం చేసి, దొరికిపోయిన 'భుక్కుండు'డను కవి, తనను శిక్షింప బోవు రాజును, యీ శ్లోకంతో హెచ్చరించి, మరణశిక్ష నుండి తప్పించుకొనెనట!

రాజా! ఎవరైనను, ఎప్పటికైనను చావక తప్పదు. ప్రస్తుతం యమధర్మ రాజు 'భా' గుణింతం, బాగుగా అభ్యసిస్తున్నాడు సుమా! ఏలన– ఆ గుణింతంలో మొదటి అక్షరమగు 'భ'కు సంబంధించిన 'భట్టి'యను కవి మరణించాడు. దానికి దీర్ఘమిస్తే వచ్చిన 'భా'కు, తగినట్లు, 'భారవి' మహా కవియు, తర్వాత 'భ'కు గుడిసీయగా వచ్చిన 'భిక్షువు'న్నూ, గుడి దీర్ఘమీయగా వచ్చిన 'భీమసేనుడు' కూడ మరణించారు. నేడు 'భ'కు కొమ్ము (ఉత్వం) కల్పగా వచ్చిన 'భుక్కుండు' డను నా వంతు రాగా, (నేను చచ్చిన తర్వాత), 'భ' యొక్క కొమ్ముకు దీర్ఘ మీయగా వచ్చిన 'భూ'కు, నిదర్శనమగు 'భూపతివి' నీవే. అనగా భుక్కుండుడ నగు నన్ను చంపితే, నా తర్వాత 'భూపతి' వగునీవే యమధర్మరాజు దృష్టిలో పడతావు. అనగా నేను చచ్చిన తర్వాత నీ చావు తప్పదు. భా గుణింతము నభ్య సిస్తున్న యముని దృష్టిలో నీవు పడగూడదు అనుకొంటే, 'భుక్కుండుడు' బ్రదికి యుండగా, నీకు చావురాదు, వీనిని చంపితే, తర్వాత నీ మరణమే– అనగా, దానితో రాజు భయపడి, కాదు– కాదు, కవి చమత్కారానికి, సమయ స్ఫూర్తికి మెచ్చిన, రాజు, కవిని విడిచిపెట్టాడని పెద్దలు చెప్పగా వింటాము.

## ప్రతీక గూఢము

ఒక్కొక్కప్పుడు సామాన్యశబ్దాలద్వారా తన భావాలను వ్యక్తీకరించు టకు అసమర్థుడైన కవి, ప్రతీకలను, రూపకాలను ఆశ్రయించి, వాని ద్వారా ఆ భావాలను వ్యక్తీకరిస్తాడు. ఆ ప్రతీకలు ఒకసారి ఏకవర్ణంద్వారాగాని, లేక

సంఖ్యద్వారాగాని, అభిప్రేతమైన శాబ్దబోధను కల్గిస్తాయి. వేదోపనిషత్తులలోను ప్రాచీన ధార్మిక గ్రంథాలలోను, ప్రతీకల ప్రయోగం ప్రచురంగా కన్పడుతుంది. ముఖ్యంగా ఉద్దేశ్యగోపనమే దీనిలో ప్రముఖంగా ఉంటుంది.

శ్లో॥ విహంగో వాహనం యేషాం త్రికంచ ధరపాణయః ।
పాసాల సహితా దేవాః సదా తిష్ఠన్తు తే గృహే॥

ఈ శ్లోకంలోని మొదటి మూడు చరణాల ఆరంభంలో ఉంచబడిన, ప్రతి మూడు అక్షరాలు "ప్రతీక" రూపంలోనే ఉంచబడినాయి.

యేషాం=యే దేవతలకు, "వి_హం_గో" వాహనం=వి – గరుడపక్షి, హం=హంస, గో=గోవు (ఎద్దు లేక నంది) ఇవి - ఎవరికి వాహనములో, "త్రి - కం - చ" ధర - పాణయః=త్రి = త్రిశూలము, కం=కంబు(శంఖము), చ = చక్రము - ఇవి ఎవరి చేతులలో ఆయుధములుగా ధరింపబడినవో, అట్టి - శివ - బ్రహ్మ - విష్ణు_దేవులు, "పా - సా – ల" సహితాః, పా = పార్వతి, సా=సావిత్రి, ల = లక్ష్మి – ఈ ముగ్గురు దేవేరులతో గూడిన, దేవాః=త్రిమూర్తులు, సదా=ఎల్లపుడు, తే = నీయొక్క, గృహే = ఇంటియందు, తిష్ఠన్తు= ఉందురుగాక ! (అని కవి ఆశీర్వచనము.)

యీ "ప్రతీకగూఢం" ఏకవర్ణం ద్వారా శాబ్దబోధను గల్గించింది.

శ్లో॥ గవీశపత్రః నగజార్తి హారీ కుమారతాతః శశిఖండమౌళిః।
లంకేశ సంపూజిత పాదపద్మః పాయా దనాదిః పరమేశ్వరో వః॥

పద్యాంతమున, "అనాదిః - పరమేశ్వరః" అనుటవలన, "పరమేశ్వరః"ను అనాదిః = ఆద్యక్షరము లేనిదానినిగా చేసిన, అనగా ఆదినున్న "ప" అక్షరాన్ని తీసివేసిన, "రమేశ్వరః" మిగులును, ఇట్లే మిగిలిన విశేషణములలోని ఆద్యక్షరాలను కూడ, లుప్తంచేసి, పిమ్మట, "ఉమేశ - రమేశ్వరు" లిద్దరికీ, యీ విశేషణాలను సమన్వయింపవలెను. 1. ఉమేశ (శివ) పక్షమున అర్థముః_ గవీశ పత్రః = గోవులకు ప్రభువు లేక వృషభరాజగు - "నంది" వాహనముగా గల వాడును, నగ_జా + ఆర్తిహారీ = హిమవత్పర్వత - పుత్రియగు "పార్వతి" యొక్క - బాధను - పోగొట్టినవాడును, కుమార - తాతః = "కుమారస్వామి"కి తండ్రియు, శశిఖండమౌళిః = చంద్రకళను - శిరస్సున ధరించినవాడును, లంకేశ - సంపూజిత- పాదపద్మః= లంకాధిపతి యగు_రావణునిచే- పూజింపబడిన_ పాదారవిందములు గల వాడును, అనాదిః = మొదలు లేక పుట్టుక (అది) లేని

వాడును, లేక అలక్ష్య జన్మకలవాడును- అగు, పరమ్+ యీశ్వరః= పరమ ప్రభు వగు పరమేశ్వరుడు, పాయాత్= [మిమ్ములను, మమ్ములను గూడ] రక్షించును గాక!

ఇక 2, రమేశ [విష్ణు] పక్షమున అర్థము: శ్లోకములోని 6 విశేషణములను అనాదులనుగా చేసిన, అనగా ఆద్యక్షరాలను తీసివేసినచో, 1. [గ] వీశపత్రః= [విః=పక్షి, వి+ఈశ = వీశ=] పక్షులకు ప్రభువైన గరుత్మంతుడు- వాహనముగా గలవాడును, 2. [న] గజ+అర్తి- హారీ=గజేంద్రుని - పీడను- పోగొట్టినవాడును, 3. [కు]మార-తాతః=మన్మథుని [మార]- తండ్రియైనవాడును, 4. [శ] శిఖండ-మౌళిః= నెమలిపింఛమును- శిరస్సునధరించిన వాడును, 5. (ల్రం)కేశ-(క+ఈశ) సంపూజిత- పాదపద్మః= బ్రహ్మ- ఈశ్వరులచే- బాగుగా పూజింపబడిన- చరణ కమలములు కలవాడును, 6. అనాదిః= మొదలు తెలియబడనివాడును, అగు, రమా+ఈశః= లక్ష్మీ-పతియగు విష్ణుమూర్తి, పాయాత్=రక్షించును గాక!

ఇక్కడ, సముదాయాక్షరములతో, నొక్కొక్క అవయవమును (ప్రతీకను) ఉద్దేశించి చెప్పుట వలన, ఇదియు, నొక విధమగు 'ప్రతీక-గూఢ' మగుచున్నది

షరా : తెలుగులోవలె 'తండ్రి తండ్రి, తల్లి తండ్రి' యగు 'తాత' కాక, సంస్కృతమున 'తాత' శబ్దమునకు 'తండ్రి' అని యే అర్థము. (తాతస్తు జనకః పితా- అని అమరము. 'క' శబ్దము 'కో బ్రహ్మాత్మా నిలార్కేషు సుఃశీర్ష జలేషు కమ్' అని విశ్వప్రకాశ నిఘంటువు. 'మారుతే వేధసి' బ్రధ్నే పుంసి కః-కం శిరోమ్బునోః" అనియు అమరము.)

కొందరు కవులు తమ కోర్కెలను సూటిగా చెప్పక, శిరోవేష్టన ద్రావిడ) ప్రాణాయామం చేయించి, డొంక తిరుగుడుగా, గూఢంగా, తెల్పుదురు.

శ్లో॥ య ద్వైపరీత్యాత్ పదయోః అన్తరే౽స్తి సబిన్దుకమ్।
త దస్తి త్వద్గృహే రాజన్! తదర్థ మహ మాగతః॥ చా. చ.

రాజుతో నొక పండితుడు తన కోర్కె నిట్లు గూఢంగా చెప్పుచున్నాడు

[illegible]! పదయోః= 'పదముల యొక్క' అని అర్థం చెప్పకుండా, దానిలో [illegible]న్న, పవర్గం (ప- ఫ- బ- భ- మ) మొదట నున్న 'ప'కారమునకు, [illegible] (త-థ-ద-ధ-న) మధ్య నున్న 'ద' కారమునకు ('ప-ద'లకు), అనగా ఈ రెంటి మధ్య యొక్క, వైపరీత్యాత్ = త్రిప్పిచెప్పుట వలన, అనగా 'ప-ద' అను

వాడును, లేక అలక్ష్య జన్మకలవాడును- అగు, పరమ+ యీశ్వరః= పరమ ప్రభు వగు పరమేశ్వరుడు, పాయాత్= -మిమ్ములను, మమ్ములను గూడ- రక్షించును గాక!

ఇక 2, రమేశ -విష్ణు- పక్షమున అర్థము: శ్లోకములోని 6 విశేషణములను అనాదులనుగా చేసిన, అనగా ఆద్యక్షరాలను తీసివేసినచో, 1. -గ- వీశపత్రః= -విః=పక్షి, వి+ఈశ = వీశ=- పక్షులకు ప్రభువైన గరుత్మంతుడు- వాహనముగా గలవాడును, 2. -న- గజ+ఆర్తి- హారీ=గజేంద్రుని - పీడను- పోగొట్టినవాడును, 3. -కు-మార-తాతః=మన్మథుని -మార-- తండ్రియైనవాడును, 4. -శ- శిఖండ-మౌళిః= నెమలిపింఛమును- శిరస్సునధరించిన వాడును, 5. (లం)కేశ-(క+ఈశ) సంపూజిత- పాదపద్మః= బ్రహ్మ- ఈశ్వరులచే- బాగుగా పూజింపబడిన- చరణ కమలములు కలవాడును, 6. అనాదిః= మొదలు తెలియబడనివాడును, అగు, రమా+ఈశః= లక్ష్మీ-పతియగు విష్ణుమూర్తి, పాయాత్=రక్షించును గాక!

ఇక్కడ, సముదాయాక్షరములతో, నొక్కొక్క అవయవమును (ప్రతీకను) ఉద్దేశించి చెప్పుట వలన, ఇదియు, నొక విధమగు 'ప్రతీక-గూఢ' మగుచున్నది

షరా : తెలుగులోవలె 'తండ్రి తండ్రి, తల్లి తండ్రి' యగు 'తాత' కాక, సంస్కృతమున 'తాత' శబ్దమునకు 'తండ్రి' అని యే అర్థము. (తాతస్తు జనకః పితా- అని అమరము. 'క' శబ్దము 'కో బ్రహ్మాత్మా నిలార్కేషు సుఖశీర్ష జలేషు కమ్' అని విశ్వప్రకాశ నిఘంటువు. 'మారుతే వేధసి' బ్రధ్నే పుంసి కః-కం శిరోమ్బునోః" అనియు అమరము.)

కొందరు కవులు తమ కోర్కెలను సూటిగా చెప్పక, శిరోవేష్టన (ద్రావిడ) ప్రాణాయామం చేయించి, డొంక తిరుగుడుగా, గూఢంగా, తెల్పుదురు.

శ్లో॥ య ద్వైపరీత్యాత్ పదయోః అన్తరేఽస్తి సబిన్దుకమ్।
త దస్తి త్వద్గృహే రాజన్! తదర్థ మహ మాగతః॥ చా. చ.

రాజుతో నొక పండితుడు తన కోర్కె నిట్లు గూఢంగా చెప్పుచున్నాడు

రాజా! పదయోః= 'పదముల యొక్క' అని అర్థం చెప్పకుండా, దానిలో గూఢంగా నున్న, పవర్గం (ప- ఫ- బ- భ- మ) మొదట నున్న 'ప'కారమునకు, తవర్గ (త-థ-ద-ధ-న మధ్య నున్న 'ద' కారమునకు ('ప-ద'లకు), అనగా ఈ రెంటి మధ్య యొక్క, వైపరీత్యాత్ = త్రిప్పి చెప్పుట వలన, అనగా 'ప-ద' లను

త్రిప్పి చదివిన 'ద-ప'లు వచ్చునని భావం. అన్తరే=ఈ రెండింటి మధ్యలో, యత్-సబిందుకం- అస్తి=ఏది- బిందువు (౦- సున్న) తో కూడియున్నదో, తత్- త్వత్- గృహే—అస్తి= అది- నీ- ఇంటిలో- ఉన్నది. తత్+ అర్థం- అహం- ఆగతః= దాని- (ఆ 'ధనం') కొరకై-నేను- వచ్చినాను (సుమా!)

వివరణ: 'ప-ద'లకు మధ్య నున్నది 'ప- ఫ- బ- భ- మ-, త-థ-ద- ధ-న', ఈ రెండును ప-త- వర్గలు, వీనిలోని 'ప-ద' అక్షరాలను త్రిప్పి చదివినచో, 'ద-ప'లు అగును. ఈ 'ద-ప'లకు అనగా 'ద- ధ- న- ప'లకు మధ్య నున్న 'ధన' వర్ణాలకు, చివర బిందువు (౦) చేర్చిన, 'ధనం' అగును. ఆ 'ధనము' ను కోరి, నేను నీ వద్దకు వచ్చినానని కవి చెప్పెను. కేవలం 'ధనం' అని చెప్పితే, సరిపోగా, దానిని, ఇంత టొంక తిరుగుడుగా, 'గూఢం' చేసి చెప్పవలసి వచ్చినది.

శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట కవి 'నా నారాజ సందర్శన' లో, 'వినుగంటి విప్ప టికి పేర్మి మెయిన్ 'దప మధ్య' కాంక్షినై అని ఒక రాజుగారితో చెప్పినారట. దాని అర్థం వెంటనే తెలిసికొనటం సభలోని చాల మందికి కష్టమైనదట! ఎట్లన- '(త-థ-) ద-ధ-న, ప (-ఫ- బ- భ- మ)' లు రెండూ, వర్ణ సమామ్నాయం లోని 'త- ప' వర్గాలు. వీనిలో బ్రాకెట్లలో నున్న అక్షరాలను వదలిన, ద- ప= ద- ధ- న- ప' అను అక్షరాలు మిగులును. ఈ ద- ప అను వానికి మధ్యలో మిగిలినది 'ధ న' కాగా, ఆ ధనమును కాంక్షించి నేను మీ దగ్గరకు వచ్చినా నను అర్థం, పండితులంతా, తల బ్రద్దలు చేసుకోగా, వచ్చినదట.

శ్లో॥ సూకరః కంకణం ధత్తే కంకణే రమణీ స్థితిః।
తత్రాపి తరవ శ్చిత్రం కిం దీర్ఘ సురతై ర్వినా॥ చా. చ.

ఈ శ్లోకార్థాన్ని పై పైన చెప్పుకొన్నచో- విచిత్రంగా, అశ్లీలంగా కూడ కన్పడుతుంది. పంది కడియాన్ని ధరిస్తోంది. ఆ కడియం మీద సుందరి ఉన్నదని, దాని మీద కూడ చెట్లున్నవని! ఇంకా విశేష మేమిటంటే, దీర్ఘ సంభోగాలు లేక పోతే వీని వలన ప్రయోజన మేమున్నది? ఇది మరీ అశ్లీలంగా లేదా? ఏమిటి యీ చిత్రమ్? ఆశ్చర్యంగా లేదూ? అందుచే, ఇలా అర్థం చెప్పటం సమంజసం కాదు. కవి ఏదో విశేషాన్ని చెప్పి ఉంటాడు. అందువలన సుదీర్ఘంగా, మెదడుకు మేత పెట్టి గాఢంగా ఆలోచిస్తే గాని, గూఢంగా ఉన్న అర్థం బోధపడదు. అందువలన "దీర్ఘ సు- ర- తైః- వినా" దీర్ఘంతో గూడిన'సు' వర్ణం అనగా 'సూ' వర్ణం, మరియు, దీర్ఘంలేని 'రకార- తకార'ములు, అనగా, యీ 'సూ-

క-ర' అక్షరాలను కలుపగా వచ్చిన "సూకరః" అను పదము నుండి, సు (=దీర్ఘ "సు")ను తీసివేసిన (వినా) "కరః" =చేయి మిగులును. అప్పుడు యీ రక కడియమును (గాజును) ధరించుట సరిపోవుచున్నది. అట్లే, "రమణీ స్థితి"లోని "ర"ను తొలగించిన, కంకణే- మణిస్థితిః= గాజు నందు- మణులు పొదిగి యుండుట సంభవమగును, మరల "తరవః"లో "త'నుచ్యుతం చేసిన, "రవః" మిగులగా, తత్రాపి- రవః= ఆ సుందరిలో- మధుర ధ్వని ఉన్నది, అంటే సరిపోతుంది. ఇలా, సుదీర్ఘ - బౌద్ధిక- వ్యాయామం చేసి, "సురతా"లను మినహాయించి, అర్థం చేసుకొంటే గాని, యీ గూఢ చిత్రార్థ రహస్యం బోధపడటం లేదు. కాబట్టి ఇది ఇంత విచిత్రంగా తయారైంది. మొత్తం మీద ఇదంతా "తీర్థ సురతైః" మీద చేసిన సాము గరిడీలు, కసరత్తుల వలన గాని, యీ గూఢ తాత్పర్యోజకం తెలుసు కోలేక పోతున్నామని భావం.

శ్లో॥ యామి విధా వభ్యుదితే పున రేష్యా మీతి వదతి ధవే।
జానా త్యుద న్త మాత్రం నే దం తత్త్వం తు ముగ్ధవధూః॥ చా. చ.

ఒక ప్రియుడు తన ప్రియురాలితో నిట్లు చెప్పెను.

ప్రియా! యామి = నేను వెళ్ళుచున్నాను. విధౌ - అభ్యుదితే = చంద్రుడు - ఉదయింపగానే, పునః - ఏష్యామి= మరల-రాగలను, ఇతి-ధవే- వదతి = ఇట్లని-భర్త-చెప్పగనే (సతిప్తమి ముగ్ధవధూః = ముద్దరాలగు ఆ నాయిక, ఉదన్త-మాత్రం = ఈ వృత్తాంతము (వార్త)ను మాత్రమే, లేక "ఉ"కారాన్త ("ఉ" దన్త) "విధు" శబ్దాన్ని గురించి మాత్రమే, జానాతి = తెలుసు కొనుచున్నది. ఇదం - తత్త్వం-తు = (ప్రియుడు కోపంతో చెప్పిన,) ఈ మాట లోని - గూఢార్థమును - మాత్రము" న (జానాతి) = తెలిసికొనజాలకున్నది.

వివరణ : ప్రియుడు దూరతీరాలకు వెళ్ళుచు విధౌ-అభ్యుదితే తిరిగి వస్తానన్నాడు. ఇక్కడ "విధౌ" అనునది నాయకుని అభిప్రాయంలో "విధి" అను "ఇ" కారాన్త శబ్దము యొక్క, సప్తమి ఏకవచనము "విధి" అనగా కాలము, భాగ్యము. అదృష్టము. కాలం, అదృష్టం కలిసివస్తే, తిరిగివస్తానని నాయకుని గూఢోక్తి. కాని, నాయిక అమాయిక (ముగ్ధ) అగుటచే, ఈ "విధౌ" అను దానిని "ఇకారాన్త" "విధి" శబ్దముగా గ్రహింపక, "ఉ"కారాన్త "విధు" శబ్దము యొక్క సప్తమ్యేకవచనంగా భావిస్తుంది. కాబట్టి "విధు" శబ్దానికి అర్థం చంద్రుడు.

అనగా చంద్రోదయం కాగానే (రాత్రికే) తిరిగివస్తాను - అనే అర్థాన్నే గ్రహిస్తోంది. తెలివి తక్కువది గనుక అసలు గూఢార్థాన్ని తెలుసుకోలేకపోతోందని భావం. కవి ఈ నిగూఢ చమత్కారాన్నంతా "విధి-విధు" శబ్దాల-ఇకార-ఉకార-అన్త-సప్తమీ ఏకవచనరూపంలో నిగూఢంగా ప్రయోగించి సంపాదించినాడనుట స్పష్టము.

శ్లో॥ సువర్ణ మాయతం కృత్వా కరమూలే వినిక్షిపేత్।
అతినీల మతి స్థూలం యస్తం వేత్తి స కోవిదః॥ చా. చ. 32

సువర్ణమును పొడిగించి, కరమూలమున నుంచగా వచ్చిన, అతినీల, అతిస్థూల= వస్తువు నెరిగిన వాడే పండితుడు. ఈ అన్వయం ఎలా కుదురుతుంది?

దీనిలోని "గూఢార్థ"మేమనగా- "సు" వర్ణం= సువర్ణ శబ్దములోని "సు" అనే అక్షరాన్ని (వర్ణాన్ని) ఆయతం- కృత్వా= దీర్ఘముగా, పొడుగుగా, చేసిన, సిమ్మట, (సు- కు దీర్ఘం చేర్చిన "సూ" అగుచున్నదన్న మాట) దానిని, కర= మూలే= "కర" అను శబ్దమునకు- ముందు, వినిక్షిపేత్ (యది) = ఉంచినచో, అనగా "సూ" అక్షరాన్ని "కర" శబ్దానికి ముందు ఉంచినలో "సూకర" శబ్దం వస్తుందన్న మాట, అప్పుడు, అతినీలం- అతిస్థూలం = మిక్కిలి నల్లగాను- మిక్కిలి లావు గాను ఉన్న, తం = ఆ గూఢ-, సూకర (పంది) శబ్దమును, యః- వేత్తి, సః- కోవిదః= ఎవడు తెలిసికొనుచున్నాడో, వాడే (వాడు) పండితుడు- అన్న మాట.

అనగా శ్లోకానికి పై పైన తోచిన అర్థాన్ని కాక, అంతర్గూఢమైన అర్థాన్ని తెలిసికొన్న వాడే పండితుడని భావము.

ఇట్లే, వర్ణలోపంతో కూడ, నూతన శాబ్దబోధ గల్గించి, గూఢార్థావిష్కరణ చేయవచ్చును.

శ్లో॥ రాజన్। కమల పత్రాక్ష! తత్తే భవతు చాక్షయమ్।
ఆసాదయతి యద్రూపం కరేణుః కరణై ర్వినా॥

రాజా! "కరేణు" శబ్దము "కరణా"లను విడిచినప్పుడు కలుగు రూపము, నీకు శాశ్వతముగ కలుగుగాక! యీ ఆశీర్వచనార్థము సందిగ్ధము.

వివరణ : "కరేణుః" శబ్దమున- "క్- అ- ర్- ఏ- ణ్- ఉ-ః" అను అక్షరము లున్నవి. వీని నుండి, కరణాలను= "క్-ర్-ణ్" అను మూడు వర్ణాలను తీసివేసిన, "అ+ఏ+ఉః" మిగులును. వీనిని కలిపిన, అనగా సంధి చేయగా

ఆయుష్షు (జీవితకాలము) అనురూప మేర్పడును. రాజా ! ఆ ఆయువు (జీవిత కాలము) నీకు అక్షయముగా కలుగుగాక ! అనగా "దీర్ఘాయుష్మాన్భవ" అను ఆశీర్వచనము గూఢము.

ఎస్. బి: గోపనము శబ్దాలంకారములందే గాక అర్థాలంకారములందును గలదు! వానిలోని గూఢములైన భావాలు, అభిప్రాయాలు, పైకి కన్పడక తరచి, పరిశీలించినగాని పరమార్థము బహిర్గతముకాదు. ఈ గూఢాభిప్రాయములను అర్థాలంకారములైన సూక్ష్మ, పిహిత, వ్యాజోక్తి, గూఢోక్తి, వివృతోక్తి, యుక్తి, సూక్ష్మాలంకారములందును గాంచగలము. కాని ప్రస్తుత చిత్రాలంకార ప్రకరణమున "అర్థ చిత్ర వివరణ" అసంగతమగుటచేతను, విస్తర భీతిచేతను, విడువబడినదని మనవి.

## ఇతర గూఢ చిత్రాలు

ఎస్. బి. ఈ "గూఢ చిత్రాన్ని" మరికొందరు కవులు పరిపరి విధాలుగా ప్రదర్శించారు. వానిలో, ఏ రచనలో చూచినా, ఏదో ఒక విశేషం కన్పడుతుంది. ఏదో ఒకటి గూఢంగా దాచబడుతుంది. ఒక పద్యంలోని, అన్య పాదాలలోనున్న కొన్ని అక్షరాలనో లేక పదాలనో, కలిపి వ్రాస్తే "పాద - పద - గూఢ" మౌతుంది. అన్య పద్య గత - అక్షరాలనుగాని, పదాలనుగాని, క్రమంగానో, అక్రమంగానో, గూఢంగానున్న వానిని చేర్చి, అన్య పద్యాలనుకూడ సృష్టింపవచ్చు. మొత్తంమీద, ఈ "పాద గూఢ పద్ధతి" పద్యగూఢానికి త్రోవ చూపింది. అట్లే, ఒక పద్యంలో, మరొక పద్యంగాని, మరికొన్ని పద్యాలుగాని, గూఢంగా ఇమిడి యుండునట్లుగా చేయబడిన రచనను "గర్భకవిత" అంటారు. ఏ పద్యంలో ఏఏ పద్యాలు ఇముడుటకు అవకాశమున్నదో విచారించి వ్రాయుటం "గర్భకవిత"కు ముఖ్యలక్షణం. ఒకపద్యంలోని ప్రతిపాదము నకు ముందుగాని, వెనుకగాని ఉన్న వర్ణాలను చ్యుతమొనరించినచో మరొకపద్యం తయారగుటను "వర్ణచ్యుతక" మంటారు. ఈ పద్ధతిలోనే, సంస్కృతములో గర్భకవిత కన్పడుతుంది. ఈ పద్ధతి వృత్తాలకే సరిపోతుంది. దేశీయచ్ఛందస్సులకు సరిపడటం కష్టసాధ్యము.

# గాథా గర్భ శ్లోకమ్

శ్లో॥ అక్షయ్యం క్షీణసాదం నృబుధహతభయం సత్ఫలం ధీరచిత్తం
తుంగం శ్రీసార రక్షోసురహ రభసం త్వాం సదంగం శ్రితం వా।
చర్యాలక్షీణ లోకక్షమ మలయ మహా సంక్రమం స్వైర సజ్జం
స్థాణో స్వాబిద్ధ సర్వాహావ గరిమ గుణం కేతు నే హస్తువస్తు॥ అ.ఈ.73.

ఇందులోని ప్రతి బేసి అక్షరాన్ని కలిపిన నొక "గాథ" (పద్యం) ఏర్పడుటవలన, ఇది "గాథా గర్భశ్లోక" మగుచున్నది.

అయ్యాణ ఉద బుహాభసలం రత్తంగం సార సుహర సంసంగమ్।
తం చలణ కమల మసమం రజ్జం ణో బసహగమణ తుహ।

దీనికి సంస్కృతానుకరణ మిట్లుండును.

ఆర్యనతం బుధభ్రమరం రక్తాంగం సార శుభరసాసజ్జమ్ ।
తవచరణ కమల మసమం రాజ్యం నో వృషభగమన తవ॥

# శ్లోక గూఢ చిత్రమ్

శ్లో॥ సస్నేహా కోహకారీ మదమదన గజే కేసరీ సారవాక్యో
నిర్వాణం సంప్రయాతో వృజన గణభవా మాపదాం పిష్టిసజ్జః।
యో నిత్యం వంద్యమానః సురనర విసరైః నాగచిహ్నః పరప్రోన్న
సద్వ్యాత్పాద్యాధి ప్రమస్థా ముకుర రసముఖః పార్శ్వరాట్ కృష్ణతేజాః॥

జీరాపురీశ - పార్శ్వజిన స్తోత్రంలోని, ఈ 15 వ శ్లోకంనుండి గ్రహించిన అక్షరాల, క్రింది శ్లోకం గూఢంగా నున్నది.

శ్లో॥ సంసారవాస నిర్వాణకరణం పరమం జినమ్ ।
యోవన్దతే సకృదపి సన్నిధి స్సుఖ సమ్పదామ్॥

కొన్ని పద్యములలో, గర్భితములై, గూఢంగా నున్న ఇతర పద్యాలు "అక్షరచ్యుతకం" వలన బహిర్గతములగుట మరొక విశేషము.

విజయనగర సమీపవాసి, నిట్టల ఉపమాక వేంకటేశ్వర కవి (19 శ.) 30 సర్గలతో రచించిన "రామాయణ సంగ్రహ" గ్రంథంలోని శ్లోకాక్షరాలలో, మరి నాలుగు కావ్యాలు గర్భితాలై ఉండునట్లు రచించెను. ఎట్లన – ఈ గ్రంథ బాలకాండలో "కవినామ – వివరము" లేకాక, ఆ కాండలోని ప్రతి పద్యము యొక్క మొదటి అక్షరాలను చ్యుతంచేసి (తొలగించి), వానివి కలుపుకొని చదివిన, వీనిలో గూఢంగా నున్న "రామకవచ" కావ్యం బహిర్గతమౌతుంది. అట్లే అయోధ్యాకాండనుండి యుద్ధకాండవరకుగల, ప్రతి పద్యంయొక్క ప్రథమ పాదాక్షరాలను కూర్చుకొని చదివిన, గూఢంగానున్న "గౌరీ వివాహ కావ్యము," పైకాండలలోని ప్రతి పద్యంయొక్క ద్వితీయపాద – అద్యక్షరాలను గ్రహించి, చదివితే "శ్రీ రంగాది క్షేత్రమాహాత్మ్య కావ్యము, అదే విధంగా పై కాండలలోని ప్రతి పద్య – తృతీయపాద– అద్యక్షరాలు కూర్చుకొని చదివిన "భగవదవతార చరిత్ర" కావ్యము, ప్రతి పద్య చతుర్థపాద – అద్యక్షరాలను కలిపి చదివిన "ద్రౌపదీ కల్యాణ కావ్య" పద్యములు, (మొదట వానిలో గూఢములుగనున్నను) బహిర్గతములు కాగలవు. కనుకనే ఈ మహాకావ్యాన్ని "చతుస్సర్గకావ్యం" గా కూడా వ్యవహరించారు.

ధ్వని ప్రస్థాపనాచార్య – ఆనందవర్ధనుడు, మొదట చిత్రాలంకార బాయిష్ఠముగా వ్రాసిన "దేవీశతక" శ్లోకంలోని" కొన్ని అక్షరములను మార్చినచో, ఒక "ఆర్యా" పద్యం గూఢంగా కన్పడుతుంది.

శ్లో॥ త్వం సాజ్ఞాసు జగన్మాతః స్పష్టం జ్ఞాతా సువర్త్మసు ।
ప్రజ్ఞాముఖ్యా సముద్భాసి తత్పృథుత్వం ప్రదర్శయ॥ ఆ. దే. 97
"అజ్ఞాసు జగన్మాతః స్పష్టం జాతా సువర్త్మసు ప్రజ్ఞా ।

భాసిత్వం సాముఖ్యా సముత్ పృథుత్వం ప్రదర్శయ తత్॥ ఆ. దే. 98

పై "దేవీశతక– 97 శ్లోకంలో 98 వ ఆర్యా పద్యం అణగియున్నది.

# భాషా గూఢమ్

ఒక భాషా పద్యంలో మరొక భాషా పద్యం గుప్తంగానుండి, భిన్నార్థ- సమన్వయం కూడ సరిగా సమకూడినచో, అది "భాషా గోపన"మగును. ఇది విభిన్న పదచ్ఛేదాలతో అనులోమంగానేకాక, విలోమంగా కూడ జరుగవచ్చును.

## భిన్న సంస్కృతాంధ్ర భాషాగూఢమ్

శా॥ శ్రీ కాంతా సురయోగి పూజితపదా శీతాంశుబింబావనా
లోకేశాభ్యుదయ ప్రదాయక దయాలోకాంచలా మంగళా,
స్తోకాన్యోజ్జ్వల సత్త్వయోధరతనూ శోభా స్వవిశ్వప్రియస
శ్రీకామోత్తృషితా ప్ప్రిపాతుల సితా స్పష్టస్వహా కాప్తమా॥ వి.వేం.టి.శేఖ

ఈ శార్దూలం తెలుగు పద్యంగా, సంస్కృత శ్లోకంగా కూడ, మనపై శార్దూల విక్రీడితం చేస్తోంది. అనగా తనలో గుప్తాలైన విషయాలను తెలుసుకోకపోతే పాఠకులపై శార్దూల విక్రీడితం చేస్తానంటోందన్న మాట! ఇక్కడ, తెలుగు పద్యంగా, ఆ పద్యసంబద్ధ ప్రాసలు, యత్యక్షరమైత్రులు కూడ పాటింపబడినవి. సంస్కృత శ్లోకమైనచో, వానిని అలంకారాలుగా గ్రహించాలని విక్రాల వారి వ్యాఖ్య: మరియు, ఈ తెలుగు పద్యంలో నారాయణ స్తుతియు,- సంస్కృత శ్లోకమున" "లక్ష్మీస్తుతి"యు గూఢములుగానున్నవని కూడ గమనింపవలెను.

ఒకే పద్యాన్ని పైనుండి క్రిందికి, అనులోమంగా, రెండు విధాలగు పదవిభాగంచేసి, తెలుగు భాషా పరముగను, సంస్కృత భాషాపరముగను, ఈ రెండు భాషలకు కూడా సమన్వయంచేసి, అర్థము చెప్పుకొనుటకు వీలుగా, పింగళి సూరన "కళాపూర్ణోదయం"లో వ్రాసిన పద్యం.

మాయమ్మా నను నీవే - రాయలవై కావ దేవరా జేజేజే।
మాయాతుమలానినయది- - పాయక సంతోసమున్న పలమిలసామి॥
క. పూ. 6-161.

తెలుగులో తాత్పర్యము : రాజా। నీకు మమ్మాటికి విజయము । ప్రభువా । నీవు పాలకుడవై, రక్షణ భారమును వహించి,మమ్ము కాపాడుటవలన, తత్ఫలమగు సంతోషము, మామనస్సులలో నెలకొనియున్నది. మాయమ్మ తోడుసుమా:

ఇక సంస్కృతపరమైన భావం। విశేషంగా, మూలధనంగల రాజా: రాజడిని పురస్కరించుకొని, మూల ధనం వెచ్చించవకుము. దానము నాశములేనిది, తన్ను పెంచిన వాని నది వర్ధిల్ల జేయుచు, ముఖ్యమైనదగును. విష్ణువు పూజించెడి లక్ష్మి కొరకు రాజు వచ్చును. పాపాలురావు. విద్వాంసులు వచ్చిన యెడల పెడమొగం పెట్టి, సంతోషము లేనివాడవై, తొలగక వారితో సంభాషింపుము. విద్వాంసులు అ లక్ష్మీస్వరూపులేగదా !

ఎన్. బి. ఈ పద్యానికి, తెలుగు అర్థము,రాజడిగిన ప్రశ్నకు సమాధానము గను, సంస్కృత భావము "రాజునకు హితోపదేశము చేయుచున్నదిగను ఉన్న దని కూడా గమనింపవలెను.

"ఇట్లే పద్యమునకు, మొదటినుండి చివరివరకు అనులోమంగా చదువుచు చేసిన పదచ్ఛేదముమ, తెలుగున కన్వయించి, మరల వెనుకనుండి ముందుకు ప్రతిలోమంగా చదువుచు చేసిన పదచ్ఛేదమును, సంస్కృతమునకు అన్వయించి, సూరన రచించిన "అనులోమవిలోమ గూఢ" పద్యాన్ని కూడ ఆఘ్రాణించి, అన్వయించి, ఆనందించాలి పాఠక మహోదయులు.

క. తా వినువారికి సరవిగ- భావనలో నామనతివిభావి సుతేజా !
దేవర గౌరవ మహిమన-మావలసిన కవిత మరిగి మాకు నదీశా॥
క.పూ. 6-162

ఇత్యాది పద్యాలు కూడ "భాషాగూఢం" క్రిందికి రాగలవు.

## సాధారణీ జాతి

"కార్యవశమునగాని, ప్ర యో గ వ శ ము న గా ని, ఉత్తమ -

మధ్యమ- నీచ పాత్రలచే, పాత్రోచిత భాషలలోనేగాక, భాషా విపర్యయము, కూడచేసి, భాషించవచ్చునని భరతుని నాట్యశాస్త్రబోధ. దానినిబట్టి భోజరాజు సాధారణీజాతులు అసంఖ్యములని, "సరస్వతీ కంఠాభరణం"లో సంగ్రహించి "జాతి" మొదలగు శబ్దాలంకార భేదాలను వివరిస్తూ, మధ్యమ పాత్ర భూమికలో నున్న – ఉత్తమ పాత్ర ద్వారా ప్రయుక్తమైన, సంస్కృత ప్రాకృత భాషా ద్వయ సాధారణ (సమానమైన) జాతి నిట్లుపదేశించెను. ఈ "సాధారణీజాతి"లో అనేక భాషలలోని శబ్దాలు, నీరక్షీరములవలె కలిపి మెలిసి, వ్యాకరణ సమ్మతంగా ఒకేరూపం ధరించి, దర్శనమిస్తాయి.

శ్లో॥ సరలే సాహసరాగం పరిహర కరభోరు ముంచ సంరంభమ్ ।
విరహం విరహాయాసం వో ధురితం చిత్త మసహం మే॥ స.కం. 2–7.

ఈ శ్లోకం భవభూతి "మాలతీ మాధవమ్" లోనిది. ఉత్తమ పాత్రయగు మాధవునిచే సంస్కృతంలోను, లవంగికా" వేషం (భూమిక) లో ప్రాకృతం లోను చెప్పించిన, కవియొక్క రచనా నైపుణ్యం ప్రశంసింపదగినది.

పద్యభావం- సరళ స్వభావంగల దానా । కఠోరమగు వాంఛను విడువుము రంభోరూ । మరణ ప్రయత్నమును మానుము. దుఃఖాన్ని గల్గించు నీ విరహ బాధను, నా మనస్సు ఏ మాత్రము సహింపజాలదు సుమా ।

రుద్రటాద్యాలంకారికులు దీనిని "భాషాశ్లేష"గా భావించి, ఉదాహరించారు. "భట్టికావ్యం"వంటి వానిలో, వీనికి ఉదాహరణలు కోకొల్లలు.

సంస్కృత ప్రాకృతానులోమ శ్లోకమ్ (భాషాంతరగతమ్)

ఒక ఉషా శ్లోకాన్ని విలోమంగా చదువుటవలన, ఇతర బాషలో భిన్నార్థక శ్లోకమగుట "సుభాన్తషాగతి చిత్రభేదం"గా, భోజుడు దాహరించెను.

ఇహ రే బహలా లాపే బాలా రాహుమలీమసా ।
సాలకా రవలీలాసా తుంగా లాని కలారత॥ స. కం. 2-303.

ఈ సంస్కృత శ్లోకాన్ని ప్రతిలోమంగా చదివి తే వచ్చు ప్రాకృతపద్యం.

తరలా కలిలా గాయం సాలీలా సరకాలసా ।
సామలీ మహురాలావా సేలాలా హవరే హయి॥ స. కం. 2.304

## అనులోమ ప్రతిలోమగాథాగూఢమ్

సో హేమ మగ్గసగ్గో సోహారోహక్ఖమో విసుద్ధోఽసి।
సిద్ధో సువిమోక్ఖహారోహాసోగ్గో సగ్గ మమహేసో॥ అ.ఈ. 62

అవతార కవి "ఈశ్వర శతకం"లోని ఈ గాథను ప్రతిలోమంగా పఠించినచో ఏర్పడు సంస్కృతీకరణము.

సహేమ మార్గ సర్గః శోభారూపక్షమో విశుద్ధోఽసి।
సిద్ధః సువి మోక్షహారో హాసోగ్రః సంగమ మహేశః॥ అ.ఈ. 62

## సంస్కృత-ప్రాకృత-అపభ్రంశ శ్లోకము

శ్లో॥ కురవే కాలేసావయమారేఽరస సుకుమార సదానప దేవ।
అనవ దయాచిత భవ మదనారేఽచలమా ముక్తియతే మయిహేవ॥ అ. ఈ. 46

దీనిలో సంస్కృత, ప్రాకృత, అపభ్రంశములను 3 భాషలు గూఢాలు

## భాషా షట్క సమావేశః

శ్లో॥ అలోల కమలే చిత్త లలామ కమలాలయే।
పాహి చండి మహామోహభంగభీమబలామలే॥ ఆ.దే. 74.

అనంద వర్ధనాచార్యుని, ఈ దేవీ శతక శ్లోకంలో సంస్కృత, మహారాష్ట్రి పిశాచ, మాగధి, సూరసేన, అపభ్రంశ-రూపములగు ఆరు భాషలు, వాని అర్థాలు గూఢములై ఉన్నవి.

గమనిక :- ఆయా భాషలనంతగా తెలియని పాఠకులకు పరమవేదనను గల్గించి, వేధింపగలవని, విస్తరభీతిచే, వీని అర్థాలను వివరింపలేదని మనవి.

మైసూరు మహారాజాస్థాన కవి శ్రీనివాస కవిసార్వభౌముని (19 శ) "కృష్ణరాయ జయోత్కర్ష" అను ద్విభాషా గ్రంథం, భిన్న విరామ చిహ్నాలతో ఒక విధంగా చదివిన, అటు సంస్కృతము, మరొక విధంగా చదివిన,ఇటు కన్నడ

భాషలలో అర్థవంతంగా ఉంటుంది. పాఠకులకు కన్నడ పరిచయము కష్టసాధ్యము కనుక ఉదాహరణములు విడిచిపెట్టబడినవి.

ఇట్లే, రఘునాథ దీక్షితుని కుమారుడగు "కృష్ణకవి" 14 సర్గలతో వ్రాసిన "క్రియాగోపన రామాయణం" నిండా క్రియాగుప్తాలే. ఇటువంటి గుప్తాలింకను గలవు. వి స్తరభీతిచే విడువబడినవని విజ్ఞప్తి.

## రూఢ్యర్థ భ్రాన్తికరగుప్తమ్

వాలినం రావణం రామం సుగ్రీవం చ విభీషణమ్ ।

శత్రుఘ్నం భరతం హిత్వా సీతయా కిం ప్రయోజనమ్॥ చా. చ.

వాలిని, రావణాసురుని, శ్రీరాముని, సుగ్రీవుని, విభీషణుని, శత్రుఘ్నుని, భరతుని విడిచిపెట్టి, ఒక్క సీతను ఉంచుటవలన ప్రయోజనమేమున్నది? అను అర్థము రూఢ్యర్థము వలన కలుగుచున్నది.

వి. ఒక శబ్దమునకు రూఢివలన, యౌగికమువలన కూడ అర్థములను చెప్ప వచ్చును. రూఢి అనగా ప్రసిద్ధమైన-అర్థము. వాలి శబ్దానికి సుగ్రీవుని అన్నయైన "వాలి" అని రూఢ్యర్థము "యౌగికము" అనగా వ్యాకరణాదులవలన సాధించిన అర్థము, వ్యుత్పత్త్యర్థము వంటిది. ఇక్కడ "వాలి" శబ్దానికి "వాలము"(తోక) కలవాడు = వాలి-అనువదియౌగికార్థము.

"రామాయణ" మన్న తర్వాత, దానిలోని ముఖ్య పాత్రలన్నీ ఉండాలి. అలా కోక - వాలి, రావణాది పాత్రల నన్నిటిని వదలి, ఒక్క సీతాపాత్రనుంచుట వలన ప్రయోజనమేమి ఉంటుంది?— అని పైకి భావం కన్పడుటవలన, కవియొక్క భావం పూర్తిగా గోచరించదు.

ఇక్కడ యౌగికార్థ సహాయం తీసుకొంటేగాని అర్థం సుబోధంకాదు ఎట్లనగా తోకగలది (వాలినం) విశేష ధ్వనిచేయునది (రావణం), మనోహరమైనది.(రామం) మంచి మెడగలది (సుగ్రీవం), విశేషంగా భయంగల్గించునది. (విభీషణం) శత్రు సంహారం చేయునట్టిదియు (శత్రుఘ్నం) అయిన, భరతం = బరువు మోయు ఒక్క ఎద్దు లేకపోయినజో ఇక వ్యవసాయ కృషికి ప్రయోజన మేమున్నది ?

ముఖ్యంగా వ్యవసాయానికి మంచి ఎద్దు కావాలని భావం.

సీత = శ్రీరాముని భార్య, వ్యవసాయము, నాగటిచాలు, దున్నిన భూమియు అని అర్థాలు.

# సంస్కృత వంగ భాషా గూఢమ్

"ఈ క్రింది పద్యం సంస్కృత– వంగ భాషల రెండింటిలోను సమానమే. కాని ఛందస్సులో మాత్రం తేడా ఉన్నది బెంగాలీ భాషలో "చతుర్దశపది" అను 14 వర్ణాత్మకచ్ఛందస్సు కాగా, సంస్కృతములో చతుర్దశాక్షరాలు (14) గల "వసంత తిలకా"చ్ఛందస్సులో రచితము

"శుభ్రోజ్జ్వలే శతదలే తవ పాదపద్మ-
శోభాధరే మధురిమా భువన ప్రకాశే।
ఊషాయతా కిసలయే తవ దేవి సద్యో
భాసేచఖే శశికరా వికలావకాశే॥ జీ. సా.

# గూఢార్థ శ్లోకగుప్తమ్

నదీజ లంకేశ వనారికేతు : నగాహ్వయో నామ నగారి సూను:।
ఏషోఽ జ్గనావేషధరః కిరీటీ జిత్వా వయం నేష్యతి చాద్యగావః॥ భా. 4-39-10.

"నదీజలం– కేశవ - నారి...." ఇత్యాది శబ్దాల అర్థం పైపైన, ఏదో భ్రాన్తిని కల్గిస్తోంది. భారతంలో ఇలాంటి గూఢార్థకర శ్లోకాలు కోకొల్లలు.

ఉత్తరగోగ్రహణ సందర్భంలో, ఉత్తరునికి సహాయంగా వచ్చిన "బృహన్నల"ను "అర్జును"నిగా గుర్తించిన ద్రోణుడు, బహిరంగంగానే భీష్మాచార్యునితోనిట్లు చెప్పెను. కాని, దీనిలోని "నదీజలం – కేశవనారి........" గూఢార్థం ఏమిటో భీష్మునికి తప్ప, "పక్కనుండి విన్నను, ఇతరులకు ఏమాత్రం అర్థం కాదు. దానికి రహస్య మేమనగా -

నదీజ = నదీపుత్రుడవైన ఓ భీష్మాచార్యా !, లంకా + ఈశ– వన– అరి-కేతుః= లంకా నగర - అధిపతియగు రావణునియొక్క– అశోకవనమునకు-(కాల్చి) శత్రు (అరి) నైన హనుమంతుడు–జెండాపై గల్గిన, కపిధ్వజుడైనట్టియు, నగ+ఆహ్వయః నామ - నగ + అరి - సూనుః – అర్జున (వృక్ష) - నామం (పేరు) గల్గి, పర్వతములకు - శత్రువైన ఇంద్రునియొక్క – కుమారుడునైన, అంగనావేషధరః - ఆడు (బృహన్నలా) వేషమును ధరించిన, ఏషః - కిరీటీ = ఈ అర్జునుడు, అద్య– వయం - జిత్వా - గావః– నేష్యతి = నేడు - మనలను జయించి– గోవులను - గొనిపోగలడు.

కళ్ళు, రెండు చెవులు, 2మూత్ర-మల-ద్వారాలు=మొత్తం"తొమ్మిది నేత్రాలు".
ప్రాణ - అపాన - సమాన- ఉదాన - వ్యాన- నాగ-కర్మ - కమల - దేవదత్త-
ధనంజయాలు "పది ఆకులు" జీవ - ఈశ్వరులు "రెండు పక్షులు."

ఇది "అంక గణిత గూఢము" నకు కూడ ఉదాహరణా స్థిరపడుచున్నది. ఇట్లు, అంకెల సంకేతంతో అనేక గూఢ విషయాలు ఆవిష్కరింపబడినవి.

## మరికొన్ని గూఢ విశేషాలు

అకార ప్రశ్లేష (ఽ) లో దాగిన గూఢము.

పథ్యే సతి గదార్తస్య కి మౌషధ నిషేవణైః

పథ్యేఽసతి గదార్తస్య కి మౌషధ నిషేవణైః

ఎన్. బి. :- సంస్కృతంలో "ఽ" ఈ గుర్తును, "అకార ప్రశ్లేష, అవగ్రహము" అని,తెలుగులో "పరక" అని కూడ అంటారు. ఈ గుర్తు, తన స్థానంలో "అ"కారం లుప్తమై ఉన్నట్లు తెల్పును, ఇక్కడ, మొదటి "పథ్యే సతి" లో, ఈగుర్తు లేనందున, పథ్యం పాటించి నట్లయితే" అని అర్థం, రెండవ "పథ్యేఽసతి"లో, ఈ గుర్తు ఉన్నందున, "పథ్యే+ అసతి"గా విడదీసి, పథ్యాన్ని ఆచరింపకపోయినచో" అని చెప్పుకోవాలి. పథ్యమనగా, రోగం వచ్చినపుడు, తగ్గిన తర్వాత, తీసుకొను పరిమిత - ఆహారము.

కనుక పథ్యంగాసున్న రోగ పీడితునికి (గదా + ఆర్తస్య) ఔషధాలు సేవింపవలసిన పనిలేదు. పథ్యం లేక, ఇష్టం వచ్చినట్లు తినువానికి, మందులెన్ని సేవించినా, నిష్ప్రయోజనమని భావం. పద్యం పైకి పునరుక్తంగా కన్పడినా "ఈ "ఽ" గుర్తు "అ" ను సూచించి, గూఢంగానున్న విరుద్ధ- నఞ్ - అర్థాన్ని తెల్పుతుంది. ఈ గుర్తు ఉన్నను, లేకున్నను, ఛందస్సులో తేడారాదు.

ఇట్లే "కౌముదీ యది కంఠస్థా" "కౌముదీ య ద్యకంఠస్థా" మొదలగు వానిలోని, యది - కంఠస్థా"- "యది+అకంఠస్థా" విభేదాలను కూడ గమనింప వలెను. ఇట్లు అకార ప్రశ్లేషతోను, సంధి మొదలగు వానితోను గూఢార్థము నెరిగించు శ్లోకములెన్నో గలవు.



గమనిక :—

ఇక్కడ వుండవలసిన 74వ పేజీ ప్రక్కన వున్నది. 76వ పేజీ పొరపాటున ఇక్కడ ముద్రించబడింది.

ఇక్కడ, నదీ-జ = గంగా-నది (దేవి)కి- పుట్టిన వాడను అర్థం, ప్రకృతి ప్రత్యయముల వలన కల్గిన వ్యుత్పత్తి (యౌగిక) అర్థం. కాని, దీనికి రూఢి - (= ప్రసిద్ధ) అర్థం భీష్ముడు, నగము = నడువనిదిలేక కదలనిది, అది చెట్టు లేక పర్వతం కావచ్చు. మొదటి అర్థం "అర్జున" అను పేరుగల ఒక చెట్టు, రెండవ సారి, నగార్థము - పర్వతము. రెక్కలతో ఎగిరి, మీదపడి, ప్రజలను బాధించిన - పర్వతముల రెక్కలను, నరికి శత్రువైనవాడు = అనునది యౌగికార్థము, "ఇంద్రుడు" రూఢ్యర్థము, కనుక ఇక్కడ, పై శబ్దాలన్నీ, తమ యౌగికార్థాన్ని విడిచి, గూఢమైన రూఢ్యర్థాన్ని ఆశ్రయించి అర్థం తెలిపిన పనుట స్పష్టము.

అలోహం నిశితం శస్త్రం శరీర పరికర్తనమ్ !

యో వేత్తి నతు తం ఘ్నన్తి ప్రతిఘాతవిదం ద్విషః॥భా. 1-145-22.

భారత, విదురుడు లాక్షాగృహదహన వృత్తాంత మిట్లు తెల్పెను.

ఆ మేడ, అగ్నితో గూడిన పదార్థాలతో నిర్మింపబడినది. దానిని యీ రాత్రికే ఖాళీ చేయండి. పగతో ఎదురు దెబ్బకొట్టు వానిని శత్రువు నష్టపరచలేడని అసలు తాత్పర్యము.

వస్తుతః, ఈ శ్లోకంలోని అలోహాది శబ్దాలు, అభిధాశక్తితో పై అర్థాన్ని బోధింపలేవు. కనుక అవి గ్రంథ గ్రంథులు, గుప్తార్థ సూచకాలు.

కనుక అలోహం = అగ్నిగ్రాహి పదార్థాలతో పరిపూర్ణము, నిశితం=నిశి-తం-(రెండు పదాలు) = రాత్రియందే - ఆ మేడను (ఖాళీ చేయాలి.) శస్త్రం = మేడ (నివాసార్థక "శస్" ధాతు నిష్పన్నరూపం) శరీర పరికర్తనం= బైటనుండి హానిచేయుట....... ఇత్యాది అర్థాలు గూఢ - కూట- శైలిలో చెప్పబడుటవలన, మధ్యలో ఎందరున్నను కేవలం శ్రోతకు మాత్రమే తెలుస్తాయి.

ఇట్టి గూఢ, కూట అర్థాలుగల గ్రంథ గ్రంథులు భారతంలో 8వేలకు పైగా ఉన్నవి. ధార్మికవులు కూడ ఇట్టి ప్రతీకాత్మక శైలిలోనే ధర్మ సిద్ధాంతములను బోధించారు.

రూఢ్యర్థ్యంలో, అనేకార్థక - గూఢశబ్ద ప్రయోగంతో భ్రాన్తిగొల్పుట.

కేశవం పతితం దృష్ట్వా ద్రోణా హర్ష ముపాగతః!
రుదన్తి కౌరవాః సర్వే హా కేశవ! కథం గతః?॥

క్రింద పడిన కేశవుని (కృష్ణుని) గాంచి, ద్రోణాచార్యులు సంతసింప, అయ్యో! "కేశవా! పడిపోయావా!"అని కౌరవులంతా (గుండెలు బాదుకొంటూ) ఏడవటం మొదలు పెట్టారట! ఏమిటీ ఏడవటం? మనలను కూడ ఏడిపిస్తున్నారే? కనుక ఆ గూఢార్థం ఎట్టిది?

"కేశవ"కు ప్రకృతి ప్రత్యయాలవలన వచ్చిన వ్యుత్పత్త్యర్థం, కే-శవం= నీటిలోని- శవము (పీనుగు). రూఢ్యర్థం - విష్ణువు, కృష్ణుడు. అట్లే "ద్రోణ - కౌరవ" శబ్దాలకు క్రమంగా= మాల కాకి, నక్క - అను అర్థాలను నానార్థ నిఘంటువు చెప్పుతుంది. కాని, ఇక్కడ, "కేశవ - ద్రోణ- కౌరవ" అను నానార్థక శబ్దాలు, తమ వ్యుత్పత్తి- వాచ్యార్థములగు "నీటిలోని పీనుగు - మాల కాకి - నక్క" అను అర్థాలను విడచి, రూఢ్యర్థాలగు "కృష్ణ-ద్రోణా చార్య - దుర్యోధనాదులను, అర్థాలను ప్రత్యేకంగా, తెల్పి, భ్రాన్తిని గల్గించినవి. నదిలో కొట్టుకొని వెళ్ళుచున్న శవాన్ని చూచి, తానే తినవచ్చును, నక్కలు అడ్డురావని, కాకి సంతసించటం, ఆ శవం భూమిమీదపడక, ఏటిలోపడి, తాము తినుటకు వీలుపడనందున, నక్కలు ఏడ్చుచున్నవి - అను అర్థం కూడ, సుసంగతితో సుందరమైనది.

## ధార్మిక "భాగవత" గ్రంథంలోని ఒక గూఢము

ఏకాయనోఽ సౌ ద్విఫల స్త్రి మూల శ్చతూరసః పంచవిధః షడాత్మా
స ప్తత్వ గష్ట విటపో నవాక్షో దశచ్ఛదీ ద్విఖగో హ్యాది వృక్షః॥

భాగవతం (70,2-27) లోని ఈ శ్లోకానికి భావము నిట్లు గ్రహించవలెను.

ఈ సంసార రూపమగు ఆది వృక్షముయొక్క ప్రకృతియే, ఒక "ఆశ్రయము". సుఖ - దుఃఖాలు "రెండు ఫలాలు". సత్త్వ - రజః- తమస్సులు "మూడు శాఖలు". ధర్మ - అర్థ - కామ మోక్షాలు నాలుగు రసాలు." త్వక్ - చక్షుః- శ్రోత్ర - జిహ్వా -ఘ్రాణములను నవి "ఐదు విధాలు". ఉత్పత్తి - స్థితి - ఉన్నతి - పరివర్తన - ధృతి - వినాశములు - "ఆరు ఆత్మలు. రస - రుధిర- మాంస - మేదః- అస్థి - మజ్జా - శుక్లములు "ఏడు వల్కలాలు." పృథివి - జలం - అగ్ని - వాయువు - ఆకాశము= పంచభూతాలు + మనస్సు - బుద్ధి - అహంకారాలు."ఎనిమిది శాఖలు"= ఒక ముఖం, రెండు ముక్కు రంధ్రాలు,రెండు

అ ప్రయుక్తార్థాలతో శబ్దాల "గూఢతా" ప్రదర్శనము.

యస్. బి. : అప్రయుక్తము (అంతకు ముందు కవులచే ప్రయోగించని పదము) నేయార్థము, క్లిష్టత.... మొదలగునవి కావ్యదోషాలని అలంకార ప్రవచనం, వస్తుతః ఈ దోషాలన్నీ నిత్యదోషాలు కావు. వీనిలో కొన్ని అనిత్య దోషాలు కూడ ఉన్నవి. అన్నిచోట్ల దోషమైనది "నిత్యదోషము, ఒక సందర్భంలో దోషంగా నున్నది, వేరొకచో దోషం కాకపోవచ్చును. (ప్రత్యుత "గుణం" కూడ కావచ్చు) ఇది అనిత్య దోషం.

శృంగార వర్ణనలో దుష్టాలైన "శ్రుతిదుష్ట" ఆదిదోషాలు, వీర, రౌద్రాదులలో దోషాలుకావని, "అనిత్యదోషా"లని అనందవర్ధనుడు (ధ్వ. 2 - 11) చెప్పెను. మమ్మటాచార్యుడు, ఈ నిత్యానిత్య దోషాలను [కా. ప్ర. 7-58, 59] సోదాగా వివరించెను.

అట్లే "అప్రయుక్తత్వం" కావ్యాలలో దోషమైనా, కూట, గూఢ- ఆది రచనలలో, అర్థగోపనానికి సహాయపడుతుంది.

1. అట్ట శూలా జనపదా: 2. శివమాలా శ్చతుష్పథాః!

3. ప్రమదా: కేశశూలిన్యో భవిష్యన్తి కలౌయుగే॥

కలియుగంలో 1. గ్రామాలు, దేశాలు [జనపదా:] అన్నము నమ్ముకొంటాయి. 2. బ్రాహ్మణులు వేదాల నమ్ముకొని బ్రతుకుతారు. 3. మహిళలు మానము నమ్ముకొని జీవింతురు శ్లోకంలోని "అట్ట – శూల – శివ - చతుష్పథ – కేశ" పదాలు, యథాక్రమంగా "అన్న - విక్రయ - వేద - బ్రాహ్మణ- భగ [స్త్రీమర్మావయము] అను అర్థాలలో పూర్వం, అప్రయుక్తాలైనా, గూఢాదులలో అర్థగోపనకు సహాయపడినవి.

అట్ట మన్నం శివో వేదః బ్రాహ్మణ శ్చ చతుష్పథః!

కేశోభగ ఇతిప్రోక్తః శూలో విక్రయ ఉచ్యతే॥"

నేయార్థంతో శాబ్దబోధ.

నేయార్థము = తాను ఏర్పాటు చేసికొన్న సంకేతంవల్ల తెలియదగిన పదము, ఉదా : "వ్యత్యస్త నవ - వృత్తయః" "నవ"ను తలక్రిందు చేయగా వచ్చిన "వనము" [అడవి] లో కాపురముండువారు - అను ఫలితార్థము, కర్త - ఏర్పాటుతో వచ్చినందున "నేయార్థము".

దేవరాజో మయా దృష్టః వారి వారణ మస్తకే ।
భక్షయిత్వా ర్కపత్రాణి విషం పీత్వా క్షయం గతః॥

"నీటి ఏనుగునెక్కి, నాకు కన్పడిన దేవేంద్రుడు 'దేవ రాజః' అర్క పత్రాల నారగించి, విషం త్రాగి, వినాశం పొందెను" అను అర్థం పైకి కన్పడు చున్నా, అది సరియైన అర్థంకాదు. కనుక దేవర, + అజః" అని విడదీసి, "హే దేవర । ఓ మరదీ ।, వారి క వారణ – మస్తకే = నీటిని – అడ్డగించిన గట్టు – మీద, మయా – దృష్టః– అజః= నాచే – చూడబడిన – మేక, అర్క పత్రాణి – భక్షయిత్వా = జిల్లేడాకులను – తిని, విష్టం – పీత్వా = నీటిని – త్రాగి, క్షయం – గతః= తన నివాస స్థానమునకు – వెళ్ళినది.

దీనిలోని, దేవరాజ, వారివారణ" పదాలకు చెప్పిన. అర్థాలు, వస్తుతః రూఢిమీదగాని, ప్రయోజనంమీదగాని, ఆధారపడక, స్వ సంకేతం వలన అర్థ గోపనంతో వచ్చిన అర్థాలు మాత్రమే. అట్లే "విష్ట – క్షయ" శబ్దాలకు "నీరు – నివాసం" అను అర్థాలు. కూడ అప్రయుక్తాలు.

## 'క్లిష్టతా' దోషంలోని గూఢత్వము

ఒకచోట అన్వయ క్లిష్టతవల్ల అర్థబోధనలో కాఠిన్యం కల్గుతుంది.

కుమారసంభవం దృష్ట్వా రఘువంశే మనోఽదధత్।
రాక్షసానాం కులజ్యేష్ఠ : రామో రాజీవలోచనః॥

"క్లిష్ట" మనగా డొంక తిరుగుడుగా దూరాన్వయము వచ్చుట. ఇచ్చట రాక్షసులలో జ్యేష్ఠుడు (శ్రేష్ఠ :– పాఠాంతరము) కమలాక్షుడునగు రాముడు, కుమార– సంభవమును చూచి, రఘువంశమున మనస్సును నిల్పెను. ఈ అర్థం సరిపడక క్లిష్టంగా నున్నందున, క్రింది విధంగా అన్వయించుకొనవలెను. రఘువంశే–కుల జ్యేష్ఠః=రఘు మహా రాజులలో జ్యేష్ఠుడు, రాజీవలోచనః. కమలాక్షుడునైన, రామః శ్రీరాముడు, రాక్షసానాం– సంభవం– దృష్ట్వా=రావణాది రాక్షసుల– పుట్టుకనుగాంచి, (వారిని సంహరించుటకు)కుం– అర= భూమిమీదికి– దిగెను.

లేక, కులశ్రేష్ఠః–దేవతల సమూహంలో శ్రేష్ఠుడు, రామః=జగన్మనోహరా కారుడునైన, రాజీవలోచనః=పుండరీకాక్షుడగు– విష్ణువు, రాక్షసానాం, సంభవం– దృష్ట్వా– రావణకుంభకర్ణాది రాక్షసుల యొక్క–పుట్టుకను–గమనించి (వారిని చంపు టకు– ఆలోచించి) కుం– అర (దివినుండి) భువికి–అవతరించెను.

ఇట్లు అన్వయిందుకొనుటతో క్లిష్టత వలన గూఢముగ్గా నున్న అర్థము బహిర్గతమై, చక్కగా సరిపడుచున్నది. 'ఆర' 'ఋ = గతౌ' ధాతువుయొక్క భూతార్థక 'లిట్' రూపము. మరియు 'ఆర' అను క్రియ గుప్తంగా నుండుటచే ఇది క్రియా గుప్తికి ఉదాహరణాంతరము కాగలదు.

కనుక కావ్యం యొక్క పరమోద్దేశం, జీవనానుకరణం, ఉపదేశం.... మొ॥ కాక, మనోవినోదం, ఆనంద ప్రదాన మని కూడా గమనింప గలము.

"పెండ్లి కొడుకును 'గూఢం'గా పరీక్షించి తిరస్కరించుట."

యస్య షష్టి చతుర్థీ స్యాత్ విహస్య చ విహాయ చ।
అహం కథం ద్వితీయా స్యాత్ ద్వితీయా స్యా మహం కథమ్॥

పెండ్లికి ముందు వరుని పక్షం వారు వధువును పరీక్షించుట ఒక ఆచారం. వధువు పక్షం వారుగాని,వధువుగాని వరుని ప్రశ్నించుట క్వాచిత్కము.ఎలాగైనా వరుడు ఒప్పు కొంటే చాలను కొంటారు. వరపరీక్ష నిషిద్ధం కూడా, కాని, పూర్వమొక విదగ్ధవధువు ధైర్యంతో వరుని ప్రశ్నించి, పరిత్యజించినదట!ఆవధువు 'విహస్య, విహాయ', 'అహం-కథం' శబ్దరూపాలను చెప్పుమని వరుని ప్రశ్నించిన దట. ఏని,రామ, శబ్దంలో సంస్కృతాభ్యాసంఆరంభించిన అప్రాచ్యుడు, అప్రాజ్ఞుడు నగు, ఆ వరుడు వెంటనే, అవి అకారాంత రామ శబ్దం వంటివనుకొని 'విహస్య విహయో: విహాణామ్' (షష్టీవిభక్తి) 'విహాయ విహాభ్యాం విహేభ్య:' (చతుర్థీవి) 'అహం అహౌ అహాన్' 'కథంకథౌ కథాన్'(ద్వి.వి)అని చెప్పి వేశాడట. మొదట,వధువు ప్రశ్నకే ఒప్పుకొనని, అసాం స్కృతికులగు పెద్దలు, వరుని ప్రత్యుత్తరాన్ని,సద్యః స్ఫూర్తితో చెప్పినసమాధానంగా భావించి, పాపం సంతోషించారట. కాని ఆవధువు 'అయ్యలారా'। యే (ఈ) ప్రబుద్ధునికి (వస్తుత; శబ్ద రూపాలగుటకు వీలుకాని,) అవ్యయాలైన 'విహస్య విహాయ' అనునవి, షష్టీ చతుర్థీ విభక్తులుగానగుచున్నవో, మరియు, (అస్మత్‌శబ్ద ప్ర.వి.ఏకవచనమగు )'అహమ్' అనునది, లింగవచన విభక్తి శూన్యముఅవ్యయమునగు'కథమ్'అను శబ్దాలు రెండూ,ద్వితీయా విభక్తులుగా కన్పడు చున్నవో, అట్టి ఈ వరునకు నేను సహధర్మ చారిణిని లేక భార్య ద్వితీయ నెట్లగుదును? అని శ్లేషతో, చమత్కరించి చెంపదెబ్బ కొట్టినదట.

నేటి వడతులు కూడ ఇలా ప్రశ్నించి, పరీక్షిస్తే, పురుషాహంకారంతో పురో గమించేవారి పుంస్త్వం ఎంతవరకు నిలుస్తుందంటారు?

# కాళిదాస మహాకవి- గూఢశైలి

ముఖ్యంగా, వైదర్భీ రీతితో వ్రాసిగన్న, కవికుల తిలకుడగు "కాళిదాస మహాకవి సైతము" "గూఢశైలి"ని, విడిచి పెట్టలేదనిన, ఇతరుల సంగతి నింక చెప్పనేల? "కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలా"గా ప్రసిద్ధమైన, "అభిజ్ఞాన శాకుంతలము" యొక్క, మొదటి నాందీ శ్లోకంలోనే "గూఢ- ప్రతీక శైలి" ని ఆదరించి, కాళిదాసు చూపిన చిత్రకళా నైపుణ్యమును పరిశీలించండి.

యా సృష్టిః స్రష్టు రాద్యా వహతి విధిహుతం యా హవి ర్యాచ హోత్రీ
యే ద్వే కాలం విధత్తః శ్రుతి విషయ గుణా యా స్థితా వ్యాప్య విశ్వం।
యా మాహు స్సర్వభూత ప్రకృతి రీతి యయా ప్రాణినః ప్రాణవన్తః
ప్రత్యక్షాభిః ప్రపన్న స్తనుభి రవతు వ స్తాభి రష్టాభి రీశః॥

ఏది బ్రహ్మయొక్క ఆది సృష్టియో (నీరు), ఏది విధి పూర్వకంగా ఆహుతులను గ్రహించునో (అగ్ని),ఎవడుహోతయో(యజమాని లేక సోమయాజి), ఏది జ్యోతీ రూప - దిన - రాత్రి - కాల విధానం చేయుచున్నదో (సూర్య చంద్రమసులు), శబ్దగుణకమగు ఏది ప్రపంచమంతా వ్యాపించియున్నదో (ఆకాశము), దేనిని సర్వచరాచర పదార్థములకు కారణముగా తెల్పుదురో, (పృథివి- భూమి),దేనితో జంతువులు జీవించుచున్నవో (వాయువు -గాలి), ఇట్లు కంటికి కన్పడుచున్న, అష్ట (8) మూర్తులను ప్రకర్షముగా ధరించిన అణి మాద్యైశ్వర్య సంపన్నుడగు ఈశ్వరుడు మిమ్ము రక్షించుగాక,

ఇక్కడ కాళిదాసకవి ఈశ్వరునియొక్క, పృథివ్యాది అష్టమూర్తులను, అభిధా వ్యాపారంతో చెప్పక, శబ్దాలంకార భూయిష్ఠ మగు గూఢశైలి నాదరించె ననుట స్పష్టము.

ఇట్లే "అథ నయన సముత్థం జ్యోతి రత్రే రివ ద్యోః ........(రఘు2-7)

ఇత్యాదులతో చంద్రుడని చెప్పవలసియుండగా, "అత్రిమహర్షి యొక్క కంటినుండి - పుట్టిన - వెలుగు" అని డొంకతిరుగుడుగా, దూరార్థంతో చెప్పుట. కవియొక్క గూఢ ప్రౌఢోక్తి" ని గుప్తంగా ప్రకటిస్తుంది. ఇట్టి వింకెన్నియో గలవు.

ఇట్లు కాళిదాసాది మహాకవుల కావ్యాలలోనే, గూఢశైలి ప్రత్యక్షమగు చండ, భారవి, మాఘ, శ్రీహర్ష.........ఆది కవుల కావ్యాలలోని ఉదాహరణలు కోకొల్లలు. వీరందరు చమత్కార చందనాన్ని చర్చించుటకు, బౌద్ధిక వ్యాయామం కొరకు తమ కావ్యాలలో, కొన్ని ప్రత్యేక సర్గలలో చిత్రింప, అన్యులు అక్కడక్కడ, ఆవిర్భవింపజేశారు.

మైసూరు పండిత వరేణ్యులకు శ్రీ చా. రామశాస్త్రి (20 శ. పూర్వార్థము) గూఢార్థ ప్రత్యుత్తరములతో నిండిన "సీతారావణ సంవాదఝరీ" అను వర్ణ చిత్ర గ్రంథమును, 50 శ్లోకములతో ప్రకటించి, మిగిలిన 50 శ్లోకములతో, దీని నెవ్వరైన పూరింపవచ్చునని, లోకము నభ్యర్థించిరి. ఈ "సీతారావణ సంవాద ఝరి" ఉత్తర భాగమును, శాస్త్రిగారి శిష్యులు శ్రీ మైసూరు సీతారామశాస్త్రి, కర్నూలుజిల్లా ఓక్ నివాసి- బచ్చు సుబ్బరాయగుప్తగారును రచించి, ప్రకటించిరి. ఈ గూఢార్థ ప్రకాశమునకు, చ్యావితాక్షరము, అధిదత్తాక్షరము, ప్రతిదత్తాక్షరము" అను మూడు పద్ధతులు అనుకూలమైనవనియు వివరించిరి. వాని విశేష వివరములలను మా "చ్యుతదత్త దత్తచ్యుత దీపిక"లో గాంచగలరు. ప్రస్తుత మొక ఉదాహరణమును పాఠక మహాశయులు పరిశీలింతురుగాక !

పక్షీణాలస్యః సమరభువి, రక్షః కులపతిః,
సలజ్జః స్వస్తుత్యాం, అమలహిత మార్గైక పథికః!
ప్రణ ప్రమస్త్రీలభ్యః సుముఖి । విలసత్కీర్తి రితిచ,
శ్రుతో నా హం కిల ? రేఽధమః ముహు రలం త్వాం శ్రుతవతీ॥

సీతా_రావణ సంవాదపరమైన, ఈ శ్లోకమున, మొదటి 3 1/2 పాదములలో, రావణుడు తన గొప్పతనమును గోడగించు (చెప్పు) కొనగా, మిగిలినది సీతాసాధ్వి ప్రత్యుత్తరము.

ఓ సీతా । రణరంగమున ఆలసింపక, ముందుకు ఉరుకువాడు, రాక్షసేశ్వరుడు, ఆత్మస్తుతికి అత్యంత దూరముననుండు వాడు, నిర్మల మార్గానుసారి, ప్రణతలగు పడతులకు లభించువాడు_గా, దిగంత విశ్రాంత కీర్తి గడించిన వాడ - నగు_నన్ను (రావణుని) గూర్చి, నీవు వినలేదా ? అని 3 1/2 పాదాలతో రావణుని ప్రశ్న.

ఉత్తరం - "ఓరీ! నీచుడా! (ఫినకేమిః) నిన్ను గురించి, "అలం" గా (కావలసినంతగా) చాలసార్లు విన్నానురా - అని సీతాదేవియొక్క గూఢ ప్రత్యుత్తరము, ఆ గూఢ రహస్యము "అలం" లో నున్నది.

"అలం = చాలును" అని ప్రసిద్ధార్థము. కాని, ఇక్కడ ఆ అర్థము సరిపోదు. కనుక = "ల"కారము - లేనిది. (నాస్తి లః యస్మిన్-అని విగ్రహము) అనగా రావణుడు చెప్పిన అన్ని విశేషణములలోని "ల" కారములను తీసివేయగా వచ్చిన అర్థము. ఆ "ల" వర్ణమును తీసివేసిన, పై విశేషణము లిట్లుండును. 1. సమర భువి పరిక్షీణా (ల) స్యః, 2. రక్షః కు (ల) పతిః, 3. స్వస్తుత్యాం స (ల) జ్జః, 4. అను (ల) హిత మార్గైక పథికః, 5. ప్రణమ స్త్రీ (ల) ఖ్యః, 6. వి (ల) సత్కీర్తిః, ఇట్లు (ల) వర్ణముతీసి వేయగా వచ్చిన అర్థాలు. 1. (ఓరీ! రావణ! నీవు) రణరంగమున ఎండిన మొగముతో నిస్తేజస్కుడవు. 2. రాక్షసులకు చెడును, కల్గించు రాజ (జువు (కుత్సితః పతిః = కుపతిః) 3. ఆత్మస్తుతిలో అత్యంత సన్నద్ధుడవు (నజ్జః). 4. నింద్య (అ - మహిత) మార్గాను సారివి. 5. స్త్రీలకు లొంగి నమస్కరించువాడవు, (స్త్రీ ఖ్యః- ప్రణ ప్రమః- పాక్షిక విసర్గలోపము. 6. పోయిన మంచి కీర్తి కలవాడవు (వి= ప్రగత)- సత్కీర్తిః = నేడు నీకు మంచికీర్తిలేదన్న మాట)

ఇట్లు (ల) కారములేని ఈ విశేషణముల గూఢార్థములగు, రావణుని నిస్తేజస్త్వాదులనే గాక, "రే! అధమ!" అనుసీచ సంబోధనములచే, అతని హీనత్వమును కూడ, నర్మగర్భితముగా ఉట్టంకించిన సీతాదేవి, అతని మాటలతోనే గుప్తముగా" వాని నోరు మూయించినది.

ఇది అక్షరమును, చ్యావితం = చ్యుతం చేయుట (తొలగించుట) వలన వచ్చిన "చ్యావిక్షతార"- అర్థము.

## శ్రీ చావలి రామసూరి- అలంకార ముక్తావళి

ఆంధ్రదేశంలో వెల్వడిన విశిష్ట చిత్రకావ్యాలంకారాలు కొన్ని శ్లేషయమక చక్రవర్తి యగు శ్రీరామసూరి అలంకార ముక్తావళి"లోని "అనులోమ ప్రతిలోమ గత్యాచతుఃషష్టి శ్లోక గర్భిత - కంకణ బంధము" అత్యంత చమత్కారావహము, అభూత పూర్వమునైన చిత్ర ప్రక్రియ.

శ్లో॥ సారా చారా రామా మారా కారా ధారా దానా ధారా ।
రామా రామా ధారా చారా దానాకాదా ఛాశావామా॥

ఈ బంధంలోని ఒక్కొక్క అక్షరమును తొలగించి, ఆ తొలగించిన దానిని చివర చేర్చుటవలన, అనులోమంగా 32 శ్లోకములు, అట్లే ప్రతిలోమంగా తొలిగించి కూర్చుట వలన 32, మొత్తం దాని గర్భంలో గూఢంగానున్న 64 కంకణబంధ శ్లోకాలు, పుట్టుకు రాగలవు. ఈ చతుఃషష్టి (64) గర్భిత కంకణ బంధానికి అర్థం చెప్పుట, అర్థిచేసుకొనుట కూడ అత్యంత కష్టసాధ్యము - అని నిందించు "దేవానాంప్రియము" లను (మూర్ఖులను) ధిక్కరిస్తూ దానివలన "సరససుమనః ప్రీతి సదనమై" న తన కావ్యానికి నష్టంలేదని (కానో హాని ః? ఇత్యాదిగా.... ....కవి వివాకరించెను.

## అర్ధశ్లోక రామాయణము

మాన్యశ్రీ చర్ల భాష్యకారశాస్త్రి (కాకరపర్రు, ప॥ గో॥ జిల్లా)

ఉద్దండ చిత్ర రచనా ధురీణులు. అనిదం పూర్వములైన చిత్ర ప్రబంధ త్రయమును చిత్రించి, వాసి గాంచినవారు 1. మేకా ధీశ శబ్దార్థకల్పతరుః" కల్ప వృక్షము కోరిన కోరికల నిచ్చినట్లు, ఈ "మేకాధీశ" పదం కూడ అనేకార్థాలను తెల్పుము.

2. "అర్ధ శ్లోకమయః కంకణ బంధః"- రామాయణార్థ ప్రతిపాదక - ఇతి హాస గ్రంథము. "మోమో గోగో విద్యున్మాలా = 2. మగణాలు + 2 గురు వులు అనగా మొత్తం పాదానికి 8 గురువులు, అర్ధశ్లోకానికి (2 చరణాలకు) 16 గురువులతో నొప్పు "విద్యున్మాలా" వృత్తముయొక్క, అనులోమ విలోమైక రూపశ్లోకము. ఈ శ్లోకార్థమును విలోమంగా చదివినచో, ఉత్తరార్థం వస్తుంది. ఈ శ్లోకార్థంలోని ఒక్కొక్క అక్షరాన్ని ముందునుండి వెనుకకు తొలగించి, ఆ తొలగించిన అక్షరాన్ని మరల చివర కలుపుకొనుచు అనులోమంగా పోయి

నచో 16 శ్లోకాలు, అట్లే, వెనుకనుండి ముందుకు ఆ వృత్తం చేయగా వచ్చిన ఉత్తరార్థమునుండి కూడ విలోమంగా తొలగించుట వలన 16 శ్లోకాలు రాగలవు. తర్వాత ఈ 16+16=32 అక్షరాలతో నిండిన 32 కంకణ బంధ శ్లోకముల అర్థాలు రామాయణార్థాన్ని ధ్వనింపజేస్తాయి ఈ శ్లోకమయ ప్రబంధ రచనా ప్రావీణ్యము నాకర్షింపజడని, బర్ల వారు భూరి కళా విశారద మహాపాండిత్య రారాజిత పండిత ప్రకాండులను, హెచ్చరించి, అది "మూర్ఖానంద పరిజన వచనం" కానంత మాత్రాన, మాకు పట్టిన నష్టమేమీ లేదని పకృణించారు.

## ౨. ఆ "అర్థ శ్లోకమయ కంకణ బన్ధము"

శ్లో॥ శ్రీశ్రీ రాజా భూదాధీరా ధారా సారా మేకాధీశా !
శాధీ రామే రాసా రాధా రాధీ దాభూజారా శ్రీశ్రీ॥

3. మేకాధీశ శబ్దార్థ శతకోటిః" ఇది "మేకాధీశా" అను నాలుగక్షరాలలో, "సిద్ధాంతోపరి - పూర్వపక్ష విధానం" తో అలంకార శాస్త్రాన్ని ఆపోశనం పట్టిన విచిత్రావహమైన, అధునిక - అలంకార గ్రంథము.

4. నాటిజైన కవుల చిత్రాలంకార సేవయు జయ ఘంటారావము చేపినది.

5. జైన-సోమ ప్రభాచార్యుని (12 శ.) "శతార్థక కావ్యం"లోని ఒక్క శ్లోకం, జైనతీర్థంకర, వైదిక దేవతల - సమకాలీన వాదిదేవ ... .... ఆది మహాత్ములపరంగా, నూరు విధాల చూడంగా అన్వయింపబడినది.

6. మేఘ విజయగణి (17 శ.) జైన సన్యాసి అనేక శాస్త్రాలలో ఆరితేరిన మహాపండితుడు. ఇతడు తన సప్త సంధాన కావ్యం"లో జైన తీర్థంకరుల-కృష్ణ బలదేవుల కథలను గూఢంగా నిబంధించెను.

ఇంకా ఎన్నో వ్రాయవలసిన గూఢాదులు అహమహమికతో, ఆదరబాదరగా, అభిముఖాలౌతున్నాయి. వానిని మా చిత్రకావ్యాలంకార "సర్వస్వము"న సంగ్రహింపగలము. "అతి సర్వత్ర వర్జయేత్ గదా ?

# తెలుగులో గూఢ చిత్రము

తెలుగు ఛందో లక్షణ కర్తలు పలువురు వివిధ చిత్ర కవితా రీతులను, వింగడించి, ప్రదర్శించారు. లోక స్వభావాన్నిబట్టి, "లక్ష్యాల ననుసరించి లక్షణా లేర్పడటం" పరిణామ మార్గం. కాని, తెలుగులోని కావ్య ప్రక్రియలెన్నో సంస్కృతము నుండియే దిగుమతియైనట్లు కన్పడతాయి.

ఆది కవి, నన్నయ 'అవతారిక' లో 'చిత్రకవిత' ను పేర్కొన్నాడు గాని, తన భారత గ్రంథమున ఉపయోగింపలేదు. భారత కవులనుండి........ శ్రీనాథయుగం వరకు చిత్రకవితను చేపట్టినట్లు దాఖలాలు కూడ పెద్దగా కన్పడవు. కని, నన్నెచోడుడు (12.శ) తనకు ముందే వెలసిన సంస్కృత, తమిళ, కన్నడ .... చిత్ర కవితా రీతులను గ్రహించినాడు కాబోలు, తన "కుమార సంభవ" ప్రబంధమున, సందర్భోచితంగా ప్రతి పద్య చమత్కృతిని చెన్నొందించుటకై, చిత్ర కవితా విలాసమునకు పాటుపడి ప్రథమగణ్యుడైనాడు.

తర్వాత ఈ ఈ చిత్ర కవితా ప్రక్రియలను చేపట్టి, వివరించిన ప్రథమ లాక్షణికుడు, కావ్యాలంకార చూడామణి కర్తయైన విన్నకోట పెద్దన (15 శ): అటు పిమ్మట చిత్ర కవి పెద్దన (16 శ.) "లక్షణ సార సంగ్రహము" న, అట్లే "సరసభూపాలీయ, అప్పకవీయ ........ ఆది గ్రంథాలలో కూడ, ఈ చిత్రకవిత, బహుధా బహిర్గతమైనది. కథా వస్తువుతోగాని, రసంతోగాని అంతగా సంబంధం లేని దేవతాస్తుతులలోను, ఆశ్వాసాంత - పద్యాలలోను, పాఠక రుచిని ప్రకోపింప జేయుటకు గాబోలు, ప్రాచీనాంధ్ర కవులు పైతము, ఇంతో అంతో చిత్రవైచిత్ర్యాన్ని చేకూర్చగా, ఆధునికులగు కందుకూరి, మండపాక, కొక్కొండ, వావిలికొలను, మాడభూషి, నాదెళ్ళ పురుషోత్తమ కవి ........ మొ॥ వారు ఒక క్రమంగాను, కొందరు అతివేలంగా కూడ, ఆదరించి, ప్రదర్శించారు.

ప్రస్తుతాంశం, మొదట, చిత్రకవి పెద్దన కొన్ని "గుప్తాలను, వృత్త గర్భితాలను" సూచింపగా, అప్పకవి "గూఢ చతుర్థ పాదము" ను కూడ చెప్పి, లక్ష్యమును చూపలేదు. తరువాత లక్షణ కర్తలెవ్వరు "క్రియా, కారక, సంబంధ.... ఆది గూఢాలను వివరించటంగాని ఉదాహరించటంగాని చేయలేదు. ఈ "గూఢ చిత్ర రచన" అవధానాదులలోనేగాక, మహాసభలలో ప్రతిభా ప్రదర్శనమ కూడ, ఎంతగానో తోడ్పడుతుంది.

"చతుర్విధ కవితా ధురంధరత్వం" పూర్వకవుల కొక ప్రతిష్ఠాత్మక - ఆభరణంగా కూడ పరిగణింపబడింది. కనుక, చతుర్విధ కవితామతల్లజ,........ నిర్వాహక.... "ఇత్యాదిగా పెద్దనాది కవులు కూడ, పేర్కొన్నారు. సంస్కృతం

కంటె, తెలుగులోని చిత్ర కవిత్వ లక్షణం, కొంచెం భిన్నంగానే దృష్టిగోచర మౌతుంది.

ఇక, చిత్ర కావ్యాలంకార పరిధిలో, పూర్వ కవులలో తెలుగులో కొంగ్రొత్త పుంతలు త్రొక్కి, సర్కస్, గారడీ, మాయా మహేంద్ర జాలమును మహాద్భుతంగా, ఆ మూలాగ్రం, అగ్రగణ్యంగా ప్రదర్శించి, పరాకాష్ఠను ప్రతిష్ఠించిన గ్రంథ రాజం గణపవరపు వేంకటకవి (16, 17 శ.) "ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము." అట్లే, ఆధునికులలో మండపాక పార్వతీశ్వర కవి మొ॥ వారు పద్యాల స్వరూప, స్వభావాలనుబట్టి, ఒకే పద్యంలో, కించిద్భేదంతో, స్వ- పర - జాతి పద్యాలను ఎన్నో విధాల అంతర్భావితాలుచేసి, పాఠక ప్రముఖుల నెంతగా అలరించి, ఆశ్చర్య చకితులను చేశారో, చూస్తేగాని తెలియదు.

వేంకటాధ్వరియొక్క సంస్కృత "లక్ష్మీ సహస్రము"ను తెలిగించిన శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మ, శ్రీ వేంకటేశ్వర చిత్రరత్నాకర కర్తలగు శ్రీ వికాల్రం శేషాచార్యులు (కలికివాయి - ప్రకాశంజిల్లా), "నారాయణీయ" కర్తా॥ అడుసుమల్లి నారాయణరావు, (గుడివాడ) మొ॥ వారు. ఈ గుప్త - ఆది చిత్ర విశేషాలను ఎన్నింటిలో, ఎన్నో విధాల ఉదాహరించినారు.

## క్రియా గుప్తము

"రామా దైవతమణి ప్రేమాపాంగముల భయము వెడలిచి........"

(వే. ల. చి. 7) ఇత్యాది పద్యంలో, వేదులవారు "రామా !"ను సంబోధనగాగాని, "రామా దైవతమణి" అని సమానంగాగాని, పైకి కన్పింపజేసి, దానిలో గుప్తంగా నున్న "రా" అనుక్రియను విడదీసి, "రమ్ము" అను అర్థంతో సమన్వయించారు. ఇక్కడ "రా" అను గుప్త క్రియ బహిర్గతం కావటంవలన "క్రియా గుప్తము."

## సంబోధన గూఢము

"మమ్ము నోమ రమ్ము మంగళ దేవతా-ధిపతి నిం దయాళు దేవమౌని...."

దీనిలో "మంగళ దేవతాధిపతి!"(=ఓ శ్రీపతీ!) అను సంబోధనము గుప్తముగా నున్నది. మరియు "మంగళ దేవతాధిపతి, నిన్...." అని పదవిభాగం చెప్పిన, దీనిలోని "నిన్" (=నిన్ను) అను విశేష్యము కూడ, గుప్తముగా నుండుటచే, దీనిని "విశేష్య గూఢ" మనవచ్చును.

## సప్త విభక్తి వంచనము

సీ॥ మా పాపముల బాపు మాత నిత్యము మాను-గను నెడ సుఖములు గలుగుచుండు
మాచేత సర్వమ్ము మహిత ఫలమ్మగు- మాకై సమస్త మమర్చ నగును
మా వలన జరుగు మహనీయ సౌఖ్యముల్- మా కొదవ పని సంపద నొసంగు
మాయం దొరగుదుము మరగిన భక్తిచే - ఓమా కృతిన్ ప్రీతి నొందదగదె.
తే. గీ. అనుచు నుతితతి పరవశులైన స్వీయ
భక్త జనులకు మాకు సంపదల నొసగి
కోరికల దీర్చి తుది వైకుంఠ మొసగ
ధవుని బతిమాలు తల్లి ప్రత్యక్ష మగుత!॥

పై పద్యంలోని "మా" అను దానిని ఒకప్పుడు విభక్తి ప్రత్యయాలతో గూడినదిగాను, మరొకప్పుడు లేనిదిగాను చదివినచో, గుప్తములుగా నున్న "సప్త విభక్తులు" సమన్వితము కాగలవు "ఓ- మా॥" గా విడదీసినపుడు, గూఢమగు "సంబోధన"కూడా బహిర్గత మౌతుంది.

## నామ గుప్తము

ఇది అనేక విధాలుగా కన్పడుతోంది. దీనిలో కవుల, కావ్యముల, వృత్తముల, సంవత్సరముల- నామములు ఇట్లే అంకగణిత, సంఖ్యావాచక, సంగీత రాగ- ఆది గూఢ చిత్రము లెన్నో చేరగలవు.

కవి నామ వంచనము : 1. పద్యంలోని ప్రతిపాదం యొక్క మొదటి అక్షరాలతో గాని, లేక పాదాంత్య వర్ణాలతోగాని, వరుసగా, నామాక్షరాలను కూర్చుట, 2. పద్యంయొక్క నాలుగు పాదాలలో ఎక్కడనైనను నామాక్షరాలు వచ్చునట్లు చేయుట—మొ.

సీ. వెంటాడి అసురుల విదళించు దేవవేం- కటరాజితాబిదగ్రీవ తిలక
కైకైక్కొన వేల్పుల సొక్కించు సెరజూట-శ యబలాతి శయాస్త్ర శంబుచాప
వి బుధ సుధామృతి విశ్రిత నిజపీతి - లావణ్య కారణలలిత తిలక
సకల భక్తవ్రాత సారసోదిత రవి-మునిజనానందకృన్ముఖ్య చరిత వే.వి.845.

దీనిలోని ప్రతిపాద - ఆద్యక్షరాలను కలిపిన, "వెంకటేశ్వర విలాసము" అను కావ్యనామమును, ప్రతిపాద- అంత్యాక్షరాలను చేర్చిన "వేంకటపతి కవిత" అను కవి నామమును, గూఢముగ నున్నవని తెలియగలదు

మరియు, ఈ కవియొక్క 389 వ సీసపద్యంలో "ప్రభవ, విభవ.... .... ఆది తెలుగు సంవత్సరాల పేర్లును, వింశత్యుత్తర శత నామ గోపన వచనంలో 120 వృత్త నామాలు కూడ గుప్తాలై ఉన్నవి. ఇట్లే, వికారిలవారి "కమలామనో

హర కనకాక్ష సంహార........" పద్యంలోని, ప్రతిపాద- పూర్వార్థ - ఆద్యక్షర ముల కూడికతో "కవితా చతురానన" అను కవి – బిరుదమును, ఉత్తరార్థ - ఆద్యక్షరాలతో "విక్రాల శేషార్య కృతి" అను కవి నామధేయమును, గుప్తము లుగా నున్నవి. డా. అ. నా. రావు "నారాయణీయము"లోని చంపకమాలా మరియు సీసపద్యాల ఆద్యక్షరాలతో "అడుసుమల్లి నారాయణరావు కృతి"ని గుప్తం చేశారు.

చిత్ర "కవిసింహ" పోకూరి కాశీపత్యవధాని "సిద్ధని చరిత్రలో- ఒక పద్యంలోని చివరి నాలుగక్షరాలను కలిపి, నారాణి పేరు "సీతగాదె" అని శ్రీరామునిచే తెలివిడిచేయిస్తూ పాఠకులనిట్లు హెచ్చరించారు.

"చరణముల కడన్ బొసంగెడు మీకి సీ -వధువు పేరు దెల్పవలెనె మహిత
నయయటందుర గాన నా రాణిపేరు గా- తెలిసికొనుడు మీకు తెలివిలేదె?"

## ప్రశస్త నామ గోపనము

సీ. రామాయనంగ సీరమ్య నామము- మహాభాగవతం సులభాగ్యమందుర
శ్రీ మహాభారత తి నీ మనుస్మృతి య్యయిల మనోజ్ఞమయి చెలంగు
రసిక భోగ్యము తదర్థంబు శ్రీ భాష్యంబు నీ రఘువంశజని ప్రభృతులు
కువలయానందముల్ భపదీయ చరితముప్ కృష్ణకర్ణామృతాల్ కృతశుభములు
తే.గీ. బ్రహ్మసిద్ధాంతమరయ త్మన్మహిమము-యోగసారంబు నీ ధ్యానయుక్తిలక్ష్మి
విశ్వకోశము నీ బొజ్జ వేంకటేశ – నీ కృపఘనత చిత్రరత్నాకరంబు.

దీనిలో రామాయణ భాగవత, భారతాది ప్రశస్త గ్రంథనామాలు ఎన్నో గూఢములు.

## సంగీత రాగ నామ గోపనము

క॥ ఆలించగదే కన్నడ- నేలాసకి కోర్కులిడని దిది - సిరి యగునే
గోలన్ గద యీ నాటజ- గా లలినీ తోడి గూడ గనరా దానన్॥

పోకూరివారి పద్యంలో "కన్నడ, సిరి (శ్రీ), నాట, తోడి రాగాల నామాలను గుప్తం చేశారు.

## మంత్ర గోపనము

శ్రీ వావిలికొలను సుబ్బారావు "శ్రీ కుమారాభ్యుదయ" కావ్యంలో, షష్ఠ్యంతము లారింటియొక్క ఆద్యక్షరాలలో గుప్తంగా నున్న, "ఓం రామాయనమః" అను తారక మంత్రమును బహిరంగపరచెను.

# నామ గోపన మిశ్రమము

హరి శశి కుజ బుధ గురు కవి-హరి సుత తమకేతు, హరి యమాగ్రప కధనే
శ్వర శంకర, శరచరయుగ- కిరి నరహరి వటు త్రిరామ కితవ ముఖ హయా!

దీనిలో, అందుగుల వెంకయ్య కవి 1. నవగ్రహ, 2. అష్ట దిక్పాలక, 3. దశావతార- నామములను, "రామ రాజీయం" లోని ఒకే పద్యంలో గుప్తంగా నిబంధించెను.

1. నవ 9 గ్రహాలు. 1. సూర్యుడు, 2. చంద్రుడు, 3. కుజుడు, (అంగారకుడు) 4. బుధుడు, 5. బృహస్పతి, 6. శుక్రుడు, 7. శని, 8. రాహువు, 9. కేతువు. పద్యంలో-**హరి-శశి**= సూర్య= చంద్రులు, కుజ- బుధ = అంగారక- బుధులు, గురు - కవి = బృహస్పతి - శుక్రులు, హరిసుత సూర్య పుత్రుడు = శని, తమ- కేతు = రాహువు- కేతువు= మొత్తం 9 ఉన్నారు.

2. హరి - యమ అగ్రప = 1. ఇంద్రుడు, 2. యముడు, 3. నిర్ృతి: క-ధనేశ్వర = క- ధన + ఈశ్వర = అనగా "క" శబ్దముపకు - (సూర్య, యమ, రాజ, అగ్ని, గాలి, జల - ఆది అర్థాలెన్నో ........" ఉండగా వానిలో మన మిక్కడ అగ్ని, గాలి, జల - అర్థములను గ్రహించిన,) 4. అగ్ని, 5. వాయువు, 6. వరుణుడు (జలేశ్వరుడు) ముగ్గురు రాగలరు. ఇక, ధనేశ్వర- శంకర = 7. కుబేరుడు - 8. ఈశ్వరుడు - రాచటంతో - మొత్తం అష్ట దిక్పాలురు వచ్చినారు.

3. దశావతారాల విషయంలో మత భేదములున్నవి. 1. మత్స్యము 2. కూర్మము. 3. వరాహము, 4. నరసింహము, 5. వామనుడు, 6-7-8 త్రిరాములు అనగా పరశురామ- దశరథరామ - బలరాములు, 9. కృష్ణుడు, 10. కల్కి, కొందరు బలరామునికి బదులుగా కృష్ణుని, 9 వ అవతారంగా బుద్ధ దేవుని చేర్చిరి.

పద్యంలో - శరచరయుగం అనగా నీటిలో చరించు జంట=1"మత్స్య- 2. కూర్మములు,కిరి = 3. వరాహము పంది నరహరి=4నరసింహుడు,వటు = 5. వామనుడు, త్రిరామ = 6. పరశురామ 7. శ్రీరామ 8. బలరాములు, కితవ ముఖహయ మోసగాడైన, 9. కృష్ణుడు, 10. కల్కి, అవతారములు పది వచ్చినవి.

## అంక గణిత గూఢము

కం॥ ఏకా ద్విజ వర త్రి భువన – శోకహ చతురా ప్రపంచసుమ ష ట్చరణా
శ్రీకర సప్తా శ్వాన్వయ – మా కష్టము మాన వలయు మంచి దశ యదే.

శ్రీ నాదెళ్ళ పురుషోత్తమ కవి "అద్భుతోత్తర రామాయణం" లోని పై పద్యంలో ఏక, ద్వి, త్రి, చతుర్, పంచ, షట్, సప్త, అష్ట, నవ, దశ" అను అంకెలకు (1–10 వరకు) గూఢముగా పొందుపరచి, అంక గణితమును సాధించెను.

## సంఖ్యా వాచక గోపనము

"తెల్గు తేచిన్ (లేర్చి) కస్తి కల్గగా కయి జేయు...."

పై పాదంలో "నాలుగు తెలుగు అంకెలను"గుప్తంచేసి, శ్రీ కాశీపత్యవధాని, తన గ్రంథ రచనా కాలమును దెల్పెను. నేడీ తెలుగు సంఖ్యలు తెరమరుగున పడుట విచార్యము. పై పాదములోని "తెల్గు"లో, "లు" క్రిందనున్న గావత్తు (౧) ఒకటిని, "చిన్" లో నున్న "వెలపలి గిలక "(౯)" తొమ్మిదిని, "స్తి" క్రిందనున్న తావత్తు (౨) రెంటిని, "ల్గ" క్రింద నున్న గావత్తు (౧) ఒకటిని తెల్పగా, ౧౯౨౧= 1921 అగుచున్నది.

ఎన్. బి. :– నేటి "ర్చి"ని మన పూర్వలేఖకులు "చిన్"గా వ్రాసి దానిని– "చి" కు వెలవలిగిలకిస్తే "చిన్" గా చెప్పెడివారు. కనుక (వెలుపలి గిలక) తెలుగు "౯"(9)ని తెల్పును.

## గుణిత క్రమ గుప్తము

చ. క్రమల్ల దళాక్ష। క్రామ జనకా। క్రిటిరూప ధృతాన సీక! క్రి
శమహిత। క్రుంజర ప్రకర సన్నుత। క్రూర్మవపుష్క। క్రుష్ణ! క్రౢ
ప్త మురళిగాన। క్రేశివధ పండిత!, క్రైరవ మిత్ర సోదరీ
రమణక! క్రో సలేంద్ర కుల రత్నమ। క్రౌస్తుభ భూష, క్రంసహా।" వి వేం.బి.

పెద్ద అక్షరాలుపెట్టిన ప్రతి సంబోధన పదముయొక్క, మొదటి అక్షరమును వరుసగా చదివిన, గూఢమైన, "క–కా–కి–కీ...." మొదలగు "కా" గుణింతము వచ్చును.

# అవయువ పద గోపనము

సతికి "వనజ-దర్పణ-నలాపాత"పద త్ర-యాది వర్ణముల్ గ్రహించి యబ్జభూతి
క్ష్లికి నెమ్మోముని ర్మించుకతన సూ వె-నది మొదల్ వదనాహ్వాయ మర్థమయ్యె!

వేం. వి.

ప్రథమ పాదము నందలి "వనజ, దర్పణ, నలాపాత" అను పాదాల్లలో, గుప్తములైన అవయవములు, ఆద్యక్షరములునైన "వ-ద-న" అను మూడు వర్ణాల కలయికతో, "వదన" (= ముఖము) అను గుప్త అవయవ పదము వెలసినది.

## త్రిపద గుప్తి

ఆప్పకవి 'ఏకపాది, ద్విపాది, త్రిపాది!...''వీనిని వివరించినాడు, ప్రథమ పాదమే అర్థభేదముతో, తర్వాతి మూడు పాదాలలో నడచిన ఏకపాది కంపెను, పద్య పూర్వార్థమే భిన్న అర్థముతో, ఉత్తరార్థముగా కూర్చిన "ద్విపాది" కంపెను, ఈ "త్రిపాది" భిన్నము, దీనిలోని మూడు పాదాలు భిన్నములు. మూడు పాదాలలో, వరుసగా, 1, 2, 3 పదాలుగా, గూఢంగానున్నవి. ఆ మూడు పదాలను, క్రమంగా నాల్గవ పాదంలో చెప్పిన, దానిని "త్రిపాద గోపన" మందురు.

తే. గీ. "దేవ" ముని వంద్య గోవింద దితజహరణ
పుండరీకాక్ష "అవ్యక్త"-పుణ్యపురుష।
అమర సన్నుత గోపాల"హరి'' ముకుంద!-
"దేవ-అవ్యక్త- హరి'' యు నా త్రి పదయయ్యె అ. క. 4.563.

మొదటి 3 పాదాలలో వరుసగా, 1, 2, 3 పదాలుగానున్న "దేవ-అవ్యక్త-హరి" అను ఈ మూడు పదాలు, నాల్గవ పాదంలో వరుసగా చెప్పబడుటచే, ఇది "త్రిపాది.''

ఇట్లే, ఒక పద్యమునందు అనేక పదాలను గుప్త మొనర్చిన - వివిధ పద గుప్త'' మగును.

## పాద గోపనము

పద్యానికి 4 పాదములుంటాయి. ఇతర 3 పాదములందలి సరిలేకచేసి, లేక

అక్రమంగా గుప్తంగామన్న అక్షరాలతో, 4 వ పాదం తయారగుట "పాద గోపన"మగును. ఇది చతుర్థ పాదమే కావలెనను నియమములేదు. ఏ పాదమైనను గుప్తము కావచ్చును.

ఇట్లొక పాదమును గూఢమొనర్చినట్లు, "పద్యమును కూడ, మరొక పద్యంలో గూఢ మొనర్చుటను "గర్భ కవిత్వము" నకు మూలముగా కూడ ముచ్చటించారు. గూఢమైన పాదానికి, మిగిలిన 3 పాదాల అర్థంతో పొందిక యుండుట ముఖ్యాంశము.

చ. అజ "భుజగ" ద్విషద్రథ సుధాశన మాన "వరక్ష" "మాధ"వా
అజిత జనిష యాద్యతిగహా "రవిభూ"ష "కరు" ష్ట్ర "ణాకర"
క్తజ "న" గ ని "మ్మ" తామనులు "కా"నరుగా "పు" ప "మా" విదూరగా
భుజగ వరక్ష మాధర విభూ। కరుణాకర। నమ్మ కాపుమా।" వేం. చి.

పై మూడు పాదాలలో కొటేషనల్లో మన్న అక్షరాలను కల్పిన, గుప్తమైన "భుజగ........... కావుమా" అను 4 వ పాద మేర్పడుచున్నది.

చ. ఘన హరి భాస్ల జాప్త మతి కుంజ భవా యతుల ప్రతాప భా
గ్యనిధి కృపాక రాజ నకజా యత శుక్ క్రకచా మహాత్మ పా
వని వటుకేన శూర చయ పద్య సుధీ సరపాద్య హృద్య శీ
హనుమ జయప్రభాధి కన యక్రమ పానిన చర్య సద్యశీ ॥చి. ల. 1–99.

ఈ "చంపకమాల" మొదటి 3 పాదాలలోని, ప్రతి మూడవ అక్షరాన్ని కలిపి, చదివినచో, ప్రతిపాదమున సప్తాక్షరాలు వచ్చును. ఇట్లు 3 పాదాలలో 3X7 = 21 అక్షరాలతో నాల్గవ పాదము వచ్చును కనుక వీనిలో గూఢమైన "చతుర్థ పాదము" ప్రత్యక్షమగును.

## వి క్రాలవారి అపూర్వ గూఢ ప్రయోగము

వారి భూధర సీకభి వాదనములు – కేశపూజిత మహ్మోము కృపను
ఈశ మేనక ఛాయన గేశగంత–దేవ కుహరంత వినుతనవావతార వి.వేం చి.

పై పద్యంలోని కొన్ని పదాల అర్థాలు పైకి క్లిష్టంగా, అపార్థాలు కల్గిస్తున్నవి. వారి భూ–ధర = నీటిని – భూమిని– ధరించువాడా! లేక నీటి పర్వతమా! కేశ – పూజిత = వెంద్రుకలచే – పూజింపబడిన వాడా ! మేనక=ఒక అప్సరస, ఛాయ – నగేశ – గంత =? కుహరంక = గుహ లేక పాముసు అంత మొందించినవాడా।.... పైవన్నీ అసంబద్ధ – అపార్థాలు.

కనుక వానిలోని గూఢార్థాలను బహిరంగపరిస్తే చమత్కార రమ్యాలౌతాయి. ఎట్లన ?- వారి భూ - ధర = నీటిలో బుట్టిన శంఖము - లేక కౌస్తుభమణిని - ధరించినవాడా । కేశ - పూజిత = క + ఈశ - పూజిత= బ్రహ్మచే - శివునిచే- పూజింపబడిన వాడా । మేనక = మా + ఇన - క = లక్ష్మికి- ప్రభువా । ఇన_ తర్వాతి "క" ప్రత్యయం "స్వార్థకము), కనుక అర్థమునమార్పురాదు. భాయన గేశగంత = భ+ అయన - గ+ ఈశ - గంత = నక్షత్రములకు - మార్గ మైన ఆకాశమున - పోవు గరుడవాహన, కుహర + అంత = భూమిని - అపహరించిన హిరణ్యాక్షుని - అంత మొందించినవాడా । వి - మత - నవాం తార = విశేషముగా లేక గరుడపక్షిచే కొనియాడబడిన- క్రొంగ్రొత్త అవతారము నెత్తినవాడా ।

ఇత్యాదిగ గూఢంగా నున్న అర్థాలను చెప్పుకొంటే, చవులూరించి, చమ త్కారమునందింపక మానవు.

## గర్భకవిత్వము [పద్యగూఢము]

"గర్భ కవిత్వ" మొక చిత్ర ప్రక్రియ, ఒక విధంగానున్న పద్యంలో, అన్యవిధ పద్యాన్ని, గూఢంగా కూర్చటం, (పద్యగూఢం). ఒకే వృత్తంలో ఇతర పద్యాలను ఇముడ్చటం, ఒకే పద్యాన్ని విడిచి చదువుచూ, మరొక పద్యం బహి ర్గతమగునట్లుగా చేయడం మొ॥ నవి. వీనిలో "గర్భకవితలు" ఏ పద్యంలో ఏ పద్యం ఇముడుతుందో ముందుగమనించి వ్రాయుటం ముఖ్యం. మణిగణ నికర వృత్తాన్ని కంద పద్యమగునట్లు వ్రాయవచ్చును. ఇట్లే, కంద గర్భ చంపక మాలను, 3 - 4 పద్యాల నిమిడ్చి, మత్తేభ - కంద - గీత - సీస పద్యాన్ని కూడ వ్రాయవచ్చు. వసంత తిలకంలోని మొదటి అక్షరాన్ని చివరి రెండు అక్ష రాలను విడిచి, చదివితే "స్వాగత" వృత్తమౌతుంది.

వివరణ:-సంస్కృతమున ఒకపద్యముయొక్క ప్రతిపాదమునకు ముందు వెనుకలనున్న, కొన్ని వర్ణములను చ్యుతం చేయుట (తొలగించుట)వలన వేరొక పద్యమేర్పడుటను వర్ణ- చ్యుతకము" అంటారు. వృత్తములకు ఈ వర్ణచ్యుతక పద్ధతి సరిపోయినను, తెలుగులో, దేశీయ చ్ఛందమునకీ పద్ధతి సరిపడదు. కనుక

"పద్యగూఢమును" "చ్యుతచిత్రము"న గాక గూఢ చిత్రమునచేర్చుట సముంజస మగును. ఇతర వివరములు మా "చ్యుత దత్త చిత్ర చంద్రిక"లో గాంచగలరు.

ఒక కందం నుండి చతుర్విధ (4), అష్టవిధ (8) - షోడశ(16)విధ కందాలు వస్తాయి.

## దామెర్ల అంక కవి "ఉషాపరిణయ" కావ్యంలో

"కం. పరదా పరదా భరదా - వరద వరద భరద వరద వరదా భరదా
వరదా పరదా భరదా – వరద పరద భరడ వరద పరనా భరదా॥"

పై పద్యంలోని 1, 2, పాదాలలోని "స-స-స, నల - నల నల- స-స" గణాల - అక్షర క్రమమే! తర్వాతి రెండు "3-4" పాదాలలో పునరుక్తమైనది. మొదటి కందము "వ" తో ప్రారంభమై, "దా"తో అంతము కాగా, రెండవ కందం,రెండవ అక్షరమగు "ర" లో ప్రారంభమై, పద్యాదిలోని ద్వితీయాక్షరం "ర" తో ముగియును. ఇట్లు పద్యంలోని 54 అక్షరాలలో మొదట విడిచిన అక్షరాన్ని చివరికి గ్రహిస్తూ పోయిన, అనులోను క్రమంలో 54 పద్యాలు, అట్లే విలోమ క్రమంలో వెనుకనుండి ముందుకు పఠించిన 54 కందాలు, మొత్తం108 కంద పద్యాలు రాగలవు. నాదెళ్ళవారి "అద్భుతోత్తర రామాయణం" లోని 7-211 వ పద్యం "సహస్రాధిక పద్య గర్భసీస పద్యము. రావిపాటి లక్ష్మీనారాయణ కవి "భారత గర్భ రామాయణం" గర్భకవితా పూర్ణ కథాద్వయ కావ్యము. దానిలోని "ఉత్పలమాల" రామ కథను నిర్వహించ, తద్గర్భిత "గీతం" భారత కథాబోధక మౌతుంది.

సంస్కృత కవులలో క్వాచిత్కమైన ఈ గర్భకవిత, తెలుగులో మూడు పూవు లారుకాయలుగా పెరిగింది. ఇది కవియొక్క శక్తికి, ఆలోచనా వైశిత్యానికి, పాండిత్య ప్రకర్ష ప్రదర్శనకు ఒక ప్రబల నిదర్శనము.

కంద త్రయ - నీలోత్పల మాలా- మణి గణనికర వృత్త గర్భ - సరసిజ వృత్తము.

గోపాలీప్టుం బాలిత గోపున్ గొలిచెద సురముని కులనుతు బలియున్
భావన్నాంగుం భంజితపాపున్ బలి బలమథనుని ఫణిగిరి నిలయున్

కాపాలీడ్యున్ హృత్స్థలి గాపున్ కలిమల భవహరు కరివర కలితున్
వ్యాపన్నారిన్ నందుని పాపన్ బలిరిపు సుత సఖు భజదఘ హరణున్॥వి.వేం.చి

దీని – ప్రతిపాదము నందలి యతిని మార్చి చదివిచో, రెండు కంద పద్యాలు, తొలి తొమ్మిది అక్షరాలనే చదువగా, నీలోత్పల మాలా వృత్తము, ప్రతిపాదమునందు మొదటి 9 వర్ణాలను వదులుచు, చదివినచో, మణిగణని కర వృత్తమున్నా రాగలవు.

• కల్పిత కల్పవల్లీ ప్రహరణ కలిత పంచ దశాంధ్ర –
పద్య గర్భిత ప్రహరణ కలిత వృత్తము.

"కరహత కరికం కరిమత కరుణం
కలిత సుఖ రమం ఖరకర కరణం,
ఖరశర కరకం ఖరహర కరణం

క్షర ధర కరుచం కరగత కరుహమ్" వి. చి. ర. 1భా.

దీవిలో ద్వితీయా విభక్త్యన్తములైన 8 సమాసములు గలవు. ఈ ఒక్క పద్యమునందు 18 పద్యాలు గర్భితములై యున్నవి. ఇంకను వీని వివరములను విక్రాలవారి వేం. చి. 1 భాగమున గాంచగలరు.

• ఆదిభట్ల నారాయణదాసుగారి "భ్రాజతే కుక్కుటేశ్వర"మకుటం అష్ట భాషలను అంతర్గూఢం చేసుకొన్నది.

ఒకప్పుడు, వావిలి వలస ప్రభువుల ప్రశ్నకు ప్రత్యుత్తరంగా, మండపాక పార్వతీశ్వర కవి "శ్రీనామః దేవః పావనః.... ...." ఇత్యాదితో, 256 విధాలుగా చదువదగిన "కంద" పద్యాన్ని ప్రకటించి, అందరిని ఆశ్చర్యపరచార్లట. పుష్పగిరి తిమ్మకవి "రావణ బ్రహ్మహత్యా దోషనివారణార్థమై శ్రీరామునిచేపకంగా! చిత్ర కవితా ప్రక్రియలతోనే, స్తోత్రం చేయించా"రంటారు.

# అవధానాలలో గూఢ చిత్రం

"అవధానం ఆంధ్రభాషలో మూడు పూవులు, ఆరుకాయలుగా అభివృద్ధి చెందిన ప్రక్రియ. అది ఆంధ్రేతర భాషలలో అంతగా కన్పడదు.

ఒకచో, దత్తపది - సమస్య - నిషిద్ధాక్షరి ... ...." మొ॥ అవధాన విధానము లందును, ఈ గూఢచిత్రం ప్రదర్శితమౌతుంది. నాలుగు అశ్లీల - అమంగళ పదాల నిచ్చి, అశ్లీలతా - అర్థాలు రాకుండా, పద్యంలో పొసగునట్లు చేయుటను "దత్తపది" అంటారు. ఉదా : రండ ముండ, బండ, కుండ-" వీనికి అమంగళా ర్థాలు రాకుండ, "సీతాకల్యాణము" అంతర్గూఢమగు నట్లుగా వర్ణించుట.

ఉ."రండ"ని,స్వాగతాంజలి సురర్షుల బిల్చుచు, బెండ్లియాడు రా
"ముండ"ని సీత జూచి కడుబొంగుచు, జుట్టల బల్కరించుచున్,
"బండ"గు జ్ఞానవృద్ధుడు సభన్ జనకుండు రపంత లోటు రా
"కుండ" నొనర్చి, బంక్తి రథు డుత్సవ మంద వివాహ కార్యమున్.

ఈ పద్యంలోని, నాల్గు చరణాలకు ముందు ప్రయుక్తమైన "రండ- ముండ- బండ-కుండ" అను 4 అశ్లీల పదాలు, తమ వాస్తవ- అ మంగళార్థాలను విడిచి, సంధిలో గూఢములై, వేరొక రమ్యార్థాన్ని తెల్పుచు "సీతా కల్యాణా" ర్థాన్ని ప్రతిపాదిస్తాయి.

1. రండని = రండ (=విధవ) + అని, రండు + అని = రమ్మని పిల్చుట. 2. రా ముండని, ముండ (= విధవ, వేశ్య) + అని, రాముండు + అని, అనగా, రాముడు సీతను పెళ్ళిచేసుకొంటాడని,3. (పల్కరించుచున్) బండగు బండ (= వెడల్పురాయి) + అగు, అని కాక, ద్రుత - సంధిని విడచి, పండు + అగు = వార్థక్యముచే పండిపోయిన, లేక పండ + అగు యథార్థము నెరిగెడి బుద్ధిగల పండితుడగు- జనకుడు, అనియు అర్థము చెప్పవచ్చును. 4. (రా) "కుండ నొనర్చె"లో, కుండ = మట్టి పాత్ర, స్వార్థాన్ని కోల్పోయి, లోటురా "కుండ" = ఏ మాత్రం లోపం రాకుండా చేసెను. అనే అర్థాన్ని తెల్పు తుంది. మొత్తంమీద ఈ పదాలు పైకి అమంగళంగా కన్పడు, అర్థాన్ని విడువక, సంధిలో గు[illegible]లై,ఒక రమ్యార్థాన్ని కూడారాజిల్ల జేసినవి.

*"సమస్యాపూరణము" తెలుగు మాగాణమున, జేగీయమానముగా జాగృతినొంది, ప్రజలను ప్రబుద్ధులను చేసిన మరొక గూఢ ప్రక్రియ. అవధానులు కొందరు సమస్యలనెంతో రసరమ్యముగ చమత్కారచారువుగ పూరించి, శ్రోతల నానందపరవశులనుగా చేస్తున్నారు. "ఆకాశవాణి" సైతం, "సరసవినోదిని" పేరుతో వారం వారం సరసులగు సభ్యులకు సారస్వత వినోదాన్ని అందించి, "సార్థక నామధేయ" అౌతోంది.

ఒక సమస్య : "సతి సతి గవయంగ పుత్ర సంతతి గలిగెన్"

సతి=పతివ్రత లేక పార్వతి, ఆడుది, భార్య, సతి-సతి - గవయం గన్=ఆడువారిద్దరు కలిసి (పురుషసంపర్కము లేకుండ) సంభోగించినంతనే, పుత్రుడొకడు పుట్టాడట! ఎంత ఆశ్చర్యంగా, అసంబద్ధంగా ఉన్నది! దానిలోని నిగూఢార్థాన్ని గ్రహించిన తిరుపతి వేంకట కవులు ఇలా పూరించారు.

కం. అతికుతుకం బలరారగ-జతురత మెరయంగ మదన శాస్త్రవిధమునన్
వితతంబగు తన సౌధవ-సతి,సతి గవయంగ "బుత్రసంతతి కలిగెన్."

సౌధము = మేడ, నగరు.... వసతి = దే.వి. సౌఖ్యము, అనుకూలము.. సం.వి. ఇల్లు, రేయి... ... కామ సూత్ర-చాతుర్యంగల వాడొకడు, తన మేడ (వ-సతి గృహంలో, భార్య (సతి)తో భోగించి, తనయుని గాంచెను. లేక మేడ (వ-సతి)లో రాత్రి యందు రమణిని గూడి, కొడుకును గనెను-అని గూఢార్థము. కావున అమంగళార్థము కూడ అణచబడినది.

*అవధానములో "నిషిద్ధాక్షరి" మరొక కఠిన ప్రక్రియ. జమ్మి ఆకులతో విస్తరి కుట్టుట వంటిది. ఈ పృచ్ఛక పండితుడు అందరివలె వ్రాసుకొంటూ కూర్చుండడు, అడుగడుగున అడ్డుతగిలి అవధానితో కుస్తీ పట్టును. అవధాని గణ, యతి, ప్రాస, ఛందోరీతుల నాలోచించి, అనుసరింపకుండ, తద్ వృత్త-సంబద్ధ విషయాలకు అనువగు అక్షరాలను, అడుగడుగున నిషేధించి, అవధానితో మూడు చెరువులు, కాదు, ఆరు చెరువుల నీరు త్రాగించి, ఊపిరి-ఆడకుండ కుస్తీ పట్టును. చేయునదిలేక, అవధాని, ఒకే అక్షరానికి అనేకార్థములు లభించు, ఏకాక్షరాది నిఘంటువులను నెమరుకు తెచ్చుకొనుచు, పదసంధి నొక మంత్రదండముగ

గ్రహించి, పృచ్ఛకుని తప్పు త్రోవ పట్టింప జూచును. ఒకచో అవధాని "సచ్ఛ" అని ప్రయోగించి, అది "సత్+శ" అను ఛత్వసంధియా? "సత్+ఛ"=శ్చుత్వ-సంధియా? "స+ఛ" అను తుగాగమ సంధియా అను భ్రాంతిని, పృచ్ఛకునికి గల్గించి, తికమక పెట్టి జూచును. అంత పృచ్ఛక- పండితుడు "కృష్ణ" శబ్దానికి, అవధానిచే శిరోవేష్టన ప్రాణాయామం చేయించి, "క్రాదిః ష్ణః" అనియు, "కపిత్థ" శబ్దానికి "పిత్థం కాదిః" అనియు డొంకతిరుగుడుగా, అప్రయుక్త పదాలు ప్రయోగించునట్లు చేస్తాడు. ఇలా వారిద్దరి కుస్తీపట్లు కూర్చున్నవారికి తలనొప్పినేకాక, చిక్కుముడి విడిననిమ్మట ఆనందాన్ని కూడ అందిస్తాయి. ఆలంకారికులు "అప్రయుక్త-నిరర్థక-గూఢార్థాదులను "పదదోషాలు"గా ప్రకటించినా, అవధాని వానిని గణింపడు. "నిషేధాక్షరి" పద్యం చిత్ర కవిత్వ-జాతికి చెందిన పద్యం గనుక, "విహితార్థ (గూఢార్థ) - అప్రయుక్తత్వములు" శ్లేషాదులందు దోషాలు కావను సాహిత్యదర్పణకారుని సంధించి, చూపును.

సౌమేధికుడగు పృచ్ఛకుడిట్లు ప్రత్యక్షర నిషేధానికి, తన సుస్థుమేధనుపయోగించి, రామరావణ యుద్ధాన్ని తలపింపజేయుచున్నను, కుశాగ్రబుద్ధియగు అవధాని, ఒకచో మాంత్రికునివలె, శబ్దాడంబర-సంధి-సంధ్యంగాలతో గూఢంగా, పృచ్ఛకుని సంశయాళులను జేసి, నిషేధాక్షరమును చెప్పునంతలో, అవధాని, ఇట్టి గూఢ చిత్రాలతో పృచ్ఛకుని బంధించి, ఆ పద్మవ్యూహం నుండి బైటపడి, తన పనిని నెరవేర్చుకొనును. ఇట్టిపరిస్థితులలో ఈ గూఢ చిత్రాలే అవధానిని, అనుకొని రక్షిస్తాయి.

## భా షా గో ప నం

పదముల విరుపుచేత, ఒక తెలుగు కంద పద్యాన్ని సంస్కృత పద్యంగాను, అచ్చ తెనుగు పద్యంగాను కూడ సమన్వయించి, అర్థం చెప్పుకోవచ్చు. ఆ తెలుగు భాషా పద్యంలో, తదితర భాషాపద్యం గుప్తంగా నుండుటచే, దీన్ని "భాషాగోపనం" అంటారు.

కం. మాయమ్మా నను నీవే-రాయలవై కావ దేవ రాజేజేజే
మాయా తుమలానిన యది-సాయక సంతోసమున్న పల మిలసామి!

ఇది పింగళి సూరన "కళాపూర్ణోదయం"లోని 6-161వ పద్యం.

ఇట్టి "ఉభయ భాషా కందము" పిండిప్రోలు లక్ష్మణ కవి లంకా విజయము (రావణ దమ్మీయము -2-230) నందును గలదు.

సూరన చేసిన మరొక భాషాగోపన చిత్రము.

కం. తావిను వారికి సరవిగ - భావనతో నానునతి విభావసుతేజా
దేవర గౌరవ మహిమన - మా వలసిన కవిత మరిగి మాకునధీశా.

క.పూ. 6-172

ఈపిని ప్రతిలోమముగ చదివిన, పై క్రింది శ్లోకమేర్పడును.
శాధీనకుమాగిరి మతవి కనసిలవమా-న మహిమవరగౌరవదే
జాతేసువభావితి నను నాతో నవభా గవిరసకిరి వా నువితా॥

పై "మాయమ్మ..." తెలుగు పద్యమున, సంస్కృత పద్యమును, అదే క్రమంలో గుప్తంగా నుంచి, పదాల విరుపులతో, ఉభయ భాషాపరముగ అర్థ సమన్వయం జరుగగా, ఈ "తావినువారికి..." పద్యమును తద్విరుద్ధముగా, ముందు నుండి వెనుకకు (అనులోమంగా) చదివిన, తెలుగు పద్యమైన అర్థం చెప్పి, వెనుక నుండి ముందుకు (ప్రతిలోమంగా) చదివినపుడు సంస్కృతభాషాపరంగా అర్థాన్ని సమన్వయం చేయటం-ఒక ప్రత్యేకత. అర్థ వివరాలను మా "భాషాసమక చిత్ర కౌతుకమ్"లో గాంచగలరు.

గ. వేంకటకవి-అష్టభాషాగుప్త సీసము.

సీ. ణాయమాణస్సిణీలోయ దమ్మిల్ల పజ్జణ్ణ యవిజ్జులా సరిసపాయ
పురపదేవ్వవిదాణ గరువమరట్ట దుఃఖట్ట జాద విజేయ కళనసీహ
శాళన చళళనిళంతళభత్త చిందిత పళశమత్తన కేళిపాళియాద
మతనసూతన ధేరతితళవల్లహ ముహగననిజ్జగల్లానగునదురీన

గీ. కందిక చళాచలఖ్కణ పందుళాళి
మహాయ ముఖధి కరిహేదు మహాపడుఝ
ఆజవంజవ జలధి మగ్నాత్త తరణి

మబ్బు పూవుట్టువు బిడారు మగువతేఁడ. వేం.వి. 876.

ఛాయ : నాకమనస్వినీ లోక ధమ్మిల్ల పర్జన్యకవిద్యుతి సదృశపాద
పూర్వదేవ వితాన గర్వమదోద్ధత గజజాత విజవన కలహసింహ
చరణసారస నిరంతర భక్త చింతిత ఫలసమర్థనకేళి పారిజాత
మదన సూదన ధాతృ త్రిదశ వల్లభముఖ గణనీయ కల్యాణగుణధురీణ

గంధగజరాజ రక్షణ బంధురా శ్రీ
మగువ ముఖాశ్వర్య హేతు సమసమూహా

— — — —

— — — — (876)

దీనిలో సంస్కృత, ప్రాకృతాలు రెండు, + ప్రాకృత భేదాలగు శౌ(సౌ)ర సేని, మాగధి, పైశాచి, అపభ్రంశ, చూళిక-లను భాషలు ఐదు(5) + ఆంధ్రభాష యొకటి-కలుపగా అష్ట (8) భాషలు గుప్తములై యున్నవి.

విక్రాల శేషాచార్యులుగారు ఇంకను కొంత ముందుకుపోయి, తన పద్యాలను విభిన్న భాషల పరంగా భేదించుటయేగాక, సందర్భ విరుద్ధముగ విభిన్న దేవతాస్తుత్యర్థములను సూచించి, "భాషాగోపన చిత్రము"ను పురోగమింపజేశారు. మరియు, తెలుగు పద్యాలలో సంస్కృత శ్లోకాలను, ఆ శ్లోకాలలో తెలుగుపద్యాలను గర్భీకృతం చేసి, విభిన్న రీతులలో అర్థాలను సమన్వయం చేసికూడ చూపించారు. వివరాలు వారి వేంకటేశ్వర చిత్రరత్నాకరం 1,2,3 భాగాలలో గాంచగలరు.

*హల్ద్వయగుప్త విష యమక-సర్వతోభద్రము.

క్రింది "విద్యున్మాలా" వృత్తమున "రామా" అను "రెండు హల్లులు" మాత్రమే, దీర్ఘాలతో గుప్తముగ నున్నవి. ఈ సర్వతోభద్రములోని 1వ, 2వ, 3వ, 4వ పాదములను గాని, లేక వానిలోని 1వ, 2వ, 3వ, 4వ అక్షరాలనుగాని, ముందుకు వెనుకకు క్రిందికి పైకి అనులోమంగాను, విలోమంగాను చదివినను, సర్వతోముఖంగా గూఢంగా ఒకేవిధంగా "యమకాలంకార" ముండుటచే, ఇది విషమ యనుక సర్వతోభద్రమైనది.

మా రా మా రా రా మా రా మా
రా రా రా మా మా రా రా రా
మా రా రా రా రా రా రా మా
రా మా రా మా మా రా మా రా
రా మా రా మా మా రా మా రా
మా రా రా రా రా రా రా మా
రా రా రా మా మా రా రా రా
మా రా మా రా రా మా రా మా      ల.స.చి. 37.

ఇట్లెన్నియో విశేషములున్నను, విస్తరభీతిలో విరమించితిమని మనవి.

పాశ్చాత్య ప్రభావంతో తెలుగులో వెలసిన గూఢరీతులు.

17-20 శతాబ్దాల మధ్యకాలంలో. పాశ్చాత్య వాఙ్మయంలో కొన్ని క్రొత్త ఉద్యమాలు, వాదాలు నెలకొన్నాయి. ముఖ్యంగా. 19, 20 శ.లో ఫ్రెంచి, ఇంగ్లీషు కవితారంగంలో వెలువడిన సర్రియలిజం, సింబాలిజం (అధివాస్తవిక-ప్రతీకవాదాలు).... మొ. పద్ధతులు, వస్తు, శబ్ద ప్రయోగ, భాషా, ఛందస్సులలోను భావ వైఖరులలోను అపూర్వమైన, గూఢవైవిధ్యాన్ని విస్తరింపజేశాయి. ఈ సర్రియలిజం, సింబాలిజాలకు చిత్రకవిత్వంతో కొంత సంబంధమున్నది. ఈ వాదాల వాసిగన్న, మన శ్రీశ్రీ, నారాయణబాబు, పఠాభి, ఆరుద్ర.... ప్రభృతులు, ఈ అతినవ్య కవితారీతులకు, 20శ లో, ఆంధ్రభూమిలో అంకురార్పణ చేశారు. మన సత్త్వశాస్త్ర సంబద్ధాలైన, యీ వాదాలలోవి సంజ్ఞలు, వాని అర్థాలను మనకు వెంటనే స్ఫురింపనీయక, మెదడుకు మేతనందించి, పాఠక ధిషణాకషణకు కారకాలైనాయి.

ఉదా : "జీబ్రాకి ఆల్జీబ్రా - లాంకోటు పెంకోళ్ళ తొడిగి
సాహిత్యం పౌరోహిత్యం చేస్తే వెర్రికాదు "సర్రియలిజం"రా సోదరా!" — శ్రీశ్రీ

"వేస్టులాండు" ద్వారా ఇలియట్ కవి చేసిన Shock treatment, మన తెలుగులో "ఫిడేలు రాగాలడజను","రుధిరరాజ్యం" మొదలగురచనలకు జన్మనిచ్చింది.

ఈ అతినవ్యకవులు హృదయంకంటె బుద్ధికి, భావాలకన్న ఊహలకు ప్రాధాన్యమిచ్చి. వస్తు, భావాల వ్యక్తీకరణలో, పదప్రయోగాలలో, ఛందస్సులో వైచిత్రిని చొప్పించి, క్రొత్తదేదో చెప్పి, పాఠకులను విస్మయ వికసితాక్షులను చేయాలనుకొన్నారు. చెప్పదలచిన విషయాన్ని భావనాబలంతోగాక, ఊహాబలంతో చెప్పి, ఆ చెప్పేరీతి సూటిగా హృదయానికి హత్తుకొనునట్లుగాక, మేదస్సుకు మేతనందించి, గిలిగింతలు పెట్టారు. లాటిన్, గ్రీక్, సంస్కృత ....పదాలు కలిపి, శబ్ద వైచిత్ర్యం సాధించినట్లుగా, వీరు సంస్కృతాంధ్రాంగ్ల హిందీ.... భాషా పదాలతో గమ్మత్తుగా గారడీ చేసి, క్రొత్తగా కొన్ని మిశ్రసంధి-సమాన సమాస+అభాసలను కల్పించి, "మణి ప్రవాళ" భాషతో, శబ్ద వైచిత్ర్యంలో, ప్రతీకలతో....

పదార్థాన్ని నిగూఢపరచి, పాఠకుల-మెదడును తట్టి మేల్కొల్పారు. శబ్దవైచిత్ర్య-ప్రియత్వంతో గూఢచిత్రాలను గుప్తంగా గుప్పించి, గుబాళింప జేశారు. కవిత్వంలో హ్రస్వలిపిని చేర్చి, విజ్ఞానవిషయాలను, పారిభాషిక పదాలను పదిలపరచి, కావ్య పరిధిని పెంచి, చమత్కరించాలనుకొన్నారు. ఉదా : కొన్ని మిశ్రసంధులు-Catch + చేయు = క్యాచ్చేయు, మద్రాస్ + సిటీ = మద్రాస్సిటీ, Question + ప్రశ్న = క్రొశ్చన్, చెరిష్ + ఇంచు = చెరిషించు, రన్ + అండి = రనండి, Cup + ఊ = కప్పూ.... .... కొన్ని మిశ్ర-సమాసాలు: హైహీలుయాన, దుస్సాధ్య కాంపిటీషన్.... "కమింగ్స్" ప్రభావానికి లోనైన పతాభి, ఆరుద్ర.... మొ. వారెందరో భావానుగుణంగా, గూఢత్వాన్ని గుదిగొని, ముద్రణను కూడ మార్చి, మచ్చరించారు.

Queue (క్యూ=మనుష్యులవరుస) ను "Q"గా, "You"ను "U" గా... .... ఆయా భాషాపదాలను, ఆయా భాషల్లోనే కాక, ఆయా లిపులతోకూడ సమసించి, ముద్రించి, చమత్కరించారు. ఉదా : నా- Pen (నాయొక్క కలము) ఆపెన్ (ఆమెను) కాపాడున్.... నీ-win (నీయొక్క, జయము)నీవిన్(స్త్రీలకోక-ముడిని). గదిలో light తగ్గిస్తే-ఎలాగుంటుందో బోలో.... అంకెలతో గూఢవాక్య సృష్టి-అపాయం 3 (మూడు) తుంది- 6 (ఆరు) బైట పడుకొంటే-జనతా 7(ఏడు)స్తుంది. అక్షరాలను కత్తిరించి, చమత్కృతిమత్ప్రయోగం చేసిన "ఆరుద్ర"- అందమైన "బ్ర" .... కడుపు నింపు "మె".... దీనిలోవి "బ్ర" = బ్రతుకుకు, "మె" = మెతుకుకు Short hand రూపాలు, అనగా బ్రతుకులో మెతుకు, మెతుకులో బ్రతుకు కొంత గూఢంగా ఉన్నదని చమత్కరించటం ... ఇంకా "పతాభి" రచన "మృణాళిని"లో చిత్రకవితలెన్నో చెన్నొందాయి.

ఇలా, పూర్వవియమోల్లంఘనా లెన్నో చేసిన - కొందరు, కొన్ని మాత్రాచ్ఛందస్సులను, కొన్ని వృత్తాలను, పేరు చెప్పకుండ, ప్రత్యేకంగాను, సామూహికంగాను కలగూరగంపచేసి, ఛందస్సులో కూడ విలక్షణ-గూఢవైచిత్ర్య, వైదగ్ధ్యానుల చాటి చెప్పారు,.... ఇలా ఇంకెన్నో ....

ఇవన్నీ, ప్రతిభా, వ్యుత్పత్తి దారిద్ర్యం వలన వచ్చిన "సాంక్రామిక

వ్యాధు"లని, "దోషా"లని, ప్రాచీన పండిత ప్రకాండులు పంచాయతీచేసి, ప్రచారంతో పంహరింపవచ్చుగాక, నేడివి నిత్యనూతనంగా, వైచిత్ర్యసాధనకు చేసిన, చమత్కృతి మచ్చిత్రభేదాలై నిలిచినవన్న సంగతిని కాదనలేము. ఇక నిత్యం సినిమాలలో, సంభాషణలలో, కొన్ని పత్రికలలో, వ్యాసాలలో.... చూచు చిత్ర భేద విశేషాలను,ద్వంద్వార్థాలను puzzels గురించి,ఏమని,ఎంతని వ్రాయగలము ?

మొత్తంమీద, అతి నవ్య గూఢ చిత్ర రచనలలో, లయ, తూగు.... మొ. లక్షణాలతో "వచనగేయ" మొక్క విరాడ్రూపం ధరించి, విశృంఖలంగా విహరించుచుండనవచ్చు. ఇంకా వివరాలకు ఆయా కవుల రచనలను, డా.సి.నా.రె. పరిశోధన గ్రంథాన్ని, "Figurative Poetry in Sanskrit Literature" ను మా "భాషానమకచిత్రకౌతుకమ్" ను పరిశీలింప ప్రార్థితులు.

## పాశ్చాత్యభాషలలో గూఢ చిత్రాలు

కవిత్వం ఆలోచనల ప్రసాధనకు, భావాభి వ్యంజనకు సంబంధించిన ఒక కళ. అభివ్యంజనతో హర్షోత్పుల్లత కల్గించి, కవివాణి ఆనందప్రసవిణి అవుతుంది. ఒకచోట శైలి, నస్వరత, విచిత్ర కల్పనా శృంఖలాలతో సంబద్ధమైన కవిత, జటిలం కాక తప్పదు. విద్వాంసులు కొందరు తమ విచారధారలను, విచిత్రంగా ప్రకటించుటకు వీలుగా, తమ కావ్యాలలో వక్రోక్తులను, గూఢపద్ధతులను కూడ ప్రవేశపెట్టారు.

ఈ వక్ర-గూఢ-పద్ధతిని ఆంగ్లంలో, ఆబ్లీక్ (Oblique) లేక ఎనిగ్మేటిక్ (Enigmatic) అంటారు. దీని అర్థం "సూటిగా నున్న మార్గాన్ని విడిచి చిత్ర మార్గాన్ని చిత్రించటమన్న మాట. "That which diverges from a straight line" - Jhonson. దీనినే కావ్యంలో, Oblique, మానవానుభవాన్ని ప్రత్యక్ష శబ్దాల ద్వారా వర్ణింపక, వక్రోక్తి లేక గూఢోక్తులతో అభివ్యక్తీకరించుట" ("Poetry which expresses a mental experience not by direct statement but obliquely by implication") అని E.M.W. Tilliyard. 'Style is the dress of thought" (శైలి ఆలోచనలకు అంతరీయము (అచ్ఛాదనము) అన్నాడు పోప్ మహాశయుడు. గ్రీకు, లాటిన్ మొదలగు పాశ్చాత్య భాషల్లోగూడ, ఈ "గూఢ చిత్ర" ఛాయలు కన్పిస్తున్నాయి వాన్ని గూర్చి మాన్యమిత్రులు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ - (మాజీ) కులపతులు జి. ఎన్. రెడ్డిగారు "తిరుపతి-సాహిత్య సమితి వ్యాసావళి"లో వ్రాసిన 'చిత్రకవిత్వ" విమర్శన వ్యాసరాజం. ఒక అభూత పూర్వ పరిశోధన, తప్పక

పఠించి, పరిశీలింపదగినది. రెడ్డిగారి అనుగ్రహానికి కృతజ్ఞతతో - క్రింద చూప బడిన ఆ వ్యాసంలోని కొన్ని ఉదా : పాఠకులు పరిశీలింతురుగాక!

"అక్షర చిత్రానికి సంబంధించి, మనభాషలోలేని ఈ క్రింది రకాల చిత్ర కవిత్వం పాశ్చాత్య భాషలతో కన్పిస్తుంది.

1. Anagram : పదంలోని వర్ణక్రమాన్ని మార్చి, అసలు పదానికి సన్నిహితార్థంకల (గూఢంగా నున్న) మరొక పదాన్ని కల్పించడం ఇందలి విశేషం.... ఉదా : Astronomer-Moon starer, Telegraph - great help, Presbyterian-best in prayer (తెలుగులో-"పాదము" నుండి-పాము పాదము, పాద, పదపా, పదపా....లను కల్పించినట్లు)

గ్రీకు, లాటిన్ భాషలలో ఇటువంటి anagrams కొన్ని ప్రచారానికి వచ్చాయి. Latin భాషలోని "బైబిల్" గ్రంథంలో Pilate ఏసుక్రీస్తును అడిగిన ప్రశ్నరూపమిది, "Quid est Veritas?" (What is truth?) దీనికి క్రీస్తు చెప్పిన సమాధానం-'est vir qui adest' (It is the man who is before you)

ప్రశ్నరూప వాక్యంలోని వర్ణాలే సమాధానపు వాక్యంలో (గూఢంగా) వుండటం గమనించదగిన చిత్రం. ఇట్టి అక్షరచిత్ర రచనలు Hebrew, Frenchమున్నగు భాషలలో కూడ ఉన్నాయి. ఇంగ్లీషులోని ఈ క్రింది anagram చిత్రకవిత్వానికి చక్కని ఉదాహరణం.

"Live, vile, and evil, have the self same letters,
He lives but vile, whom evil holds in fetters,
If you transpose what ladies wear-Veil
Twill plainly show what bad floks are-Vile
Again if you transpose the same,
You'll see an ancient Hebrew name-Live
Change it again, and It will show
What all on earth desire to do-Live
Transpose the letters yet once more
What badmen do you'll them explore- Evil."

2. Acrostics :

ఇది కూడా అక్షరనియమానికి చెందిన ఒకరకపు "చిత్రకవిత"

"A series of lines or verses in which the first, Last or other particular letters form a word phrase etc" అని, Acrosties ను గురించిన వివరణ. గ్రీకు, లాటిన్ భాషలలో కూడా ఇట్టి చిత్ర కవిత్వం కన్పిస్తుంది. Dryden కవిని గురించిన ఈ క్రింది పద్యం చూడండి;

Deep rools on deep in they majestic line
Rich music and the stateliest march combine,
Yet who that hears it high harmonions strain
Deems not they genius them didst half profane
Exhausting thy great power of song on themes.
Not worthy of its strong, effulgent beams.

ఇందులో పాదాది అక్షరాల్ని చేర్చితే "Dryden" అను పదం ఏర్పడుతుంది. ఇట్టి పద్యాలు ఇంగ్లీషులో కవులను గురించి చాలా వున్నాయి.

Stephens అనే గాయకురాల్ని గురించిన ఈ క్రింది Acrostics రచనలో పాదాదివర్ణం, పాదంలోని ప్రతి పదం యొక్క మొదట, పునరుక్తం కూడా చేయబడింది.



She sings so soft, so sweet, so soothing still
That to the tone ten thousand thoughts there thrill.
Elysianecstasics enchant cach car-
Pleasure's pure pinions poise-prince, peasant, peer,
Husting high hymns, Heaven hears her harmoney,
Earth's emy ends, enthrolled each ear, eaeh eye,
Numbers need ninefold nerve, or nearly name,
Soul-stirring stephen's skill,sure seraphs sing the same.

(ఇక్కడ, పాదాదిని ఉన్న ప్రతి వర్ణాన్ని వరుసగా చేర్చి చదివిన, దానితో గూఢంగా నున్న "Stephens" అను గుప్తనామ పదం బహిర్గతమౌతుంది.

3. Telestich :

పాదాదిలోని అక్షరాలను చేర్చితే (దానిలో గుప్తంగా నున్న) ఒక పదం, పాదాంతంలోని అక్షరాలను చేర్చితే (గుప్తంగానున్న) తద్భిన్నార్థంగల మరొక

పదంగా ఏర్పడేటట్లు కావించిన రచనకు " Telestich " అని పేరు. దీన్ని "ప్రతిబింబచిత్రం" అనవచ్చు. ఈ క్రింది పద్యం చూడండి :

Unite and Unite are the same-so say you
Not in wed lock, I weem, has this unity been
In the drama of marriage each wandering gout
To a new face whuld fly-all except you and I
Each seeking to alter the spell in their scene.

పై పద్యంలోని పాదాది అక్షరాలను చేర్చితే " Unite ", పాదాంత అక్షరాలను చేర్చితే " Untie " అవుతుంది....."

ఇంకా, శ్రీ రెడ్డిగారు తెల్పిన పదవాక్య చిత్రాది (Palindroms etc) భేదాలను, త్వరలో ప్రకటింపబడనున్న మా "అనులోమ-విలోమ...." ఆది చిత్ర భేదాలలో వివరింపగలమని మనవి.

ఒక పద్యంలో మరొక పద్యం గర్భితంగా ఉండే "గర్భ కవిత్వ" విశేషాలు, పాశ్చాత్య భాషలలో మృగ్యాలు. పద్మ, చక్ర,... ఆది వస్తువుల ఆకారంలో పైకి గూఢంగా ఇముడ్చదగినట్లు చేసిన పద్యరచన "బంధ కవిత్వం" అనబడుతుంది. ప్రాచ్య సాహిత్య - ప్రభావంతో ఈ బంధకవిత్వం ("Enblamatio Poetry ") "ధనుస్సు-మధుపాత్ర-సిలువ...." ఇత్యాది ఆకారాలలో బంధింపబడినదై, ఆంగ్లాది పాశ్చాత్య భాషలలోను కన్పిస్తుంది. అలెగ్జాండరు కాలమున, అతని తర్వాత కూడ పాశ్చాత్య వాఙ్మయమున నైటింగేల్ గ్రుడ్డు, గొడ్డలి మొదలగు ఆకార బంధములు, అనులోమ-విలోమ పద్యములు కూడ ఉన్నట్లు కీత్ పండితుడు. "History of Sanskrit Literature"లో పేర్కొన్నాడు.

ఇక్కడ, ఈ క్రింది విషయం కొద్దిగా పరిశీలింపదగిన- Anagram, Acrostichs, Telestich.... రకాల అక్షరచిత్ర సంబద్ధ రచనలు, మనభాషలో లేనివి, పాశ్చాత్యభాషలలోనే కన్పిస్తున్నాయని, శ్రీ జి.ఎన్. రెడ్డిగారు చూపిన ఉదా.లను కూడ పైన చూపినాము. కాని ఇట్టివి కించిచ్ఛేదంతో, మన సంస్కృతాది భాషలలో కూడ "చ్యుత చిత్రా"లను పేరుతో, చాల కన్పడుచున్నవని, రెడ్డిగారికి సగౌరవాభివందనాలతో మనవి. వివరాలను మా"చ్యుత - దత్త - చిత్ర చంద్రిక"లో గాంచి, పరిశీలింపగలరు. "విపశ్చితః ప్రమాణమ్"

మరియు, ధ్వని ప్రతిష్ఠాపనాచార్యుని "దేవీశతకం"లో "రేఫవిపర్తన"తో పదంలోని వర్ణక్రమాన్ని మార్చి, మరొక పదాన్ని కల్పించి, అర్థాన్ని సమన్వయించడం కూడ, విశిష్య కన్పడుతోంది.

శ్లో॥ ఖ్యాతి కల్పన దక్షైకా త్వం సామర్గ్యజుషా మితః।
సదా సరక్షసాం ముఖ్య దానవానా ముపస్థితిః॥ ఆ దే. 95

అర్థము : హేదేవి! త్వం=నీవు, ఇతః=ఈలోకమున, అ-నవానాం=క్రొత్తగా సృష్టించినవిగాక, పూర్వమే, "అపౌరుషేయాలు"గా ప్రసిద్ధినొందిన, సామర్గ్యజుషాం=(సామ+ఋక్+యజుషాం) సామ, ఋక్, యజుస్-లను పేర్లు గల వేదములకు (4వ "అథర్వణ" వేదాన్ని మినహాయించి, ఈ మూడు వేదాలను "త్రయీ" అంటారు. "(స్త్రియాం) ఋక్సామయజుషీ ఇతి వేదాస్త్రయస్త్రయీ" అని అమరకోశం) అనుస్థితిః=ప్రాణరూపమైనదానవు, కనుక సదా=ఎల్లపుడు, సరక్ష-సాంముఖ్యదా=సమ్ముఖమున (ఎదుట)నుండి రక్షణ నిచ్చుదానవు. ఖ్యాతి కల్పన దక్షా=సమృద్ధిని - కల్గించుటలో సమర్థురాలవు. ఏకా=సాటిలేని ముఖ్యమైనదానవు. అనగా, వేద విపర్యయదోషములనుండి రక్షించుదానవు.

ఇక్కడ "సామర్గ్యజుషాం"లోని (ర్గ్య=ర్ గ్-య్-అ"లోని) రేఫ ("ర" కారము)ను వివర్తితం చేసిన (మార్చిన)చో, అనగా "రేఫ గ కారము"ల ముందు వెనుకల స్థితిని మార్చి, రేఫకు ముందు "గ"కారమును చేర్చిన, "ర్గ్య"-గ్ర్య"గా మారుతుంది. ఈ"రేఫ వివర్తన" చేసిన తర్వాత, అర్థము నిట్లు చెప్పుకొనుటవలన, ఇది "రేఫ వివర్తకము"నకు ఉదాహరణమై, మరొక "చ్యుత" జాతికి చెందిన చిత్రముగా కన్పడుచున్నది.

## పాశ్చాత్య కవిత్వంలో 17-18 శ.లలో వెలసిన క్రొత్తధోరణులు

డ్రైడెన్ (17శ) యుగం నుండి ఆంగ్ల కవిత్వం ఆకాశయానం మాని, భూతల ప్రయాణం సాగించింది. బుద్ధి గజ్జెకట్టి, గద్దె నెక్కింది. భావనను బైటికి నెట్టింది. వచనం పని కవిత్వమే చేయటం మొదలుపెట్టింది. అప్పట్లో, స్పెన్సరు

కల్పనాలోకం. మిల్టను స్వర్గ నరకాలుకూడ, సొమ్మసిల్లాయి. తర్వాత, పోపు యుగం (18శ)లో, భావన, ప్రతిభాపాటవం పాతబడటంతో, శబ్దవ్యామోహం, రీతి, కీతి, డొంకతిరుగుడు వ్యవహారం ప్రకృతిని మించి, విజృంభించినవి. నిసర్గ సుందర జానపద జీవితం కంటె, నగర సమాజ చిత్రణ వాడెంగా భావింపబడింది. తెలుగులో "సీత" అని చెప్పుటకు బదులుగా, కడలి మొలనూలి చేడియ కన్న పడతి" అన్నట్లుగా, Bird (పక్షి)కు బదులుగా "The feathered inhabitant of the air, "God rest his soul' అనవలసినచోట "Eternal blessings on his shade attend" ప్రత్యక్షమైనది. ఇలా, శబ్దవ్యామోహం చెంగలించటంతో, చమత్కార-పాండిత్య ప్రకర్షలు కవిత్వానికి నికషోపలాలైనాయి. ఈ కాలంలో, కన్నెర్రజేస్తూ పుట్టిన, కాల్పనికోద్యమం, యీ పరిస్థితి నెదుర్కొన్నది.

ఆదిమ మానవుని హృదయంలో ఆయా కాలాలలో రేకెత్తిన, వినోద, విస్మయ, విషాద, ఆనంద.... ఆది భావాలు పాటల రూపంలో పాదుకొన్నాయి. వచనము కన్న కవిత్వం ముందు పుట్టినట్లు, వస్తు నామాల (సంకేతాల) కంటె, ఉపమా, రూపకాద్యలంకారాలు అనాది కాలం నుండి ఆవిర్భవిస్తూనే ఉన్నాయి. ఈ అలంకారాలను ఆంగ్లేయులు "Images "గా పేర్కొన్నారు. " Image " అనగా కల్పనా చిత్రం లేక పదచిత్రం. చిత్రకారుడు రంగులద్వారా తన భావానికి ఆకృతి నిచ్చినట్లు, ఆయా పదాలను బంధించడం ద్వారా, కవి-తన భవ్య భావాలకు రూపకల్పన చేస్తాడు.

క్లాసికల్ కవిత్వకాలంలో, బాహ్యాలంకారంగా భావింపబడిన Imagery కాల్పనిక కవిత్వంలో ప్రధానమై, ఆత్మ స్థానాన్ని ఆక్రమించుకొన్నది. వీరి భావ చిత్రాలు హృదయంగతాలు కాగా, ఊహాచిత్రాలు బుద్ధికి పదును పెట్టినవి. కాల్పనికోద్యమం తర్వాత వచ్చిన "విక్టోరియనిజం" గతానుగతికమై, గతించింది. ఎడ్వర్డియన్, జార్జియన్ యుగాలు, ప్రతిక్షణం పరిణతి చెందుచున్న ప్రజాభిరుచులను ప్రతిబింబింపచేయలేకపోయినవి. వీటినన్నింటిని వెనుకకు నెట్టుకొంటూ వచ్చిన హ్యూమ్, ప్లింట్, ఎజ్రా పౌండు.... మొ. ఇమేజిష్టు కవుల రచనలు కూడ, క్రమంగా, అంతర్ధానం కాజొచ్చినవి. అటుపిమ్మట, కాల్పనికోద్యమాలకు నిరసనగా, అనేక వాదాలు వెలుగుచూచినవి.

ఫ్రెంచి, ఇంగ్లీషు కవితారంగాలలో 19, 20 శ. లో వెలువడిన, సర్రియలిజం, సింబాలిజం మొ. ధోరణులు, పాశ్చాత్యసాహిత్యరంగంలో ప్రబలమై, వస్తువులలోనే కాక, శబ్ద ప్రయోగాలలో, భాషలలో, ఛందస్సులలో, భావ వైఖరులలో, గూఢమైన, అపూర్వ వైవిధ్యాన్ని, వక్రోక్తి మార్గంలో వ్యక్తీకరించాయి. పాశ్చాత్య సర్రియలిజాని (అధివాస్తవికత)కి సింబాలిజానికి (ప్రతీకవాదం) చిత్రకవిత్వంతో కొంత సంబంధమున్నది. అధివాస్తవికతానేతలగు డాలీ, మార్క్స్... ల యొక్క ప్రధాన లక్ష్యం "ఆవేశం, సంప్రదాయం, వాస్తవికత-మొదలగు వానిని వారించి, నిగూఢసత్యాన్ని నిర్ధారించటమే, అయినా, వీరి చిత్రాల లోని సంజ్ఞలు మన తత్త్వ శాస్త్రాలతో ముడిపడి, గూఢంగా నుండుటవల్ల, సర్వత్ర అర్థ స్ఫూర్తినీయక, ధిషణాకర్షణం (బుద్ధికి రాపిడి) కల్గించాయి.

ఇంద్రియాతీత సత్యాన్ని అంగీకరించని, ఈ వాస్తవికతావాదానికి, భిన్నంగా వచ్చిన "సింబాలిజం", ఇంద్రియాతీత-భావ ప్రపంచంవైపు సాగింది. మత, శాస్త్రీయ దృక్పథాలను దూరంగా త్రోసి, తాత్త్విక సత్యాన్వేషణకు పూనుకొన్నది. సంగీతంలో రాగాలకున్న ప్రాధాన్యం, కవిత్వంలో శబ్దాలకున్నదనీ, జప తపాల ద్వారా ఆస్తికులు సాధించే లక్ష్యాన్ని, సింబాలిస్టు కవులు "కళ" ద్వారా సాధిస్తారని తెలిపింది. "మలార్మే" అను ఫ్రెంచి రచయిత, ఈ సింబాలిజానికి సిద్ధాంత ప్రవక్త. అతడు సాహిత్యంలో, విషయం విశదంగా ఉంటే "వచన" మౌతుందనీ, నిగూఢ భావాలను అనేక శబ్దాలతో బంధిస్తే "పద్యం" ఔతుందనీ చెప్పి, "ప్రత్యేక వచన ప్రక్రియ"ను పరాస్తం చేశాడు రోసెట్టి, ఈట్సు-మొ. సింబాలిష్టులు దీనిని ప్రచారం చేశారు. కాని ఆ భావాలను వీరు ప్రతీకల ద్వారా ప్రకటించినా, ఆ భాష ప్రతివారికి అర్థంకాలేదు. ఇలా ప్రజాస్వామ్యానికి, జీవిత సమస్యలకు, విలక్షణంగా దూరం కావటం వలన, ఈ వాదాలు కొద్దిమందికి మాత్రమే పరిమితాలై పోయినవి.

o o o o

# హిన్దీలో గూఢచిత్రాలంకారములు

భోజమహారాజు సంస్కృతంలో చేసిన "గూఢచిత్రాలంకార ప్రక్రియ"ను, హిన్దీ సాహిత్యమున "కేశవమిశ్ర" అనుకరించి వ్రాయగా, తర్వాతివారు మరికొన్ని మార్పులను కూర్చినారు. "ఒక పద్యంలో పదసంధానకౌశలంతో "గుప్తం" చేయబడినదానిని, తెలుసుకోలేని అజ్ఞాని, కింకర్తవ్యతా విమూఢుడు కాగా పండితుడగు పాఠకుడు బుద్ధిబలంతో దానిని వెదకి వెలార్చుటను "గూఢచిత్రాలంకారం"గా, "పదుమనదాసు" తన "కావ్యమంజరి"లో వివరించి, ఇట్లు ఉదహరించెను.

"భేద కహై జో దేహకో, తాసో కహియ న భేద।
జ దపి ప్రేమపరిచారికా, త దపి నివారత వేద॥ ప.కా 10-30

బాహ్యార్థం- దేహాల యొక్క భిన్నతను చెప్పుచున్న వాడెవ్వడుగాని, ఆ భేదాన్ని సరిగా నిర్వచించడంలేదు. వస్తుతః, అది ఒక ప్రేమ పరిచారిక. అయినప్పటికి, అది వేదనివారణ చేస్తోంది. దీనిలోని "గూఢార్థా"న్ని తెలుసుకోవాలంటే, "భేదక-హై"ని"భేదక-హై"గాను,"నివారత వేద"ను"నివా రత వేద"గాను విభజించితే గాని,గూఢార్థం తెలియదు. అలా విభజించగా "ఎవడు ఈ దేహానికి పీడ కలిగిస్తున్నాడో,వానిలో భేదాన్ని చెప్పరాదు. వస్తుతః, అది ప్రేమారాధికయైనా, రతిజ్ఞానాన్ని వదిస్తోంది. అనగా రతిజ్ఞానాన్ని తన దగ్గరకు రానీయటంలేదన్నమాట. ఇక్కడ "నివా"ను నివహ చేయగా, ఈ "వధ" అర్థం వస్తోంది.

ఒక పద్యంలో అడిగిన ప్రశ్నకు, ఆ పద్యంలోనే జవాబు గూఢంగా నీయబడినపుడు లభించు, "గూఢోత్తర" మను చిత్రాలంకార భేదమును, హిందీలో "కేశవకవి" సర్వప్రథమంగా చిత్రించెను. తర్వాత మరికొందరు, దీనినే

# హిన్దీలో గూఢచిత్రాలంకారములు

భోజమహారాజు సంస్కృతంలో చేసిన "గూఢచిత్రాలంకార ప్రక్రియ"ను, హిన్దీ సాహిత్యమున "కేశవమిశ్ర" అనుకరించి ప్రాయగా, తర్వాతివారు మరికొన్ని మార్పులను కూర్చినారు. "ఒక పద్యంలో పదసంధానకౌశలంతో "గుప్తం" చేయబడినదానిని, తెలుసుకోలేని అజ్ఞాని, కింకర్తవ్యతా విమూఢుడు కాగా పండితుడగు పాఠకుడు బుద్ధిబలంతో దానిని వెదకి వెలార్చుటను "గూఢచిత్రాలంకారం"గా, "పదుమనదాసు" తన "కావ్యమంజరి"లో వివరించి, ఇట్లు ఉదహరించెను.

"భేద కహై జో దేహకో, తాసో కహియ న భేద।
జ దపి ప్రేమపరిచారికా, త దపి నివారత వేద॥ ప.కా 10-30

బాహ్యార్థం- దేహం యొక్క భిన్నతను చెప్పుచున్న వాడెవ్వడుగాని, ఆ భేదాన్ని సరిగా నిర్వచించలేము. వస్తుతః, అది ఒక ప్రేమ పరిచారిక. అయినప్పటికి, అది వేదనివారణ చేస్తోంది. దీనిలోని "గూఢార్థా"న్ని తెలుసుకోవాలంటే, "భేదక-హై"ని "భేదక-హై"గాను, "నివా రత వేద"ను "నివా రత వేద"గాను విభజించితే గాని, గూఢార్థం తెలియదు. అలా విభజించగా "ఎవడు ఈ దేహానికి పీడ కలిగిస్తున్నాడో, వానిలో భేదాన్ని చెప్పరాదు. వస్తుతః, అది ప్రేమారాధికయైనా, రతిజ్ఞానాన్ని వదిస్తోంది. అనగా రతిజ్ఞానాన్ని తన దగ్గరకు రానీయటంలేదన్నమాట. ఇక్కడ "నివా"ను నివహ చేయగా, ఈ "వధ" అర్థం వస్తోంది.

ఒక పద్యంలో అడిగిన ప్రశ్నకు, ఆ పద్యంలోనే జవాబు గూఢంగా నీయబడినపుడు లభించు, "గూఢోత్తర" మను చిత్రాలంకార భేదమును, హిందీలో "కేశవకవి" సర్వప్రథమంగా చిత్రించెను. తర్వాత మరికొందరు, దీనినే

సూర – "సాహిత్యలహరి" నుండి కొన్ని ఉదాహరణలు :
* ఒకచో (సమాస - అసమాస-)"శబ్దమాలద్వారా, ఏకార్థ (విశేషార్థ) బోధం.

ఉదా : "జల-సుత-ప్రీతమ-సుత-రిపు-బాంధవ-ఆయుధ-"

శబ్దార్థము - జలసుత=కమల, తత్ప్రియతమ=సూర్య, తత్సుత=కర్ణ,తద్రిపు=అర్జున,తద్బంధు=కృష్ణ,తదాయుధం-గద(ఒక ఆయుధం)గద=రోగం-అనికూడ అర్థం.ఈ దీర్ఘసమాసంలో, ధ్వని సామ్య ఆధారంగా, కవి వివక్షితమైన-గూఢార్థం "గద" అనగా "రోగం."

* మరొకచోట "వర్ణయోగంతో శబ్ద నిర్మాణం," "కొన్ని శబ్దాలలోని వేర్వేరు వర్ణాలను గ్రహించి, వానితో నూతన "గూఢ" శబ్దాన్ని నిర్మించడం. ఉదా ; సూరజ-సుత-మాతా,- సుబౌధకీ అష్య.... సూ.సా. 15.

అర్థం - సూరజ-సుత-మాతా = సూర్యునివలన కలిగిన-కొడుకగు కర్ణునియొక్క-తల్లి=కుంతీ, సుబౌధ=జైన (పండితుడు). మరల ఈ కుంతీ-జైన "పదాలయొక్క, ఆద్యక్షరాలగు "కుం-జై"లను కలుపగా, వచ్చిన, క్రొత్త గూఢ శబ్దం "కుంజై" = పొదరింటిని-నాశనం చేయుట అనే గూఢార్థాన్ని తెల్పుతుంది.

గమనిక : నేయార్థ లక్షణతో కూడ, కవులు కొన్నిచోట్ల వివక్షితార్థాన్ని గూఢం చేశారు.ఈ సుబౌధ"శబ్దానికి 'జైన' అనే అర్థం. నేయార్థ ప్రభావం వలననే వచ్చినది. నేయార్థము=తానేర్పరచుకొనిన, ఒక సంకేతంవలన తెలియదగిన అర్థము.కనుక "సుబౌధ"కు "జైన" అర్థము వాచ్యార్థం కాదు. తానేర్పరచుకొన్న "నేయార్థం" మాత్రమే.

* "రూపసాదృశ్యం లేక ధ్వని సామ్యంతో శాబ్దబోధ। "భూమిసుత-అరి-మిత్ర-రిపు-పుర". భూమిసుత=భూమినుండి పుట్టిన చెట్టు, దానికి - అరి=(చెట్టును చెరచిన)కోతి(హనుమంతుడు), వానికి-మిత్ర=స్నేహితుడు (శ్రీరాముడు), అతనికి-రిపు=శత్రువు (రావణుడు), అతనియొక్క-పుర="లంకా" పట్టణము.

మరల ఈ "లంకా-కటి (నడుము)ని దెల్పు "లంక"ల "ధ్వనిసామ్యం" ఆధారంగా, కవికి ఇష్టమైన, గూఢమైన అర్థం "లంక=కటి" అని తెలియవలెను. ఇట్లే పైన చూపిన "గదా" (ఒక ఆయుధం) సామ్యంతో, గద=రోగము అనికూడ. గూఢార్థం చెప్పవచ్చును.

* "సంఖ్యాసూచక శబ్ద ప్రయోగం". కొన్ని శబ్దాల ప్రయోగం వలన, ఒక నిశ్చిత సంఖ్యాబోధన కలుట.

ఉ." గ్రహ నఛత్ర అరు వేద జాసు ఘరతాహికహాసారంగసమా రే...."

సూ.సా. 24.

ఎవని ఇంటిలో మణి ఉన్నదో, వానికి దీపం యొక్క అవసరం ఏముంటుంది? దీని లోని "గ్రహ-నక్షత్ర (నఛత్ర)-వేద," శబ్ద ప్రయోగంలో, కొన్ని సంఖ్యలు గూఢంగా, దాగియున్నవి. గ్రహ=గ్రహాలు తొమ్మిది, నఛత్ర=అశ్విని, భరణి.... ఆది నక్షత్రాలు -7, వేద=ఋగ్, యజుస్, సామ, అధర్వణములను నాలుగు వేదాలు. ఈ సంఖ్యాబోధన వలన, 9+27+4=40. (చాలీస్). 40 సేర్లొక మణుగు. "మన్" కాబట్టి గ్రహ నఛత్ర-వేద-అర్థం "మన్" అని. యీ "మన్-మణి" శబ్దాల ధ్వని సాదృశ్యాధారంగా "మణి"అను గూఢార్థబోధ కలుగుతోంది.

* "వర్ణలుప్తము" ఛందస్సులోని వర్ణాన్ని లుప్తం చేసి, గూఢ చమత్కారం తెల్పుట.

ఉ. "తమోలమంగా ఇ ఘరై ఇహిబారీ-మిలిచే కీ జియ మేఁరుచిభారీ।
కన్హాఇ ఫిరై కవ ఘౌ ప్యారీ-బిహార కి ఆజుకరై అధికారీ॥"

బిఖారీదాసువి, ఈ పద్యం ప్రతిపదంలోని, ఆది అక్షరాలను"త-మి-క-బి" లను తొలగించిన, మొదట చెప్పుకొన్న పద్యార్థమంతా మారి, గూఢార్థాన్ని రప్పించుటయే, దీనిలోని చమత్కారం. ఇట్లే "మధ్యవర్ణలుప్త" మొ.

*"వర్ణపరివర్తనం"- ఒక వర్ణాన్ని మార్చినంతనే, పద్యార్థం పూర్తిగా మారుట.

ఉ. "సాజ్ సబ్ జాకో...." బిఖారీదాసు ఈ పద్యంలోని "సకారై" లోని "స" ను "న"గా మార్చి, సమస్త పద్యార్థాన్ని తదనుకూలంగా మార్చి, గూఢార్థాన్ని ప్రకటించాడు. ఈ అలంకారం, ఈ కవి "స్వోపజ్ఞకం", సొత్తు అనవచ్చు. ఇంకా వివరాలు, మా "చ్యుతదత్త చిత్ర చంద్రిక"లో గాంచగలరు.

ఇక్లే, భిన్నార్థక, అభిన్నార్థక, భాషాంతరగత, నవకోష్ఠ .... ఆదీ చిత్రములందును ఈ "గూఢార్థత" గలదు. ఆ భేదములను మా "గతిచిత్రగరిమ"లో గాంచగలరు.

ఆధునిక-హిందీలోని "ఛాయావాద, రహస్య వాదాలలోని, అమూర్త భావాభివ్యంజన,-ప్రాకృతిక పదార్థ-భావనల మానవీకరణ, ప్రతీకాత్మకతా-రూపకాత్మకతలను. ప్రతి పాఠకుడు ఎంతవరకు పఠించి, అర్థంచేసుకోగలడు?

వాస్తవానికి, ఈ అన్నింటిలో, అన్నిచోట్ల, దుర్బోధత-, అస్పష్టత, గూఢార్థత, జటిలత్వాలు, కించిద్భేదంతో పాఠక ప్రపంచాన్ని, కికురిస్తూ (వంచిస్తూ)నే ఉన్నాయి.



# ఉపయుక్త గ్రంథకర్తలు- గ్రంథనామ-సంకేత సూచిక

## సంస్కృతమ్

| కవి | గ్రంథనామమ్ | సంకేతమ్ |
|---|---|---|
| వేదవ్యాస | అగ్నిపురాణమ్ | అ. పు. |
| అమరసింహ | అమరకోశమ్ | అ. కో. |
| అజితసేనాచార్య | అలంకారచిన్తామణిః | అ. చి. |
| శ్రీ కృ. బ్ర. పరకాలయతి | అలంకారమణిహారః | అ. మ. |
| అవతారకవి | ఈశ్వరశతకమ్ | అ. ఈ. |
| | ఋగ్వేదము | ఋగ్. |
| క్షేమేంద్ర | కవికంఠాభరణమ్ | క.కం. |
| దేవేశ్వర | కవికల్పలతా | దే. క. |
| అమరచంద్రయతి | కవికల్పలతావృత్తిః | అ. కా. |
| విశ్వేశ్వర | కవీంద్రకర్ణాభరణమ్ | క. క. |
| బాణభట్టు | కాదంబరీ | బా.కా. |
| మమ్మట | కావ్యప్రకాశ | కా. ప్ర. |
| రాజశేఖర | కావ్యమీమాంసా | కా. మీ. |
| దండిమహాకవి | కావ్యాదర్శమ్ | కా. ద. |
| వాగ్భట & హేమచంద్ర | కావ్యానుశాసనమ్ | వా.కా,& హే.కా. |
| రుద్రట | కావ్యాలంకారమ్ | రు. కా. |
| భారవి | కిరాతార్జునీయమ్ | భా. కి. |
| కృష్ణకవి | క్రియాగోపనరామాయణమ్ | క్రి. రా. |
| విశ్వేశ్వరకవిచంద్ర | చమత్కారచంద్రికా | వి.చ.. |
| సంకలనమ్ | చాటుధారాచమత్కారసారః | చా.చ. |
| చక్రకవి | చిత్రరత్నాకరః | చ. చి. |
| ఆనందవర్ధన | దేవీశతకమ్ | ఆ. దే. |
| విద్యానాథ | ప్రతాపరుద్రీయమ్ | వి. ప్ర. |
| వ్యాస | మహాభారతమ్ | మ. భా |
| కృష్ణకవి | మందారమరందచంపూః | మం. చ. |
| జగన్నాథ | రసగంగాధరః | జ. ర. |
| వేంకటాధ్వరి | లక్ష్మీసహస్రమ్ | ల. స. |

| | |
|---|---|
| ధర్మదాససూరి | విదగ్ధముఖమణ్డనమ్ |
| విక్రాలశేషాచార్య | వేంకటేశ్వరచిత్రరత్నాకరమ్1,2,3భా |
| జీవన్యాయతీర్థ | సారస్వతశతకమ్ |
| విశ్వనాథ కవిరాజ | సాహిత్యదర్పణమ్ |

తెలుగు.

| | |
|---|---|
| నాదెళ్ళ పురుషోత్తమకవి | అద్భుతోత్తరరామాయణము. |
| అప్పకవి | అప్పకవీయము |
| సి. నారాయణరెడ్డి | ఆ.ఆం.క.సం. ప్రయోగములు |
| దామెర్ల అంకకవి | ఉషాపరిణయము |
| పింగళి సూరన | కళాపూర్ణోదయము |
| నన్నెచోడ | కుమారసంభవము |
| వేటూరి ప్రభాకరశాస్త్రి | చాటుపద్యమణిమంజరి |
| గాదె ధర్మేశ్వరరావు | తెలుగులో చిత్రకవిత్వము |
| అకుసుమల్లి నారాయణరావు | నారాయణీయము |
| గణపవరపు వేంకటకవి | ప్ర వేం. విజయవిలాసము |
| అందుగుల వెంకయ్య | రామరాజీయము |
| పిండిప్రోలు లక్ష్మణకవి | లంకావిజయము |
| చిత్రకవి పెద్దన | లక్షణసార సంగ్రహము |
| వేదుల సూర్యనారాయణశర్మ | లక్ష్మీసహస్రము చిత్ర స్తబకం |

హిన్దీ

| | |
|---|---|
| రామశంకరశుక్ల "రసాల" | అలంకారపీయూష |
| కేశవదాస | కవిప్రియా |
| భిఖారీదాస | కావ్యనిర్ణయ |
| పదుమనదాస | కావ్యలహరీ |
| జానకీ ప్రసాద | కావ్యసుధాకర |
| సూరదాస | సాహిత్యలహరీ |

English :

M. KRISHNAMACHARIAR
History of Classical Sanskrit Literature

A.B. KEITH
History of Sanskrit Literature

శ్రీనివాస పవర్ ప్రెస్ : అరండల్ పేట : విజయవాడ–2.